శ్రీ

# విమర్శ తరంగిణి

(ప్రథమభాగము)

విమర్శాదర్శక

## నడకుదుటి వీరరాజుపంతులుగారిచే

అప్పుడప్పు డాయాపత్త్రికలకు వ్రాయఁబడిన

విమర్శముల సంపుటము

శ్రీ విద్వజ్జన మనోరంజని ముద్రాశాలయందు

ముద్రింపఁబడి

వి. ఎమ్. ఆర్. బుక్కు డిపోవారిచే

ప్రకటింపఁబడియె.

కాపీ రైటు.] 1931. [రు 1-8-0.

శ్రీరామా.

# ఉపోద్ఘాతము



తమ విమర్శతరంగిణీప్రథమభాగము పంపుచు, దానిపై నుపోద్ఘాతరూపముగా మీయభిప్రాయ మీయ మఱిమఱి కోరుచున్నా నని, కవులును బండితులును బహుగ్రంథద్రష్ట లగు విమర్శకులును నాకుఁ జిరపరిచితులును నగు మహారాజశ్రీ నడకుదుటి వీరరాజుపంతులుగా రుత్తరము వ్రాసినారు.

ఎవియో కొన్ని పుస్తకములు వ్రాసి యాంధ్రభాషాజనని కించుక సేవచేసి యామెయెడ నుడుతభక్తి చూపినవాఁడ నై నప్పటికిని, నేను విమర్శకవర్గములోఁ జేరినవాఁడనుగాను. ఒక్క తాళపత్రగ్రంథ మైనను జూచి యెఱుఁగను. శిలాతామ్రశాసన పరిశీలనవిధానము నాకుఁ దెలియదు. ఇప్పు డట్టియుద్యమములో దిగుటకుఁ దగిన వయసువాఁడను గాను, దానికిఁ జాలిన యారోగ్యమును లేదు. ఇట్టిస్థితిలో నట్టిగ్రంథముపై మీ రేల యభిప్రాయ మీయ సాహసించినా రని యెవరైన నడుగవచ్చును. మిత్రవాక్యమున కెదురాడలేని మొగమోటము గలవాఁడ నగుటయే దానికి ముఖ్యకారణము. అదియుఁగాక మిఠాయి చేయలేకపోవచ్చును గాని యెట్టివాఁడైనను, జేసిన మిఠాయి దిని యిది రుచిమంతముగా నున్నది—లేదు—అని చెప్పఁగలఁడుగదా !

తీఱికచేసికొని, పంపినగ్రంథ మామూలాగ్రముగా స్థూలదృష్టితోఁ జదివి చాల సంతోషించినాను. అందుఁ "పూర్వగ్రంథముల యవస్థలు" అను భాగము పరమసత్య ప్రకటకమై పూర్వపక్షమున కెంతమాత్ర మవకాశము లేనిదై మఱియుఁ జక్కఁగాఁ గన్పట్టుచున్నది.

"రెండునాలుగు లెనిమిది" అను గణితశాస్త్రవిషయకమైనసత్య మసందిగ్ధము, ప్రత్యక్షప్రమాణసిద్ధము. ఆవిషయమున రెం డభిప్రాయము లుండుటకు వీలులేదు. కావ్యగ్రంథవిమర్శన మట్టిది గాదు. అతికష్టమైన పని. అంతర్బాహ్యనిదర్శనముల నాధారముచేసికొని యనుమానప్రమాణసాధనమున సత్యాసత్యనిర్ణయము చేయవలసి యున్నది. మనప్రాచీనులు చారిత్రవిషయము లందంత శ్రద్ధ వహించి యుండలేదు. కాలపౌర్వాపర్యనిర్ధారణమునకుఁ గావలయు సామగ్రియు సిద్ధముచేసిపెట్టి యుండలేదు. మనవాఙ్మయమునకును పాశ్చాత్యగ్రంథజాలమునకును గల ప్రధానభేద మిది.

పై హేతువులనుబట్టి, యనేకవిషయముల భిన్నాభిప్రాయములు వచ్చుట కవకాశము గలుగుచున్నది. క్రొత్తశాసనాదినిదర్శనములు బయలుపడుకొలఁది వెనుకటి యభిప్రాయములు మనము మార్చుకొనవలసివచ్చుచున్నది. కవితాప్రాశస్త్యతారతమ్యములు సాధారణముగా విమర్శకుల యభిరుచుల ననుసరించి నిర్ధారితము లగుచుండును. అట్లైనను

కావ్యములలోఁగూడ నక్కడక్కడ స్వల్పదోషము లుండును. ఎంత సరసకావ్యమందైన నచ్చటచ్చటఁ గొన్నిపట్లు నరసములై శ్లాఘాపాత్రములై యుండకమానవు. కావున సత్యదృక్కులేకైకదృష్టాంతములఁ గాను వ్యష్టిదృష్టితోఁ గాక సమష్టిదృష్టితోఁ జిత్రపరీక్ష చేయునట్లు కావ్యమనోజ్ఞతాపరీక్షయును జేయవలయును.

"సోమునిహారివంశము, కవిరాజశిఖామణి--కావ్యవిశేషములు" అను శీర్షికములు గల వ్యాసములలోఁ జర్చింపఁబడిన విషయములు వివాదాస్పదములై యున్నవి. శ్రీ వీరరాజు పంతులుగారు చక్కఁగా సయుక్తికముగాఁ జేసినపని యితరుల వాదములయొక్క ఖండనము. ఉభయపక్షములవాదములును సంపూర్ణముగా సవిమర్శముగాఁ జదివి పరిశీలింపక తథ్యాతథ్యనిర్ధారణము చేయఁగడఁగుట తగదు గానఁ, దద్విషయము లిటఁ బ్రస్తావింపఁ దలఁచుకొనలేదు.

కావ్యవిమర్శనకృత్య మెంతకష్టమో యంతలోకోపకారకము. సహేతుకముగా సత్కావ్యము లేవో యసత్కావ్యము లేవో విమర్శకులు చూపకున్న, భక్ష్యాభక్ష్యవిచారణ లేకుండఁ దినుబాలకులవలెఁ బఠితలును జెడిపోవుదురు.

సద్విమర్శకుఁడు న్యాయైకదృష్టియై యుండవలయును— పక్షపాతముగాని యీర్ష్యాద్వేషములచే ననర్హగర్హణముగాని కావింపఁగూడదు. బహుగ్రంథపరిచితియు,సునిశితమైనబుద్ధియు,

రసగ్రహణశక్తియు, సామాన్యదృష్టికి గోచరింపని సరసతా నీరసతలును, ఛందోవ్యాకరణాదిగుణదోషములును గనిపట్టఁగల లోఁతుఁజూపును, ఔచిత్యానౌచితీపరిశీలనపాటవమును, వచన రచనానైపుణ్యమును, నాతనివిశిష్టలక్షణములు. స్వపక్షపోషణ పరపక్షనిరసనములు చేయుపట్టులఁ బ్రయోగించుమాటలు వినమ్రములై మృదువులై యుండుట విమర్శనమునకు వన్నె దెచ్చును. ఉచితస్థలములం దుచితరీతిని మితముగా నుపయోగించు నర్మవాక్యములును వక్రోక్తులును క్షంతవ్యములే కాక చిత్తరంజకములు. శైలి,భావములను యుక్తులను సువ్యక్తములఁ జేయుచు ధారాళముగా నుండవలెను. ఇవి మంచివిమర్శగ్రంథము యొక్క లక్షణము లని నే ననుకొనుచున్నాను.

పై సల్లక్షణములలోఁ బెక్కులు శ్రీవీరరాజుపంతులుగారి యీగ్రంథమునకుఁ బట్టిన వని నేను నిస్సందేహముగాఁ జెప్పఁగలను. ఇది భావివిమర్శకుల కొజ్జబంతివలె ననుకరణీయమై యున్నది.

పిఠాపురము
24-1-1931

కూచి నరసింహము.



# విమర్శతరంగిణి

## ౧ సోమునిహరివంశము *

శ్లో. "కిం కవే స్తస్య కావ్యేన కిం కాణ్డేన ధనుష్మతః
పరస్య హృదయే లగ్నం న ఘూర్ణయతి య చ్ఛిరః."

["పరుని (శత్రుని) హృదయమున లగ్నమై, శిరమును ఘూర్ణిల్లఁజేయదేని యావిలుకాని బాణముతో నేమిపని? పరుని (ఇతరుని) యుల్లమున లగ్నమై శిరఃకంపము చేయింపదేని యాకవికావ్యముతో నేమిపని?" అని భావము.]

శ్లో. "త ఏవ పదవిన్యాసా స్త ఏ వార్థవిభూతయః
తథాపి నవ్యం భవతి కావ్యం గ్రథనకౌశలాత్."

["పదములు మనము కనినవియే? అర్థములు మన మెఱిఁగినవే. అయినను కూర్పునేర్పున నెప్పటికప్పుడు క్రొత్తదగుచుఁ గావ్య మింపులు గులుకుచున్న" దని భావము.]

* పీఠికాపురమహారాజప్రాసాదమున జరిగిన యాంధ్రసాహిత్యపరిష ద్వార్షికోత్సవసమయమునఁ జదువఁబడినది.

ఇత్యాద్యభియుక్తోక్తుల కాలవాలం బనఁదగి, యాంధ్ర హరివంశపురాణము రచియించి యాంధ్రుల కొసగి, రాకా సోమునివలె దివంబున వెలుంగు నాచనసోమునిం గూర్చియు, నాతని గ్రంథముంగూర్చియు నొకించుక ప్రస్తావించుచున్నాను.

ఎల్ల భాషలయందును గవితాకన్యను వెలయించినకవుల లో నుత్తమ మధ్యమ సామాన్యాదిభేదములు గలవు. ఆయా భేదములు గలయాయాకవులయందు మరల నుత్తము లేర్పడు చుందురు. ఇట్లేర్పడుచు రాఁగా నొక్కొకభాషయందును నొక్కఁడో, యిద్దఱో, ముగ్గురో, నలువురో యుత్కృష్టకవులు గాఁ బరిగణింపఁబడుదురు. సంస్కృతభాషయందు పురాణ ములను రచియించినవారిలో వాల్మీకివ్యాసు లుత్కృష్టులు; కావ్యముల నొనర్చినవారిలోఁ గాళిదాసభవభూతు లగ్రి గణ్యులు. ఇట్లే తెలుఁగుబాసయందును బొత్తములను వ్రాసిన వారియందు తిక్కనసోమనలు మిన్నలై యున్నారు.* ఇట్లని తక్కినకవులను దక్కువపఱచుచున్నా నని భావింపవలదు. మేలుచేతు లనఁదగినవా రింకను నున్నారు. తెలుఁగుకవుల లోఁ దిక్కనసోమన లిరువురును గన్నాకు లని పండితుల యభిప్రాయము.

---

* నన్నిచోడమహారాజు వీరిద్దఱకంటెను మిన్నగాఁ గానవచ్చు చున్నాఁడు. ఈతనింగూర్చి మఱియొకప్పుడు వ్రాసెదను.

క. "ఘను నన్నయభట్టును ది
క్కన నేఱ్ఱాప్రెగడఁ బొగడి యలికంబునయ
క్షిని డాఁచినట్టి సర్వ
జ్ఞుని నాచనసోమనాథు స్తుతి యొనరింతుక్. "

అని మూఁడవకన్నుడాఁచి వచ్చినసర్వజ్ఞునిఁగాఁ బండిత వర్యు లగుచిన్నయసూరిగారు సోముని స్తుతియించియున్నారు. ఇట్టే యాతనిని మహాకవియనియు, సర్వజ్ఞుఁ డనియు సనాత నాధునాతనులగుకవులు, పండితులు, విమర్శకులు మిక్కిలియుఁ బొగడియున్నారు.

ఇక్కవిచక్రవర్తి యాశ్వేలకులకలశాంబునిధిసంపూర్ణ సోముఁడు. విద్యానగరసంస్థానాస్థానకవిచంద్రముఁడు. ఈతఁడు కవిబ్రహ్మ యగుతిక్కనసోమయాజి కడపటిదశయందు ప్రసిద్ధిఁ గాంచినవాఁడు. ప్రబంధపరమేశ్వరునకుఁ గొంచెము పూర్వముననున్నవాఁడు. ఈతనికాలమును నిర్ధరించుటయందు నాకుం గలయాధారములను మఱియొకప్పుడు ప్రకటించెదను. కాని,

శ్లో. "అలంకృతే శకస్యాబ్దే, రసాభ్రనయనేన్దుభిః
తారణాబ్దే చైత్రమాసే, నవమ్యాం శుక్లపక్షకే."

ఇత్యాది శ్లోకములతో రాగిరేకుపైఁ జెక్కఁబడిన యక్షరములు, తాము నిర్ణయించుకొనినకాలమును విరోధించు చున్న వని "కరాజనయనేన్దుభిః, సాధారణే" అని వ్రైసుదొర

గా రంతగా దిద్దియుండుటయు, దానినే మనవారు ప్రమాణ ముగాఁ గైకొనఁ జూచుటయు సమంజసముగా నుండలే దని మాత్రము ప్రస్తుతము విన్నవించుచున్నాను. చరిత్రశోధకు లింకను బరిశీలింతురుగాక యని వేఁడుచున్నాను.

వేదవ్యాసమహర్షిప్రణీత మని పేర్కొనఁబడు హరి వంశములోనిపూర్వభాగమునుపూర్వహరివంశమనుపేరితోను, ఉత్తరభాగమును ఉత్తరహరివంశ మనుపేరితోను మనసోమ నాథుఁడు తెలిఁగించెను.

తిక్కనసోమయాజి యాంధ్రీకరింపఁగా నున్నభారత శేషమగుహరివంశమును, సర్వవిధముల నాతని కెనయనఁదగు నీసోమనాథుఁడు, ఆతనివలెనే మూలమునకు మెఱుఁగుపెట్టుచు మనోహరముగను, సలక్షణముగను దెలిఁగించి, యాతనివలెనే హరిహరనాథునకే కృతి యిచ్చి యాంధ్రమహాభారతమును సమగ్రమును గావించెను. తనగ్రంథము తిక్కనసోమయాజి గ్రంథమునకు శేషమైనట్లును, సోమయాజితరువాతఁ దాను రచించినట్లును ఈక్రిందిగద్యమునఁ జెప్పియున్నాఁడు.

'ఇది శ్రీమదుభయకవిమిత్త్ర కొమ్మనామాత్యపుత్త్ర బుధారాధనవిరాజి తిక్కనసోమయాజిప్రణీత శ్రీమహాభారత కథానంతరంబున శ్రీమత్సకలభాషాభూషణ సాహిత్యరస పోషణ సంవిధానచక్రవర్తి సంపూర్ణకీర్తి నవీనగుణసనాథ నాచనసోమనాథప్రణీతంబైన...హరివంశంబునందు ... ... ఆశ్వాసము'

తిక్కనసోమయాజివలెనే యొక్కొకయాశ్వాసము మొదటను హరిహరనాథుని సంబోధించి, 'దేవా! వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె' అని వ్రాయుచు, ఆశ్వాసాంతములందును నాతనివలెనే ఒకవృత్తము, ఒక కందము, ఒకమాలిని వీనితో హరిహరనాథుని స్తుతించుచుఁ దనగ్రంథము కవిబ్రహ్మగ్రంథము తరువాతిదే యైనట్లు వెల్లడించినాఁడు.

తాళపత్త్రములయందు దెలుఁగులిపిని వ్రాయఁబడియున్న సంస్కృతహరివంశపుఁబ్రతులలోఁ గొన్నిటికిని, ఆలిపియందే ముద్రింపఁబడిన సంస్కృతహరివంశమునకును, వంగదేశలిపిని (Bengal Characters), దేవనాగరాక్షరములను ముద్రింపఁబడిన సంస్కృతహరివంశములకును ననేకస్థలంబుల ననేకభేదంబులు గలవు.

మఱియు సోమనాథునికి లభించిన మూలమునకును ఎఱ్ఱాప్రెగ్గడకు దొరకిన మూలమునకును విశేషభేద మున్నట్లు గన్పట్టుచున్నది. ఎట్లన,

ఆంధ్రపరిశోధకమహామండలివారు సంపాదించిన సంస్కృతహరివంశపుఁ దాళపత్త్రపుఁబ్రతియందు,

(a) ప్రథమాధ్యాయము మొదలుకొని రుక్మిమారణకథనము గల 124 వ యధ్యాయమువఱకు నున్నగ్రంథము పూర్వభాగముగాను,

(b) బలదేవ మాహాత్మ్యాభివర్ణనము గల 125-వ యధ్యాయము మొదలుకొని యుత్తరభాగముగాను,

గానవచ్చుచున్నవి. సోముని గ్రంథమునకు మూల మిట్టిదే యని స్పష్టమగుచున్నది. ఈపూర్వోత్తరభాగ వివరణము పై ప్రతియందేకాక బొబ్బిలినగరమునఁ గల వ్రాఁతప్రతుల యందుఁ గలదు. ఈప్రతు లన్నిటియందు ముద్రితగ్రంథముల లో లేని 'ఊర్వశీనరకాసురసంభాషణము' మొదలగునవి గలవు. [ మఱియు బలదేవమాహాత్మ్యాభివర్ణనముతో ననఁగా నుత్తరభాగముకథతోఁ బ్రారంభింపఁబడిన సోమునియుత్తర హరివంశముసయితము పైభాగద్వయవిషయమును నిర్ధారణ చేయుచున్నది. ]

ఎఱ్ఱాప్రెగ్గడహరివంశములోనియుత్తరభాగము మొదటి మూఁడాశ్వాసములయందును గానవచ్చు జరాసంధకథ, కాలయవనసంహారము, రుక్మిణీకల్యాణము, ప్రద్యుమ్నజననాదులు, రుక్మివధ, మొదలగు కథలన్నియు నేను చూచిన పైసంస్కృత హరివంశపుఁ బ్రతులఁ బూర్వభాగమునందే యున్నవి. దీనిం బట్టి యీకథలెల్ల సోమునిపూర్వహరివంశమున నుండియుండు నని మనము గ్రహింపవచ్చును. మఱియు గ్రంథాదినుండి కంసవధాంతమువఱకును గలది పూర్వభాగముగాను, మిగిలినది యుత్తరభాగముగాను ఎఱ్ఱాప్రెగ్గడ గ్రంథమునకు మూలమైన ఖ్యాతని హరివంశమువలన నూహింపఁబడుచున్నది.

కావున సర్వజ్ఞశంభుదాసుల మూలగ్రంథములు వే అగుట స్పష్టము.

ఇప్పుడు గానవచ్చుచున్న యుత్తరహరివంశముమాత్ర మే సోమునిగ్రంథమని కొంద ఆధునికులు వ్రాసియున్నారు.

ఆతని సంపూర్ణగ్రంథమే లభింపలే దనియుఁ బ్రకటిత మైనది భాగము మాత్రమే యనియుఁ జరిత్రశోధకులు వ్రాసి యున్నారు.

ఇప్పుడు ప్రచారమున నున్నదియే సోముని గ్రంథమని తలంచువారిలో నెవ్వరును, ఆతని గ్రంథమునకు 'ఉత్తరహరి వంశ' మనునామ మేల గలిగెనో విమర్శించియున్నట్లు గానఁ బడదు. శ్రీమాన్ సీతారామాచార్యులవారు మాత్రము తమ శబ్దరత్నాకరమున

'ఎఱ్ఱాప్రెగడ హరివంశము వ్రాసినతరువాత నాచన సోమన హరివంశమును వ్రాసెను. దానంజేసి యాతనిగ్రంథ ముత్తరహరివంశ మని యెఱుంగం బడుచున్నది' అని వ్రాసి యున్నారు. దీనిని మనంబున నిడికొనియే కాఁబోలు శ్రీవీరేశ లింగముపంతులవారు,

'ఎఱ్ఱాప్రెగడహరివంశము ప్రౌఢముగా నుండలేదన్న యభిప్రాయముతో సీతఁ డీయుత్తరహరివంశమును వ్రాసెను.

అని తమకవిచరిత్రమున వ్రాసియున్నారు. ఈవ్రాఁతలం బట్టి ఎఱ్ఱాప్రెగ్గడది పూర్వహరివంశ మనియు, సోమునిది

యుత్తరహరివంశమనియుఁ బేర్కొనఁబడినదని యభిప్రాయ మైనట్లు తేలు చున్నది. కాని కాలనిర్ణయమునుబట్టి యిది యనుపపన్న మగు చున్నది. ఇంతియకాక పై వివరణములను బట్టియు సోమ నాథుఁడు సంస్కృతహరివంశముపూర్వభాగమును బూర్వహరి వంశ మనుపేరితోను, ఉత్తరభాగమును ఉత్తరహరివంశమను పేరితోను (తిక్కనభారతశేషముగాఁ) దెలిఁగించె నని యూహింప నగుచున్నది. మఱియు నెఱ్ఱన హరివంశమునుత్తర భాగములోని నాలవయాశ్వాసపుఁగథను బెంచియుఁ దగ్గించియు నాఱాశ్వాసముల గ్రంథముగా సోముఁడు వ్రాసె నను నాకానొకరివ్రాఁతగూడ మొదలే నిరాధారమై పోయినది.

ఇఁక నాతఁడు పూర్వహరివంశమును వ్రాసెనా యను విషయము నిప్పుడు విచారింతము.

సోమనాథుఁడు పూర్వహరివంశమును రచియించిన ట్లాతనియుత్తహరివంశమునందే ప్రబలమైనయాధారము గలదు.

క. "హరివంశప్రథమకథాం
తరమునఁ గలవింత లెల్లఁ దప్పక మదిలోఁ
దిరమయ్యెఁ గదా మీఁదట
నరవర! యేకథలొకో వినం బ్రియ మనుడున్."

క. "జనమేజయుఁ డిట్లను న
మ్మునితో బలదేవులావు మును విని మఱియుం
దనియదు మది ముద మొదవఁగ
వినఁగోరెదఁ జెప్పవే వివేకనిధానా!"

ఇచ్చట బలదేవులావు జనమేజయుఁ డింతకుమున్ను వినినట్లును, నింకను వినఁగోరినట్లును దెలియుచున్నది. ఇంతకు మున్ను విన్న బలదేవులా వెచ్చటనున్న దని విచారింపఁగా,

పైని నేను వ్రాసిన సంస్కృతహరివంశపు వ్రాఁతప్రతు లందు పూర్వభాగము కడపటియధ్యాయము చివరశ్లోకముల యందే బలదేవులావు రుక్మివధసందర్భమునఁ జెప్పఁబడియున్నట్లు స్పష్టమైనది. (దీనింబట్టి సోముఁడు బలదేవపరాక్రమము పూర్వ హరివంశమునఁ జెప్పియున్నాఁ డని నిశ్చయ మగుచున్నది.) పిమ్మట సంస్కృతహరివంశోత్తరభాగము ప్రారంభ మైనట్లు పైని నేను వ్రాసినవ్రాఁతప్రతులయం దున్నది. అదియే సోముని యుత్తరహరివంశము నారంభము !

ప్రథమభాగముఁ దెలిఁగింపకయే "ప్రథమభాగమునఁ గలకథలెల్ల వింటివిగదా, మీఁదట నేకథలు వినఁగోరెదవు ?" అని కవి వ్రాసియుండఁ డని యూహింప నగుచున్నది. హరివంశము పురాణము గాని ప్రబంధముగాదు. ప్రబంధము వలె నొకకథయే తీసికొనఁబడి పురవర్ణనాదులతో నింపఁ బడినది గా దీయుత్తరహరివంశము ! పురాణకథలే యనేకము లిందు గలవు పురాణమును దెలిఁగించు నేకవియును బూర్వ భాగమును రచియింపకయే యుత్తరభాగమున "పూర్వభాగ కథ లెల్ల వింటివి గదా ? ఇఁక నేమి వినవలతువు ? " అని వ్రాసియుండఁడు. కావున సోముఁడు హరివంశపూర్వభాగమును సయితము దెలిఁగించి యుండె ననుట యుక్తము.

పూర్వలక్షణగ్రంథములయం దుదాహరింపఁబడిన సోమునిపద్యములలో, నొక్కఁకపద్యము మొదట 'సోముని హరివంశము, సోమునిహరివంశము " అనియే కాని యుత్తర హరివంశ మనునామ మెచ్చటను గానరాదు.

సోముఁడు పూర్వహరివంశమును రచించినట్లొండు రెండు నిదర్శనములు గానవచ్చుచున్నవి. శ్రీమదోగిరాల జగన్నాథ కవిరాజుగారు తమ సుమనోమనోభిరంజనకావ్యము వ్యాఖ్యాన మున నాచనసోమనాథుని యీక్రిందిప్రయోగము నుదాహరించినారు.

'శతతాళదఘ్నహ్రదమున నుఱికెఁ" సుమ. ద్వి. 48 ప. వ్యాఖ్యా.

ఈపాదము గలపద్యము ఉత్తరహరివంశమున లేదు. ఇది శ్రీకృష్ణుఁడు యమునానదియందుండు కాళియనాగరాజు హ్రదమున నుఱికినఘట్టములోనిదని తోఁచుచున్నది. నలువది మూఁడేండ్లక్రిందటఁ గవియే ముద్రింపించుకొన్నగ్రంథములోని దీయుదాహరణము. ప్రక్షిప్తమనుటకుఁ గాని, లేఖకప్రమాద మనుటకుఁ గాని వలనుపడునది గాదు. కాళియుని మడువున శ్రీకృష్ణుఁ డుఱికినది పూర్వహరివంశములోనికథయై యున్నది.

నలువదియేండ్లక్రిందటివఱకును గల యిమ్మహాగ్రంథ మిప్పు డేమయ్యెనో యని భాషాభిమానుల కెవ్వరికి విచారము గలుగకుండును? మొన్న టి జగన్నాథకవి యంట! సోముని

హరివంశపునిండుప్రతియఁట ! నేఁడు గానరాదఁట! కాలమా! దానిని నీపొట్టను బెట్టుకొంటివా యేమి ?—శ్రీజగన్నాథకవి గారికుటుంబము గోదావరిమండలములోని (ఫ్రెంచి వారి యానాముకడనున్న) నీలపల్లెగ్రామమునకు వెడలిపోయినట్లు వినియుంటిని. మహనీయు లెవ్వరైన దానియునికిని గనుఁ గొందురుగాక యని వేఁడుచున్నాను.

మఱియు, పరిబంధమణిభూషణములోని సోమునిపద్య మనఁబడు

సీ. పురుడు వుచ్చిననాఁడ పూతనామోతన
స్తన్యజీవితములు చవులు సూచె,
వెన్నమ్రింగెడినాఁడ వెడఁదపొక్కిటిలోని
జగము వల్లవరాజసతికిఁ జూపెఁ,
దడవియాడెడునాఁడ దనుజరూపములైన
మద్దులయుద్దులు మలఁగఁజేసె,
నడవనేర్చిననాఁడ బుడమిప్రేఁ గంతయుఁ
బాపఁబూనినతనపనులు దెలిపెఁ,
గాచె శరణాగతులఁ బశుగణము గాచెఁ
గేలగిరి యెత్తె యెత్తెఁ బాంచాలిమాన
మనఁగఁ బొగడొందుదేవర నాశ్రయింతు
జిష్ణుసఖుఁ గౌస్తుభాలంకరిష్ణుఁ గృష్ణు.

అనుదానిలోఁ గొన్ని లేఖకప్రమాదములున్నను, శైలిని బట్టి యీపద్యము సోమునిదేయని తోఁచెడిని. ఇది యమునా జలములలో శ్రీకృష్ణునిఁ గాంచిన యక్రూరునిస్తవములోని దనియుఁ బూర్వహరివంశములోని దనియు నూహింప నగు చున్నది. అక్రూరస్తవము పూర్వహరివంశములోనిదే.

ఇంకను లక్షణగ్రంథజాలమున నెచ్చటనైన సోముని పూర్వహరివంశములోని పద్యము లుదాహరింపఁబడి యున్న వేమో విచారింపవలసి యున్నది. (ఆనందరంగరాట్ఛందము నందును గొన్ని సోమునిపద్యములు గానవచ్చుచున్నవి.)

సోముని యుత్తరహరివంశమునకు నవతారిక లభింపలే దని కొందఱు తమవిచారమును దెలిపియున్నారు. పూర్వహరివంశమున నుండు నవతారిక యుత్తరహరివంశమున నెట్లుండఁగలదు? నన్నయ మొదటిమూఁడుపర్వములను దెలిఁగించి, భారతమును విడిచి దివంబున కరుగఁగా, కవిబ్రహ్మ నాలవపర్వము మొదట నవతారికాదులను వ్రాసినట్లే, సోమయాజి స్వర్గారోహణ మొనర్చినతరువాతఁ దత్కవితాపీఠము నధిరోహించిన సర్వజ్ఞుఁడును భారతశేష మగుహరివంశమును దాను దెలిఁగించుటనుగూర్చియుఁ దనవంశాదులఁగూర్చియుఁ దనపూర్వహరివంశమునఁ జెప్పియుండును. మఱియుఁ దిక్కన సోమయాజిగ్రంథమునకుఁదనగ్రంథము శేషమైనట్లు తోఁపించుటకే యాశ్వాసాద్యంతపద్యముల నాతని వలెనే కూర్చి తన

గద్యమునం దయ్యభిప్రాయము "తిక్కనసోమయాజిప్రణీత శ్రీమహాభారతకథానంతరంబున" తాను రచియించినట్లు స్పష్టపఱిచినాఁడు.

కావున సోమనాథమహాకవి తిక్కనసోమయాజితరువాత భారతశేషమగుహరివంశమును దెలిఁగించి యాంధ్రమహాభారతము సమగ్రముఁగావించెననియు, నం దాతనిపూర్వహరివంశ మాంధ్రదేశదౌర్భాగ్యమున నేమూలనో డాఁగి యుండు ననియుఁ దలంపనై యున్నది. భాషాభిమాను లెవ్వరైనఁ దగుప్రయత్నము లొనర్చి యమ్మహాగ్రంథమును బయటికిఁ దెత్తు రని మఱియొకపరి వేఁడుచున్నాను.

ఇప్పట్టున "తనహరివంశముతోనే యాంధ్రమహాభారతము సమగ్రమైనట్లు సోమనాథుఁడు తలఁచియుండెనేని యారణ్యపర్వభాగమును దెలిఁగింపక యేలవిడిచెను ?" అని కొందఱు ప్రశ్నింతురు. దీనికి నుత్తరముగా "తిక్కనసోమయాజి యేకారణమున నారణ్యపర్వశేషమును ముట్టలేదో సోమనాథుఁడు నాకారణముననే తాఁకియుండఁడు; సర్వజ్ఞునకుఁ గవిబ్రహ్మ ననుసరింపవలయు ననునిచ్ఛయే కాని నన్నియ ననుసరించుతలంపు లేదు..." ఇవి మొదలగు సామాన్యములైన యుక్తులు కొందఱు చెప్పుదురు. కాని, సూక్ష్మదృష్టిం బరికించువారికి నీక్రిందిసమాధాన మేర్పడు నని తలంచెదను.

నన్నయభట్టారకుఁడు మొదటిమూఁడుపర్వములను సంపూర్ణముగనే తెలిఁగించెను. తిక్కనసోమన మారనలనాఁటికి నవి (సమగ్రముగనే) యుండెను. కావుననే తిక్కన 'మహితాత్ముఁడు నన్నియభట్టు మూఁడుకృతులు రచించె' నని చెప్పెను. మారనయు 'భారతసంహితకు మునుత్రిపర్వములు' నన్నియ రచించెనని చెప్పెను. ఎఱ్ఱాప్రెగ్గడకుఁ బూర్వమున నున్నయయ్యిరువురు నట్లు స్పష్టముగఁ జెప్పియుండ వారిది 'సామాన్యప్రవాఁత' యనుట న్యాయేతరము.

ఆరణ్యపర్వమును నన్నయయే సంపూర్ణముగఁ దెలిఁగించె ననియు, నెఱ్ఱాప్రెగ్గడ చేసినది శిథిలభాగపూరణమే కాని ప్రత్యేకరచనము గాదనియు నిరూపించుటకు ననేక కారణములు గానవచ్చుచున్నవి. అవ్వానిం బ్రదర్శించుటకు నిది యదను గామి విరమించుచుఁ బ్రస్తుతవిషయమునకు వచ్చెదను.

ఇప్పుడు గానవచ్చు నుత్తరహరివంశము, దాని యాఱవయాశ్వాసముతోనే పరిసమాప్తి నొందియుండు నని కొందఱు వ్రాసినారు. కాని యయ్యాశ్వాసముతో గ్రంథము ముగిసినట్లు గనరాదు. ఏమన, ఆఱవయాశ్వాసము కడపటి గద్యమునందు 'సర్వంబును షష్ఠాశ్వాసము' అని వ్రాయఁబడి యుండలేదు. తక్కినయాశ్వాసములవలెనే యదియు

'ఉత్తరహరివంశమునందు షష్ఠాశ్వాసము*' అని వ్రాయఁబడి, ముందేదో కథ యున్నట్లు చాటుచున్నది. గ్రంథము సమగ్రమై యుండెనేని యట్లున్నఁడు నుండదు. తిక్కన యేకాశ్వాసములగల పర్వంబుల కడపట సయితము '......... పర్వంబునందు సర్వంబు నేకాశ్వాసము.' అని వ్రాసియున్నాఁడు. ఇట్టిచో గ్రంథమును ముగించెనేని సోమనాథుఁడట్లు వ్రాయక యుండునా? హరివంశమున నింకను వ్రాయవలసిన కథ లనేకములు గలవు. ఫలశ్రుతియు నిందు లేదు. గ్రంథమును సమాప్తి నొందించెనేని సోమయాజివలెనే సోముఁడును ఫలశ్రుతి వ్రాయక విడువఁడు. మూలమునను, ఎఱ్ఱన హరివంశమునను ఫలశ్రుతి యున్నది. కావున నీయాఱవయాశ్వాసముతోనే సోమునియుత్తరహరివంశము ముగిసె నని తలంచుట సరికాదు.

ఆతనిసంపూర్ణగ్రంథమే లభింపలేదనియు, ప్రకటితమైనది భాగమాత్రమే యనియుఁ బరిశోధకులు వ్రాసిన వాక్యములు నాయూహను బలపఱుచుచున్నవి.

ఈరీతిని సోమనాథుని యత్యుత్తమగ్రంథ మగు నాంధ్రహరివంశము నానాముఖములఁ జెదరియున్నది. ఉన్న గ్రంథమైన లభియింపఁ జేసిన దానికై పరమేశ్వరునకు

* షష్ఠాశ్వాసాంత్యభాగము కొంత ప్రక్షిప్తమైనట్లు కన్పట్టెడిని.

సహస్రాభివాదనంబు లర్పించుచున్నాను. (ఉన్నయాశ్వాసముల సంఖ్యయైనను క్రమమైనది గాదని తోఁచెడిని.)

సోముని గ్రంథమునందు నర్థవైభవము, భావసౌందర్యము, రసావిష్కరణము, అలంకారవైచిత్రి, పదప్రయోగనైపుణి, రచనాచమత్కృతి, భాషాపారిశుద్ధ్యము, పాత్రగుణపోషణము మొదలగు సత్కావ్యలక్షణము లన్నియుఁ గానవచ్చుచుండుటయే కాక, యింతకుము న్నేగ్రంథమునను లేని నూతనమార్గము లందు గోచరించుచున్నవి. వానినెల్ల వేఱొక సంపూర్ణవిమర్శగ్రంథమున వివరింపనున్నాఁడను.

ఆంధ్రకవులలో నుత్తమోత్తముఁ డనికొనియాడఁబడిన యిక్కవిచక్రవర్తిపైఁ గొంతకాలముకిందట నొకానొకరు, కొన్నిదోషముల నారోపించుచు, 'ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక' యం దొకవ్యాసమును బ్రకటించిరి. ఆవ్యాసము వెడలిన పిమ్మట వారు చూపినదోషములు సత్యములే యనుకొని కొందఱు విద్యార్థులే భ్రమఁజెందిరన నిఁక విద్యార్థులమాట యేల? వారు సోమునిపై నారోపించిన 'దోషములు, దుర్గుణములు' అనునవి భ్రమప్రమాదపరికల్పితము లని నేనిందు నిరూపించితిని.

ఇప్పట్టున విమర్శ మన కెట్లుండవలయునో విచారింపవలసియున్నది. కాని, దానివిస్తరణమున కిది యదనుగాదు. విరమించెదను.

పైని నేను సూచించిన వ్యాసమున సోమునిపై ననేక దోషములు మోపఁబడినవి. అందు ముఖ్యము లగువానికి నిందుసమాధానము లియ్యఁబడియున్నవి. ఆవ్యాసమును వ్రాసిన వారు బ్ర. రా. అనంతకృష్ణశర్మగారు. వారు తమయొక్కొక్క యాక్షేపమునందు సోమునితో నెఱ్ఱాప్రెగ్గడను బోల్చుచు, శంభుదాసునియొద్ద నీసర్వజ్ఞుని నల్పజ్ఞునిఁగాఁ బరిగణించుచు వచ్చిరి. దానంజేసి యిందు నచ్చటచ్చట నెఱ్ఱనపద్యములను గూర్చియు, నెఱ్ఱననుగూర్చియుఁ జర్చింపవలసి వచ్చినది. ఇప్పుడు పైవ్యాసములోని సోమునిం గూర్చిన యొక్కొక యాక్షేపమును ముందుగ వ్రాసి దానికి నాయుత్తరమును వ్రాయుచున్నాను.

i అక్షే. దీర్ఘసమాసములు తెలుఁగుకవితకు వికారములే యని నామతము. కోమలములై మనోహరములైన యలఁతి తెలుఁగుపల్కు లుండ, హనుమంతుని తోఁకవలె... దీర్ఘసమాసమును బ్రయోగించినఁ దెలుఁగున కేమి గౌరవము?.........ఈసోమునిపద్యముం దిలకింపుఁడు.

స్రగ్ధర. గాండీవారావఝంపాఘటితభయదివౌ
కఃపురాంత-పురంధ్రీ
గండాభోగశ్రీమాంభఃకణకలుషితగం
గాతరంగాభిషంగా

ఖండాస్మత్కాండపాళీకబళితసకలా
కాశసీమానిశాంతో
ద్దండాతికాంతగర్వాంతకయమభటసం
తానముం గానవైతిన్.

"ఆహా! ఏమి యీసమాసపుఁబొందిక! ఇందు నిరర్థక విషయము లెన్ని! నిరర్థకపదము లెన్ని! వీరము, శృంగారము, భయానకము, శోకము, నన్నిరసములను జేర్చి పిసికి పిండివంట చేసిన ట్లున్నదే యీపద్యము! ఈదీర్ఘసమాసము నింత యనుచితముగ నీచోట నేమిఫలము నాశించి ప్రయోగించినాఁడో యీసోమునికే—కాదు దేవునకే యెఱుక! సాధారణముగ సోమునిసమాసము లనేకము లిట్టివ......"

ఈరీతిగ సోముని నిందించి యచ్చటనే యెఱ్ఱనను వీరిట్లు పొగడినారు.

"నన్నయతిక్కనలకుం బోలె నెఱ్ఱనకును బ్రాయికముగఁ బిచ్చిపిచ్చియలంకారములయందును, బ్రాసములయందును, దీర్ఘసమాసములయందును నాశ లేదు. ఆతనిపద్యము లన్నియు స్వభావోక్తిమధురములై యలఁతియలఁతితుసియలుగఁ గూర్పఁబడి సుకుమారము లయి చదువరుల చెవుల కమృతంపుఁదుంపురులఁ జిలుకుచుండును." ఇది శర్మగారి వ్రాఁత.

ఈక్రిందియెత్తినపద్యములు సోముని పైపద్యమువంటివే యని యెఱుంగవచ్చును.

"మహాస్రగ్ధర. కని రుగ్రాహానక్రగ్రహాణఘుమఘుమా
కారకల్లోలడోలా
స్వనప్రద్యోతకేళీసరభసఫణాభృ
చ్ఛాయజూటాగ్రిభాస్వ
ద్ఘనరత్నోద్దంచితోద్యత్కటకుటిలమయూ
ఖచ్ఛటాటోపమిథ్యా
జనితౌర్వారంభశుంభత్సలిలనివహాని
స్తంద్రు రత్నాకరేంద్రున్."

నృసిం. తృ. ౩ ప.

ఇట్టి "యతియతియతియతినియతగుసుకుమారపద్యము" లెట్టిగ్రంథములలో నింకనుగలవు! చూడుఁడు. ఒకటిరెండు:-

"స్రగ్. క్షేపిష్టప్రేష్టతార్క్ష్యోత్థితరుచివిసరత్త్విషస్తాశ్వదీప్తి..." హరి, ఉ. భా. 8 ఆశ్వా.

"మ. స్ర. కని రాపాతాళమూలక్షతశిఖరిశిఖాకల్పితోత్తుంగ......" హరి. ఉ. భా. 1 ఆశ్వా.

ఆంధ్రగ్రంథములయం దతిదీర్ఘసమాసములు గల పద్యములను వ్రాయుట యుక్తమని నేనును నననను. కాని కావ్యలక్షణములను బట్టి యుండఁదగినచోట్ల నవి యున్నను

సహ్యాములేయనియు వానినంతగా దూషించుట న్యాయ్యము గాదనియు విన్నవించుచున్నాను.

మిశ్రకావ్యములయందుఁ గవులు తత్తద్రసోద్బోధకములై, యుచితములై యొప్పు పలుపోకలఁ బోవుచుందురు. చూడుఁడు! కవిబ్రహ్మ యగు తిక్కనసోమయాజి దుర్యోధను నెట్లు వర్ణించియున్నాఁడో! ఒక్కటియే యలంతితునియ!

స్రగ్ధర. మాళిస్రక్సంగరంగన్మధుకరపటలీ
మానసాకృష్టివిద్యా
శాలిన్యారాజ్జరేఖాంజలిపుటఘటనా
చారుఫాలస్థలస్మ్రా
పాలశ్రేణీవిశాలాంబకకుముదవనీ
బాంధవాయత్తచంద్ర
శ్రీలీలాగాఢకాంతిస్మితవదనరుచి
స్ఫీతు నాగేంద్రకేతుఁ. ’

విరాట. తృ. 78 ప.

నైపద్యములోఁ దిక్కన యెత్తిన లేఫలము నాసించి నారో సోముఁడును నాఫలమునే యాశించినాఁడు! వారికవి యెట్లుచితము లయ్యెనో సోమునకు నట్లె యయ్యెను!

పైని వ్రాసినసోముని ‘గాండీవాగావ…… ’ పద్యమునుగూర్చి దానియర్థము, భావము, సందర్భము మొదలగు వానియందు ఏను వేఱభిప్రాయమునొంది రాగ చిహ్నాంకితము

లగు ననేక వాక్యములతో నాతనిని మిక్కిలియు నిందించినారు. వారియర్థభావము లివి !

శ. బ్రా. "అర్జునుఁడు మృత్యువువాతం బడనున్న విప్రకుమారుని రక్షింపఁ బంతములు పల్కి యచ్చటికిఁబోయి, తనకుఁ దెలియకయే యాశిశువు మృతినొందఁగా, శ్రీకృష్ణుని యొద్దఁ దాను బల్కినబీరములు నిష్ప్రయోజనములగుట దలపోసి,యవమాన మయ్యెనే యని సంకటపడు సంవిధానము నన్నగారితోఁ జెప్పుపద్యమిది ! ప్రకరణమునకును శైలికిని నెంతసొగసైన పొత్తు గలసినదో చూచితిరా! గాండీవారావము యొక్క దెబ్బకు దేవతలయంతఃపురస్త్రీలకెల్ల భయముకలిగినది. దానివలన వారి చెక్కిళ్లపైఁ జెమట పొడమినదఁట ! ఆచెమట సామాన్యము గాదు సుఁడీ ! గంగాతరంగముల నెల్లఁ గలుషితములుగాఁ జేయఁజాలినది ! ఆగంగాతరంగములతోఁ జేరి యఖండములైన వర్జునుని బాణసమూహములు ? అర్థమేమో ! ఆబాణసమూహము చే సమస్తమగు నాకాశప్రదేశమును నొకగృహము కబళితంబైనదఁట ! ఆగృహమునుగూడ నుద్దండముగనతిక్రమించినారు కుమారునిజంపినయమభటులు! వారి నర్జునుఁడు కానఁడయ్యెనఁట! ఎత్తిన దేమి దించినదేమి!" అని వ్రాసిరి. "ప్రకరణమునకును శైలికిని నెంతసొగసైనపొత్తు గలసినదో చూచితిరా ?" (అని యాక్షేపము.)

పొత్తు గలసినదో లేదో చూతము.

అర్జునుఁ డకాలమున మేటివిలుకాఁడు. అంతకుము న్నపజయ మన నెట్టిదో యెఱుఁగఁడు. తనగాండివమువృథపోని దను ధైర్యము గలవాఁడు. అప్పు డాతఁడు చేయఁబోయినది శ్రీకృష్ణుఁ డొనర్పఁదగిన మహాకార్యము. ఇట్టికార్యము మున్నె న్నఁడును జేసి యెఱుంగఁడు. దానిని జేయలేకపోవుదునా యని తలంచుసమయ మది! ఇవన్నియు నిట్లుండ, నీవిషయమును ధానుష్కకులాగ్రగణ్యుఁడై, కాలవశమున శరతల్పగతుఁడై యున్న భీష్ముని యాజ్ఞచే ధర్మరాజునకు నీచరిత్రమును జెప్పు చున్నాఁడు. అచ్చటసోదరులును, యుద్ధవీరులగు రాజశ్రేష్ఠు లును గలరు. ఇందఱ యెదుట యమభటులతోఁ దాను బ్రతి ఘటించిన విషయమును, అప్పుడు తాను జూపిన పరాక్రమ మును జెప్పుచో క్షత్త్రియకులశిరోమణి యైనయర్జునుని మనో భావగతు లెట్లుండునో యూహింప సోమనాథమహాకవి తద్రి చనాసమయమునఁ దాను బార్థుఁడైనాఁడు. తోడనే యాతని హృదయమున వీరకరుణాద్భుతభయానకాది రసమ్ములొక్క మ్మడి నుదయించి కావ్యనిబంధనల కనుగుణమగునిట్టిపద్యమును రచియింపఁ జేసినవి.

పైపద్యమునకుఁ బ్రతిపదార్థమును మాని భావమును సందర్భమును వివరించెదను.

"పండియుఁ బొల్లవోయె నని బ్రాహ్మణి లోపల నేడ్వఁ" గానే సవ్యసాచి తానున్న గ్రామమునుండియాకాశము

సీమ (హద్దు)గా నొక బాణగృహమును నిర్మించెను. యమకింకరు లాబాణగేహమును దాటి పోకుండునట్లు చేయవలయు నని సంభ్రమాశ్చర్యమనస్కుఁ డగునాతని యప్పటితలంపు. పిల్లవానిని యమభటులు గొనిపోవు నానిముసముననే యంతటి బాణగృహమును నిర్మించుటకు నాతని గాండీవ మెంతటిపని చేయవలసియుండును ? [అతివేగమునఁ బనిసేయు (బట్టలు) కుట్టుయంత్రముచప్పుడునుబట్టి గాండీవధ్వనిని దెలిసికొనుఁడు.] ఆసమయముననే బయలువెడలిన గాండీవనిర్ఘోషము భూమ్యాంతరాళముల నిండి స్వర్గమునకే కాక దానిలోని యంతఃపురములకును బోయినది. అమరపురంధ్రు లంతకుమున్ను స్వర్గమున జరిగిన యనేకయుద్ధములయందలి రాక్షసవీరుల ధనురారావముల వినికి కలవడియున్నవా రయ్యు స్వనితసహస్రతుల్యమగునాగాండీవనిస్వనమును విని భయముఁ జెందిరి. ఆభయముచే నస్వేదగాత్ర లగువారి గండభాగములయందును జెమ్మట వొడమెను. దీనినిబట్టి యర్జునుఁడు, యమకింకరులయెడలఁదాను చూపినపరాక్రమము నచ్చటివారి కెట్లు తెలిపెనో మనము గ్రహింపవచ్చును.

బాణపంజరమునుండి యమభటులు పోలేరా యను శంకకు నుత్తరము చెప్పుచున్నాఁడు.

ఆకాశగంగ స్వచ్ఛమైనది. అది శ్వేతగణముఁబోసిది. దానిని నిర్మలయశస్సుతోఁ గవులు పోల్చెదరు. అట్టివైశద్య

ముతోఁ గూడినవియద్గంగాతరంగిణీతరంగము లెట్టిధావళ్య ముతో నొప్పుచుండునో యూహింపుఁడు. అట్టిధవళతరంగము లను ఫల్గునుని వాఁడిబాణములు తమస్వచ్ఛతచే ధిక్కరించు చున్నవి. ఏల ? వియన్నదీభంగములు, నిర్జరకాంతల చెక్కుల యందలి (మకరికాపత్త్రముల కస్తూరితో మిళితములైన) స్వేదాంభఃకణముల కలయికలచే మలినీకృతము లైనవి. వానిమాలిన్య మగపడకుండ నర్జునునిబాణములు వానిని గప్పుచున్నవి. (తమ నైశిత్యశుభ్రత్వములచే వానిని మీఱుచున్న వని భావము.) అట్టి సునిశితశరములనుండి యమకింకరులు దాఁటి పోలే రని యాశయము. యమభటులొకవేళ మొఱకుఁదనముఁ జూపి దాఁటి పోవుదు రనుకొన్నను, వాఁడిగల యాయమ్ములనడుమ నుండి, యప్పుడే పుట్టువుఁ గాంచిన యానెత్తురుఁగందును గొనిపో వెఱతు రని యాసమయమున నయ్యభిమన్యు జనకుఁడు భావించెను. ఎట్లు భావించిన నేమి ? అర్జునుఁడు మనుష్య మాత్రుఁడు. ఈశ్వరమాయను మానవుఁడు జయింపఁగలఁడా? తనయఖండకాండపాళిచేఁ గబళితమైన యాకాశముసీమగాఁగల నిశాంతమునుండి యుద్దండమై యతిక్రమించిన గర్భాంతక యమభటసంతానమును దుద కాతఁడు గాన లేకపోయెను! ఎత్తినదియు దించినదియు గాండివమే. ఇందు నిరర్థకపదము లెవ్వి ? చూపుఁడు ? ఆఁడుదియగు ద్రౌపదీదేవి, కీచకునిఁ దా సడలించుటను భీమునితో రహస్యస్థలంబున,

శా. " దుర్వారోద్యమబాహువిక్రమకళాస్తోకప్రతాపస్ఫుర
ద్గర్వాంధప్రతివీరనిర్మథనవిద్యాపారగుల్ ........ "

ఇత్యాదిగ నుద్రేకముమెయిఁ జెప్పినట్లు కవిబ్రహ్మ వ్రాసియుండఁగా, ద్రౌపది కే కాక మగలకును మగఁ డయిన అర్జునుఁడు, తాను యమభటులను బ్రతిబంధించుటను భీష్మాది యోధవీరులతో నవ్వీరరంగంబున 'గాండీవారా' వేత్యాదిగ శూరత్వముమెయిఁ బలికినట్లు సర్వజ్ఞుఁడు వ్రాసియుండుట ప్రకరణోచితము కాదా ?

ii. ఆక్షే. మఱియు నీయమకముం గనుండు !

" అనుచు ననుచారిణై విప్రుఁ డరుగుదేరఁ, దేర గాండివ మిడి యస్మదీయమహిమ ! మహిమతుంగ మతంగను మనసు మాయ, మాయ గన్నులఁ గ్రమ్మఁ గ్రమ్మఱితి నేను. "

"ఇదియును బైయర్జునుఁ డన్నగారితోఁ దనగోడు చెప్పుకొనుపద్యమే ! నిజముగఁ గవితాలతకుఁ బ్రాసములు ప్రాసములే ! " అని శర్మగారు వ్రాసిరి.

ప్రత్యు. ఈపద్య మెట్టిసందర్భమునఁ జెప్పఁబడినదో యించుక యూహించుట న్యాయ్యము. యమభటసంతానమును గానలేని యర్జునుని పైయవస్థను గంటిరి గావునఁ దరువాతిపద్యములఁ గనుఁడు.

గీ. " పోయె బాలుండు యదువృష్ణిభోజకులముఁ,
చిన్నపోయెను జూడ వచ్చినజనంబు

డించిపోయె మదీయగాండివములజ్జ
వోయెఁ గానిపోయె భూసురపుత్త్రి జముఁడు."

వ. "ఇవ్విధంబున గాండివమ్ము లావు వమ్మయినం గ్రమ్మ
నుమ్మలికంబున విన్నవైన నన్నుం జూచి యవ్విప్రుండు,"

క. "ఓపార్థ ! నిన్ను నమ్మితిఁ
బాపని రక్షింప కిట్లపార్థుఁడ వైతే
నాపాలిపారిజాతము
గోపాలకచక్రివర్తిఁ గానిరా నైతిక్."

చ. "పిలిచితి నన్న! నిన్న? నతిభీతుఁడ విప్రుఁడ నమ్మినాఁడ నీ
పలుకనృతంబుగాఁదగునె ?... పోటుమగఁడై యిటుచేసితి
యూపటలా
గాక ~~ఇంతలో~~
నిలుతుమురారినన్నచటనీళ్లనుముంచినఁబాలముంచినన్."

క. "నీ వేమిసేయు దీగాం
డీవము నీకిచ్చి యయ్యు డెప్పరమైనన్
లావు గలదంచుఁ బలికిన
పావకుచేఁ గాదె కోలుపడితిఁ గుమారున్ ?"

ఇత్యాది వాక్యశూలములతో నాబాఁపఁడు, ద్వారకకు మరలి
పోవునాతనిం బొడుచుచు వెంబడించినాఁడు.

(పైపద్యములయందలి కరుణరససంవిధాన మెట్టిమృదు
మధురపదములతో నెట్టిశబ్దాలంకారములతో నిండియుండి,

పాతకులహృద్యయముల నేరీతిని గరఁగించుచున్నదో విచారింపుఁడు.)

అర్జునుఁ డుత్తమకులసంజాతుఁడు. పౌరుషశాలి. ఎన్నఁడు నుడిఁగోవని పరాక్రమము నేఁడు వమ్మయ్యెఁ గదా యను విచార మాతనిని చుట్టుముట్టెను. అవ్విచారమునకు వెంటఁబడ్డ బ్రాహ్మణుని యేడ్పువలనిచింత తోడయ్యెను. ఆతని కా సమయమున నేమియుఁ దోఁపదయ్యెను. ఊరక కూర్చుండ లేక తెచ్చుకొనిన శిశుహత్యా బ్రహ్మహత్యా మహాపాతకములు నడుమ జ్ఞప్తికి వచ్చుచుండెను. అప్పటిన నాతనిమనోభావ గతు లెట్లుండును? కోపము, విచారము, పాపభీతి, సంభ్రమము, లజ్జ మొదలగు వికారము లాతనిహృదయరంగమున దండడి వెట్టుచుండెను. ఆతఁడు ద్వారకకుఁ బోవుచుండెను. అచ్చటఁ దనబావగారికిఁ దనమోము నెట్లు చూపఁగల నని యాపోటుమగఁడు మిక్కిలియుఁ జింతించినవాఁ డయ్యెను. అలవిగానిపని యయ్యెనే యని పశ్చాత్తాపము నందెను. "ఏమీ! యమభటసంతాన మెంతలో నన్ను వంచించి పోయినది?" అని ఱిచ్చవడియెను. వెనుక బ్రాహ్మణుఁడు రోదనము చేయుచుండెను. యదువృష్టిభోజవిభులు కాళ్ళీడ్చు కొనుచుఁ జిన్నవోయినమోములను దనమోముతో వియ్యమందించుచు వచ్చుచుండిరి. 'ఛీ! ఇట్టిబ్రదు కేల?' యని యుప్పొర్థఁ డెంచి, మరణము నిచ్చగించి యేసీట నైనను

గాండీవముతోఁ బశుఁదలంచి వెనుకకు మరలెను. మరలఁగా నే యేమఱుపు మోముతోఁడి బ్రాహ్మణయ్య యెదురయ్యెను! 'అయ్యో! బావగారితోఁ జెప్పి విప్రకుమారు నిప్పింపవలదా?' యని మరల నగరాభిముఖుఁ డయ్యెను. 'ఇసీ! సిగ్గుమాలి చేఁతగాని వాఁడ నైతి నని యాతనితో నెట్లు ముచ్చటింపఁగల?' నని వెనుకకుఁ దగ్గెను. '(శ్రీ)కృష్ణుఁడు విప్రకుమారుని బ్రదికించు నెడ నవ్విప్రునియమందానందముం గాంచి మనశ్శల్యము నూడఁ బెఱికికొనవలదా?' యని మరలఁ బత్తనమునకుఁ బ్రయాణ మయ్యెను. "ఒకవేళఁ గృష్ణుండు 'మించిపోయినపని సాధ్య మగునా?' యనుచోఁ జావునకన్న నెక్కుడు సంకటము ఘటిల్లునే?" యని వెనుకకు నడుగు వెట్టెను. "ఆహా! జగన్నాటకసూత్రధారి యగునప్పరమేశ్వరునియెదుట మనుష్యుఁ డగు నే నెంత? మదీయపరాక్రమాదు లమ్మహామహుని యమేయశక్తిముంగల నెంతటివి? సర్వశక్తుఁ డగు నాతఁడు బ్రాహ్మణబాలునిఁ దప్పక బ్రదికింపఁగలఁడు. అక్కల్యాణ కార్యమును గన్నులారఁ గని యానందించెదఁ గాక!" అని మనసు పదిలముచేసికొని తిరిగి ద్వారకకు నడచెను.

ఈరీతి వితర్కరజ్జువులఁ బెనంగి గతాగతకారియైన యుయ్యెల వంటివాఁడ నైతిఁజుఁడీ యని తెలుపువాఁడుంబోలెఁ బరేంగితజ్ఞు లగు శాంతనవాదిమహావీరులకుఁ జెప్పినవిధమును దోఁపించు నిష్పద్యము ముక్తగ్రపదగ్రస్తమైఖరి నద్భుతవి

తఱఁబోటును జాటుచు నెట్టిమనోహరమును సార్థకమును నగు యమకముతోఁ గూర్పఁబడినదో పరికింపుఁడు ! ఇట్టిచోటుల నుండు శబ్దాలంకారములె నింద్యములుగాక హృదయంగమము లగుచున్నవి.

రసము, భావము, సందర్భము చెడకుండ ననురూప ములును, మనోహరములును నగుశబ్దాలంకారములతోఁ గవితాకన్యకను గైసేసినవాఁ డాంధ్రకవులలో నెల్ల సాహిత్య రసపోషణసంవిధానచక్రవర్తి యగు మనసవీనగుణసనాథుఁ డొక్కఁడే ! ఎఱ్ఱాప్రెగ్గడయు శబ్దాలంకారముల నుపయో గించినాఁడు. ఇరువురకవుల పద్యములం గనుఁడు.

సోమన:-క. "అరవిందనయన శరముల
సరవిం దనయమవుసూపఁ జాపము గుదునై
పరివేషముగల చంద్రుని
సరివేషముఁదాల్చె మొగము జగము నుతింపన్."

(ఇచ్చట శరప్రయోగసంవేగతత్కౌశలాదులు సూచింపఁ బడినవి. ఇట్లే తక్కినవియు నెఱుంగఁదగుచు.)

క. "అమరారిచెవులముందఱఁ
గొమరారి వెలుంగు నమృతకుండలముల న
నత్తిమిరారిద్వయ మన నె
త్తిమురారికిఁ జూపియప్పుడు తెలియఁగఁబలుకున్."

క. "తనయునికిం బ్రబలము నా
తనయునికిం గలుగ దతనితనయుని కైనన్
వనజోదర యాదరమునఁ
గనుఁగొని ప్రాగ్జ్యోతిషంబుఁ గరుణింపఁదగున్."

(ఇవియేకాక యిట్టిపద్యము లాతనిగ్రంథమున నింకను గలవు. ఆయాఘట్టములఁ బరిశీలించువారికి నాయాస్థలంబుల నవి యుచితములే యని తోఁపింపకమానవు.)

ఎఱ్ఱన:-క. "వినతాతనయుఁడు మున్నుగ
ననుపమతేజుఁడయితోఁచుహరి తానయనన్
వినతాతనయుఁడు మున్నుగ
ననుపమతేజుఁడయి తోఁచె హరి యుదయాద్రిన్."

క. "క్షణమాత్రము చిత్రరథ
క్షణము ననుభవించి పిదపఁ గాశ్యునిఁ గమలే
క్షణుఁడు శిరశ్ఛేదవిచ
క్షణుఁ డయి వీరజనయోగ్యగతులకు ననిచెన్."

క. "నెల లన్నియు నిండఁగ న
న్నెలఁతకు నుదయించె నిండునెల పున్నమకున్
నెలకొని యుదయించుపగిది
నెలమి కొడుకు సకలకువలయేచ్ఛాపరుఁడై."

(హరివంశము.)

తిక్కన:-క. "మాసినచందము( దను(గని
రోసినడెందంబు గలతరుణిచే( గడుబి
ట్టేసిన మదనునిచే ధృతి
వాసిన బెగడొందు సింహబలు( ద్దట్టిరొఁడన్."
(విరా. ద్వి. 32.)

క. "చరువులు నమ్ముని చెప్పిన
తరువులు పీడ్వడియె సుతకు( దల్లికి నట్ల
య్యిరువురు నుపయోగింప(గ
గరువులు తత్తత్ప్రకార కలితములయ్యెన్." అను.

III ఆక్షే. ప్రాసముపైననే దృష్టి యుంచి పాండి త్యము చూప నెంచిన వానికి రసముపై( గన్నుండదు. తాను వ్రాయుమాట లనర్థకము లని తలంప(డు. సోమునియం దీదుర్గుణము ప్రబలిన దనుటకు మఱి యొంతు నిదర్శనములు చూపెదను.

" క. ఫాల్గునమాసము మొదలుగ
ఫల్గుణసఖు( డతులతరతపశ్చరణమునన్
వల్గదరివర్గహయఖుర
ఫల్గువు గానీక మనసు పదిలము చేసెన్."

" ఎట్లయిన నుపక్రమించిన 'ల్గ' ప్రాసమునుబూర్తి చేయవలయును. కావుననే నిష్ప్రయోజనముగ మూ(డవ పాదమున నంత 'పొడవు' సమాసము వేయవలసివచ్చినది.

లేకున్న 'ఫల్గువు' అనుపదమే చాంచల్యమును దెలుపుచుండ 'వల్గదరివర్గహాయఖుర' అను వాక్యన్యాసమున కేమిఫలము?"

ప్రత్యు: 'ఫల్గు' వునకుఁ జాంచల్య మనునర్థము లేదు, ఫల్గు వనఁగా 'అసార' మని యర్థము ('అసారం ఫల్గు' అని అమరము.) లేని యర్థముం గల్పించి సకలభాషాభూష ణునియెడ దుర్గుణము నారోపించినారు.

'వల్గదరివర్గఫల్గువు'—వల్గత్=పరువెత్తుచున్న, అరి వర్గ=కామక్రోధాదులనియెడు, హాయఖుర = గుఱ్ఱపుడెక్కల (త్రొక్కుడు) చేత, ఫల్గువు=అసారమైనది అనియర్థము.

కామక్రోధాద్యరిషడ్వర్గము విజృంభింపకుండ మనసును సారవంతముఁ జేయవలయు ననునుత్కృష్టనీతిని బోధించు చున్న దీపద్యము!

'ల్గ' కారప్రాసముకొఱకు సర్వజ్ఞకవి నిరర్థకపద న్యాస మొనర్పఁడు. ఇక్కవిసింహునకు నిట్టిప్రాసమును బూర్తిసేయుట యొకదొడ్డకార్యము గాదు. చూడుఁడు:—

శా. నాల్గుం జెల్లెడి బ్రహ్మచారి గృహి వానప్రస్థ యత్యాశ్రమం
బు ల్గైవల్యవివత్సు లంతిమపదంబుం జేరువా రిట్టిపీ
ఠల్గోపించిన నంతకుండుఁ జెడుమీరా యోర్పువారిమ్మెయిక్
మే ల్గీడాడక వీరిఁ జేరి మనుఁడీ మీమీశుభప్రాప్తికిన్.

ఉత్తరహరివం. 4 ఆశ్వా.

దీర్ఘసమాసములం దిచ్చలేక యలంతిపలుకులం గూర్చు వాఁ డని శర్మగారు పొగడినయెల్లన ప్రయోగములం గనుఁడు.

ఉ. "శ్రీస్తనకుంకుమద్రవనిషిక్తభుజాంతరభాగవిస్ఫుర
త్కౌస్తుభరత్నమాత్మరుచిగర్వితనాభిసరోజసౌరభ
ప్రస్తుతమత్తభృంగరవరాగరసోల్బణభోగిభోగత
ల్పాస్తరణుం దలంచు సుకృతాత్ములపాసు సమస్తకిల్బిషుల్",
(నృసిం. 2.)

'ల్గ' కొఱకు సోముఁడు 'వల్గదరివర్గహయఖుర' అనునంత 'పొడవు' సమాసమునే వేసినాఁడు గాని 'స్త' కొఱకు నెల్లన యెంతపొడవుసమాసమును వ్రాసినాఁడో కనుఁడు !

యతిప్రాసాదినియమబద్ధము లగుపద్యములు రచించు నప్పుడు మహాకవు లాకాంక్షచొరసము, నర్థముఁ జెడకుండఁ గొన్ని పదములఁ బెంపుసేయుటయుఁ గలదు.

క. "అనుటయు లెస్సగఁ దలఁచితి
విను మొకకీటంబునకు 'వేదవ్యాసుం
బున లోకహిత మొనర్చిన
మునికి' నయిన సత్కథనము మునినుతచరితా !"
(అను 4. ఆ. 314.)

కవిబ్రహ్మ యగుతిక్కనసోమయాజి వ్యాసుఁడనుటకు నెట్లు పాదమును బొడిగించినాఁడో ! మఱియు,

క. "ఏణాక్షి నపుడు వెడసిం
గాణిం గొని యలరుఁదూపుగమిఁ జక్కోరయే
ఖాణముగాఁ గలిగినకం
ఖాణపుద్వార పింజపింజ గాడఁగ నేసెన్." (విజ. ప్ర.)

'కంతుఁ' డనుట కెంత పెంచినాఁడో రసవత్ప్రబంధకర్త చేమకూర కవిరాజు! ఇట్టిప్రయోగములు సంస్కృతాంధ్రగ్రంథముల వేనవేలు గలవు.

ఈవిధ మగునింకొకప్రాసము గలపద్దెముపై శర్మగారి యాక్షేపము.

క. "ప్రాగ్జ్యోతిషంబుఁ గడిసి స
దృగ్జ్యాటంకృతులు లేక దితిజులమీఁదన్
దృగ్జ్యోత్స్న జేవురింపఁగ
దిగ్జ్యాగగనాంతరంబు దివురఁగ నార్చెన్."

b. (ఆక్షేపము.) "'ప్రాగ్జ్యోతిషంబు' అని యుపక్రమించినాఁడు. కావున నిఁక మూఁడు 'గ్జ్యా'లు సంపాదించి వ్రాయుకున్న సర్వజ్ఞత్వమునకు లోపము గలుగు నని సోముఁడు తలంచినాఁడు. పద్యము ముగిసినఁ జాలు నని వ్రాసినాఁడు. కావుననే యౌచిత్యవిమర్శనము వెనుకఁబడినది. చూడుఁడు! నరకాసురుని జంపవచ్చి సింహనాద మొనర్చి యుద్ధసన్నద్ధుఁడగు శ్రీకృష్ణుని మహాక్రూర మగుచూపును జ్యోత్స్నతోఁ బోల్చ

టకన్న వేఱ యనుచితము కలదా ? ప్రాసలుబ్ధు లైనవారిగతి యంతయు నింతే. ”

పరిత్యక్త: సింహానాద మొనర్చుటచేఁ గూరమైన చూపును దృగ్జ్యోత్స్నతోఁ బోల్చినట్లు వీరర్థము చేసికొన్నారు గాఁబోలు! శ్రీకృష్ణుఁ డంతకుము న్నచట సింహనాద మొనర్ప లేదు. ఈపద్యమున నట్టియర్థమును లేదు. పద్యభావ మెట్లన,

“ మురాది రాక్షసులను జంపినపిమ్మట శ్రీకృష్ణుఁడు ‘ ప్రాగ్జ్యోతిష ’ నగరమును గడిసెను. (ఒక ‘జ్యా’ యైనది.) అచ్చట సద్భగ్జ్యాటంకృతులు లేకపోయినవి. (రెండు ‘జ్యా’ లయినవి) తాను సమరమునకు వచ్చినట్లు శత్రువులకుఁ దెలియుపాంటు ‘భక్తత్రాణపరాయణమై యెప్పుడును వెన్నెలవలెఁ జల్లనై యుండుచూపు, (దృగ్జ్యోత్స్న ’—దీనితో మూఁడు ‘జ్యా’లు !) ఆసమయమున జేవురించునట్లు ’ దిగ్జ్యా గగనాంతరము దివురఁగ సింహానాద మొనర్చెను. (అనంతిపం డొలిచినట్లు నాలవ ‘జ్యా’ కూడఁ బూర్తియైనది !) అంతియ కాని ముందే సింహానాద మొనర్చినట్లు గ్రంథమున లేదు. చూడుఁ డీక్రింది యెత్తి పెగ్గడప్రయోగమును !

వ. అయుగ్రపశువుల కభిముఖుండై ... యవ్వీరుండు(కృష్ణుఁడు) ఘోరంబుగా నదల్చి

క. నాపిడికిటికడఁదిపిడుగు
 నా పగిదియ దీనఁ దగిలి యంతకుఁ డైనన్

రూపు సెడకుండఁ బోవనె
యీపాపాత్మకుల మిమ్ము నేల సహింతున్.
మ. అని యావిష్కృతతీవ్రముష్టియగుచున్ హాసోజ్జ్వలా
స్యంబునన్
కనలుప్పొంగఁగ ........................" ఎఱ్ఱనహరివం.

ఇచ్చట 'హాసోజ్జ్వలాస్యము' కనలినది. అచ్చట 'దృగ్జ్యోత్స్న' జేవురించినది. పరీక్షించుచో నెఱ్ఱన ప్రయోగమైన సందేహము గల్గించునేమో కాని సోమునిది కలిగించుట లేదు !

IV (a.) ఆక్షే—"ఒక్కొకపుటకుఁ దక్కువ లేని వచనముల నిఱికించి తనకుఁ గలతిక్క నంతయుఁ బూర్తిగ విడిపించినాఁడు" అని శర్మగారాక్షేపించిరి.

ప్రత్యు—సోముని వచనములు తత్తదుచితస్థలముల నెలకొల్పఁబడియున్నవి. యుద్ధము, అరణ్యము మొదలగువర్ణనములం దక్క నితరస్థలంబుల నాతఁడు పెద్దవచనముల నుపయోగింపలేదు. ఆయావర్ణనముల ననుసరించి యాతఁడావచనముల నాయాగతులను వ్రాసియున్నాఁడు. ఎఱ్ఱనయుఁ బెద్దపెద్దవచనముల వ్రాసియున్నాఁడు. హరివంశనృసింహపురాణములం గనుఁడు.

(b) "ఎఱ్ఱన గ్రహచారము చాలక, ఒండు రెండు చోట్ల నుభయప్రాసముల నొండు రెండు చేర్పఁగా, సోముఁడు ను

తెలునకుఁ బొరుపత్తె మిచ్చినఁ దెల్లవాఱుబోఁకఁ గట్టు' నన్నట్లు తనవచనములలో నెల్లఁబొరిసము లోకపరస్పహస్ర ముఁ దూర్చియుంచెను.' అని తీవ్రముగ వ్రాసినారు.

సోమునివచనములవంటివి నన్నయతిక్కనలగ్రంథముల యందును గలవు. వానిలోని కొన్ని యిందే ముందు గానన గును. (సోమునిఁజూచియే యెఱ్ఱన వ్రాసికొనె ననఁదగును.)

ఆక్షే. (౮) "తనవచనములలోఁ గొన్నివిచిత్రమార్గములను సోముఁ డవలంబించినాఁడు. అవి యేవియన సమానార్థకము లగుమాటల ననేకములఁ గూర్చి వ్రాయుట మొదలగునవి. చూడుఁడు !

" చలంబుకొని పోరి పోరిలోఁ దునుకలయ్యును, దుమురయ్యును నింతింతలయ్యును నిసుమంత లయ్యును జిఱు నిగ్గయ్యును జినురుపలయ్యును మంచయ్యును మడిమంచ యయ్యును రూపుసెడినం దిరుగుడువడి వాహినిచిక్కువడిచిందఱ వందలై నుడిసి మల్లామట్టిగా యేపుదెగి యెప్పురుసుపట్టయి యనువుదప్పి యదవదయై యంతంత నిలిచి యవురుసవురై పాఱులేక పలపలనై వెఱఁగుపడి వెల్లవెల్లనై చిమ్ముడిపడి చెల్లాచెదరై పొడవడంగి ప్రోవుననొక్కండై పోవిడిచి పోయిన పోకై పోయినం గని." ........

"ఇంచుమించుగ నిందలివాక్యము లెల్ల నేకార్థకములు, వినుటకు విచిత్రముగ నుండుట యొకటియె కాక వీనివలన

నేమిప్రయోజనము ? ఇట్టి వొకటిరెండు వాడినలోకోక్తి యన వచ్చును గాని యున్నవియు లేనివియు నొకపరశ్శతము గూర్చిన నేమి 'వ్రాంత రోంత' కాక ? " అని యాక్షేపించిరి.

ప్రత్యు:—ఇది యుద్రేకించి మిన్నుముట్టిన వీరరసమును వర్ణించుఘట్టము. శ్రీకృష్ణునిచే నిహతంబయి క్రమక్రమముగఁ బాడ వడంగి కదనరంగమును దుదకు శూన్యముగ నొనర్చిన నరకసైన్యము స్థితిగతులను దెలుపుచున్నది. దీనిం జదువునప్పుడు యుద్ధరంగము పాఠకులకుఁ గన్నులయెదుటఁ గనఁబడుచున్నట్లుండును. తిక్కనసోమయాజియు యుద్ధపర్వముల నిట్టే పలువిధములగురచనలను గావించియున్నాఁడు. ఈవచనము సోమనాథకవీంద్రునివచవరచనాసామర్థ్య మనన్యసాధ్య మని చాటుచున్నది. సోమనాథుని నెఱ్ఱనమహాకవియు ననుకరించి యుండెను. శ్రీనాథుఁ డీసోమునివచనము మెచ్చుకొని పద్యమునే వ్రాసిపెట్టెను! ఇట్లే పలువురు సర్వజ్ఞుని యాకల్పన ననుకరించియుండిరి. చూడుఁడు ! 'నన్నయతిక్కనలకుంబోలెఁ బిచ్చిపిచ్చియలంకారములయం దాశ లేని యెఱ్ఱన'

"వ. ......పోటువడియును, వ్రేటువడియును, ద్రొక్కువడియును, జిక్కువడియును, నలిగులిమై, లావుచెడి, చేవదఱిఁగి, కడంకలు గుదుసువడి, కడిమిపెంపు వోనాడి... ........" (హరివంశం. పూ. 6 ఆ.) అని వ్రాసియుండెను. మఱియు శ్రీనాథుఁడు,

"సీ. అనువుదప్పిరి నొచ్చి రలసి రాపదనొంది
రదవదలైరి చీకాకుపడిరి,
అంగలార్చిరి విచ్చి రారడిఁబొందిరి
బ్రిమసిరి పాఱిరి పల్లటిలిరి
బెగ్గడిల్లిరి పికాపికలైరి సొలసిరి
కులకులఁగూసిరి కుతిలపడిరి
గగ్గులకాడైరి కలఁగి రోటాడిరి
వెలవెల్లనైరి నివ్వెఱఁగుపడిరి
యవురుసవ్వైరి గుజగుజలైరి డస్సి
సొల్లఁబోయిరి వెగ్గిరి తల్లడిలిరి
సిగ్గుపడిరొచ్చవడిరియిస్సియిస్సియైరి
తారకునిచేతమునులుబృందారకులును."

సారం. కే. ఆ. 10.

సారంగు తమ్మయ్య వైజయంతీవిలాసములోని

"శా. ఆవిప్రోత్తము వజ్రపంజరనిభం బై నిశ్చలంబైన స
ద్భావంబంగనసాహచర్యగుణసంపత్కింబునన్ లోహమై
గ్రావంబై దృఢదారువై తరుణవృక్షంబై ఫలప్రాయమై
పూవై తన్మకరందమై కరఁగెఁ జో ఫో నీళ్లకుం బల్చనై."

అని విప్రనారాయణునిస్థితిని వైపద్య మెట్లు హృదయంగమముగ వర్ణించినదో నరకునిసైన్యముగతిని పైసోముని వచనమును నట్లే వర్ణించినది.

తిక్కనసోమయాజి యీదృశము లగుపోకలఁ బోవు టయుఁ, 'బిచ్చిపిచ్చి యలంకారములపై నాశగలిగియుండు టయు' నీ క్రిందివచనములం జూచినఁ దెలియవచ్చును. గ్రంథ విస్తరభీతిని పద్యములసంఖ్యయు వానిమొదళ్ళును నిచ్చు చున్నాను.

భీష్మపర్వ. తృతీ. 239 ప. ...“ముందటికాళ్ళు దుని సిన వ్రెగ్గతిలం బడుటయు......”

“...కేతనంబులఁ గూల్చియు, ఘోటకంబులఁ బీల్చి యు, సారథుల రూపుమాపియు, నరదంబులు పఱియలు వాపియు...ఇట్లే........” ద్రోణప. 1 ఆ. 208.

“...కరుల నుచ్చిపోవుచుఁ దేరులవిఱుచుచు...(ఇది మొదలు)...చిక్కువడియును సుడివడియును, గలంగియుఁ దొలంగియు, నెఱచఱచియు విచ్చిపఱచియు...” (వఱకు) ద్రోణ. ద్వి. 18.

ఇట్టివచనములుగాక తిక్కన యించుమించుగ నేకార్థ కముల నిట్లు పద్యమును వ్రాసెను.

సీ. సూతులఁ దెగటార్చి కేతనంబుల వీట
తాటంబుసేసి రథ్యములఁగూర్చి
......(పద్యమంతయుఁ జూడుడు.) కర్ణ. ప్రథ. 140 ప.

(b.) (తిక్కనగ్రంథములో నింకను నానావిధములగు రచనలు గలవు.)

ఆక్షే. "వినుటయకాక వీనివలన నేమిప్రయోజనము?"

యుద్ధములు నానావిధములు. వానిని గవులు నానా విధముల వర్ణింతురు. "శ్రీరాముఁడు రావణునిఁ బరిమార్చె నన్నఁజాలదా? యుద్ధకాండమున నంతవర్ణనమేల? పాండవులు దుర్యోధనాదులఁ జంపిరన్నఁ జాలదా? యుద్ధమున నైదు పర్వము లేల? వానివలన నేమిప్రయోజనము?" అనుట యెట్టిదో యిదియు నట్టిదే యగును.

(ూ.) ఆక్షే. "సోమునివర్ణనము, వాక్యసంయోజనము మొదలగువిషయములయం దౌచిత్యవిచారము చేసినచో సోమునియెడ ననౌచిత్యమున కుదాహరణము లనేకములు గనవచ్చును." అని శర్మగారు వ్రాసిరి. వీరు వ్రాసిన యనౌచిత్యములం గనుఁడు!

(౩.) "నరకాసురుఁడు దేవతలనెల్లఁ బాఱఁదోలి స్వర్గమునఁ బ్రవేశింపఁగా నందు 'కాశ్మీరనికరంబు కహ్లారపుష్పోపహారంబు లేని గృహాంగణములు' గానవచ్చినవఁట. సరియే కాని స్వర్గమునకును గాశ్మీరమునకు నాకాలమున నేమివ్యాపారము నడచుచుండెనా యాలోకపుఁజందన మాలోకమునఁ గానవచ్చుటకు?"

ప్రత్యు. కవి యీపద్యమును శబ్దాలంకారములతో వ్రాసియున్నాఁడు. లేఖకప్రమాదమున నీపాదమును నాలవపాదమును నియమరహితముగఁ గన్పట్టుచున్నవి. వివాదమున

నున్న యిప్పాదమును మాత్రము ప్రస్తుతము 'కాశ్మీరనీరంబుఁ గల్హాతపుష్పోపహారంబు లేని సౌధాంగణములు' అనిసవరించు కొందము. శర్మగారు 'కాశ్మీర' మనఁగాఁ జందనమని యర్థము వ్రాసిరి. దానికిఁ జందన మను నర్థము లేదు. (కాశ్మీరనీరము=కుంకుమపన్నీరము.) భూలోకమున నున్నవారి కాలోకమున నున్నవారితో యుద్ధవ్యాపారము జరిగినట్లు లంగీకరించిన మనము తక్కినవ్యాపారములు జరిగినట్లేల యొప్పికొనరాదు?

(b.) " నరకాసురుఁ డూర్వశిని బిలిపించినకథ సంస్కృతమున లేదు. దీని నెఱ్ఱనయో మఱియెవరో కల్పించియుండఁగా సోముఁడు దీనిని దీసికొనెను. " అని వ్రాసిరి.

ప్రత్యు. ఇక్కథ సంస్కృతమునఁ గలదు. వారికి లభించినప్రతులయందు లేదేమో!

' ఆంధ్రపరిశోధకమహామండలి (వారు) సంపాదించిన సంస్కృతహరివంశపుఁ బ్రతియందును, బొబ్బిలినగరపుఁ బ్రతులయందును గలదు. మఱియుఁ జెన్నపురిప్రాచ్యలిఖితపుస్తకభాండాగారపుఁ గాకితపువ్రాఁతప్రతియందును నున్న దని శ్రీ వంగూరి సుబ్బారావుగారివలన వింటిని. అందలి శ్లోకములఁ గొన్నిటి నుదాహరించెద.

శ్లో. ...జయ మాఘోషయామాస నరకో దానవోత్తమః
అమరావతీం తదా దైత్యః ప్రవిశ్యచ మహాసురః
ఊర్వశీం చ సమాహూయ వచనం చేద మబ్రవీత్

భజ మా మిహ వామోరు ! నిర్జిత శ్శక్ర ఆహవే
అహ మిన్ద్రో యమో రాజా వరుణో యాదసాంపతిః
... ... ... ... ..."

"ఊర్వశీ, ఋషయోయదితే రాజన్! యత్కృన్ క్రతుభిస్సదా
తదా భజామి దైత్యేన్ద్ర! నాత్రకార్యా విచారణా."
సం. హరివం. ఉ. భా. 127 అధ్యా.

సోమన యెఱ్ఱనల ప్రతులలోనయిత మీఘట్టము స్నట్లు తోఁచుచున్నది. కావున దీనింగూర్చి యొకకవి మఱియొక్కని దానింజూచి వ్రాసికొను నంతయక్కఱ యుండదు.

(౮.) ఆక్షే. ఊర్వశిని జూచి నరకాసురుఁడు తటాలునఁ గాళిదాసుని రఘువంశములోని వర్ణనలఁదలఁచుకొని ' గేదఁగి రేకు నఖంబునఁ జీఱుట ' మొదలగు శృంగారచేష్టలను జేయుచున్నాఁడు. సమయమునకు సరిగ స్వర్గలోకమున గేదఁగి రేకు దొరకుట చిత్రము ! "

ప్రత్యు. నరకుఁడు కాళిదాసుకంటెఁ గొన్నివేలసంవత్సరములు ముందున్నవాఁడు. కావున నతఁడు రఘువంశమును జదివియుండుట యసంభవము. వీరిదృష్టికి సోముఁడే నరకాసురుఁడు ! కానిండు. ' గేదఁగిరేకు నఖంబునఁ జీఱుట !' యను నిర్భాగ్యలక్షణము గలయారాజున కిందుమతీదేవి లభింపని యట్లే యట్టిపనిసే చేసిన నరకునకు నూర్వశియుఁ దక్కదని చూపుటకే సోముఁడు కాళిదాసుప్రయోగముసే యుచితత్వముకొఱకు నాతని ననుకరించి చూపినాఁడు.

స్వర్గలోకమున గేదఁగిచేకు దొరకుట చిత్రమా? చూడుఁడు.

స్వర్గమునఁ బారిజాతకుసుమములే కాని మల్లెలు, మొల్లలు, జాజులు, గేదఁగులు మొదలగుపుష్పములు లేవని తలఁపరాదు. ఆలోకమున కంతకును నందనవనములోని దేవ తరువులు నైదింటివిత్తనములే కావు. ఇతరవృక్షము లున్నట్లు ప్రమాణము లనేకములు గలవు. ప్రస్తావమున నున్నది 'గేదఁగి' గావున దానియునికిం గూర్చిన యుదాహరణముల లో నొండు రెండు మాత్ర మాంధ్రగ్రంథములనుండియే చూపెదను:—

(1) కవిరాజమనోరంజనము, తృతీయాశ్వాసము.

తే. గీ. కువలయాక్షులు 'కేతకీకుసుమగర్భ
దళముపై నవ్యహిమజలమిళితమైన
హారిణమదపంకమున వ్రాసి రపుడ లేఖ్య
తనువిశేషుఁ బ్రసూనేషు వినుతవేషు.

చ. వలపలిచేతఁ బూశరము, వామకరంబునఁ బచ్చవిల్లు కో
పులను వసంతకైరవవిభుల్, వెనుకన్మలయానిలుండు, ముం
గల వరశారికాశుకపికభ్రమరాళి వెలుంగఁ గాఁ జెలుల్
వలపుర్గాలరాజువైభవము వ్రాసిరి గేదఁగిపువ్వుటేకునన్.

(2) పారిజాతాపహరణము, చతుర్థాశ్వాసము:—

"రగడ...... గుమగుమని వాసనల గేదఁగి కొమ్మకొమ్మకు నందె. ......"

(ఒకవేళ నరకుఁడు చీల్చిన రేకు దీనిదే యేమో!)

(పైవి రెండును స్వర్గలోకమునందలివే!) మఱియు స్వర్గ కైలాసవైకుంఠాదులను వర్ణించుపురాణములలోనిఘట్టములను జూచిన నం దెన్నియో యీయితరవృక్షములు గానవచ్చును.

ఉత్తరహరివంశములోని యూర్వశీనరకాసురసంభాషణము కొంతవఱకు బాగుగ నున్నదని వ్రాసి పిమ్మట నిట్లు వ్రాసినారు. (గ్రంథమంతయు వ్రాయక ముఖ్యవాక్యముల నుదాహరించెదను.)

ఆక్షే. (b) "శంభుదాసుఁ డూర్వశీనరకాసురుల సంభాషణమును రెండుపద్యములలో నెంతయు గంభీరముగ, మధురముగ ముగించినాఁడు. ఇఁక సోమనాథుఁ డన్ననో యీ విషయమునకై యిరువదియైదు పద్యములను వ్రాసి వారిని నీచాతినీచపాత్రములుగాఁ దోఁపఁజేసినాఁడు. నరకాసురుఁ డెంత నీచుఁ డగు కిరాతస్వభావుఁ డగురాక్షసుఁ డని యొకవేళఁ దలంచినను, ఊర్వశి యెంతసిగ్గుమాలిన ముసలిసాని యను కొన్నను, వారిద్దఱను నిట్టిరసాభాస మగుసల్లాపము నిండు సభలో నడచియుండదు. ఒకవేళ నడిచియుండవచ్చును బో, కవి దాని నిట్లు వ్రాయుట ప్రమాదము. ఇంకాఁ గలమిండఱి కము,లంజెతనము మొదలగు పదములఁ దలఁచుకొన్న నెవ్వరికి రోఁతజనింపదు ? సోముఁ డుత్తమపాత్రములయం దెంతయో నీచస్వభావమును జూపినాఁడు. సోముని నరకుఁడు సిగ్గుమాలినవాఁడు; సౌమనస్యము లేనివాఁడు." అని యాక్షేపించిరి.

ప్రత్యు: ఇందు “ఊర్వశీనరకాసురు లుత్తమపాత్రములా? నరకుని యప్పటి సభ యెట్టిది? నరకుని నీచుఁడగు రాక్షసునిఁగాను, ఊర్వశిని ముసలిసానిగాను దలంచునప్పుడు వారిసంభాషణ మెట్లుండును? కవియాసంభాషణమువ్రాయుట ప్రమాదమా? సోముని గ్రంథమునందలి పదములకును, నేఁటివానియందలి వానికిని భేదముగలదా?” అనువిషయముల నాలోచింపవలసియుండును.

## ఊర్వశీనరకాసురు లుత్తమపాత్రములా?

ఊర్వశి పొత్తులతొయ్యలి; నరకుఁడు రక్కసిరాయఁడు. ఇట్టిపాత్రములను విమర్శించునప్పుడు సీతారాములవంటి పాత్రములను మనముననిడుకొనరాదు. నరకపాత్రమును బరిశీలించునప్పుడు రావణాదులను జ్ఞప్తికిఁ దెచ్చుకొనవలయును. ఇప్పట్టున వాఁడు రావణాదులకంటె నెన్నియో మడుంగులు సరసుఁడుగఁ దోఁచుచున్నాఁడు. వాఁడు సలిపినసంభాషణ మెంత దీర్ఘముగ నున్ననేమి? వాఁడు మోటుమాట రానీయలేదు; మొఱకుఁదనముఁ జూపలేదు. వాఁడు రాక్షసరాజు. వానికడ రాచఠీవి మెండుగ నున్నది. రాజపౌరుషము నిండుగ నున్నది; వానియందు వలపులేమి ననేకమార్గములచేఁ దప్పించుకొనఁ జూచిన నేరుపుఁగత్తె యగునూర్వశి తుదకు మాయనవ్వు నవ్వుచు, “యాగభాగముల కధికారివిగాని నీమగతనమేఁటికి?”

అని మొత్తిపోదువఁగానే యంపతాఁకుఁ గన్నమృగరాజువోలె హుంకరించుచు వాఁడు,

చ. "అవునిదివోలు వాసవుఁడు నంతకుఁడుఁ స్వరుణుండుఁ బార్వతీ
ధవసఖుఁడుం బ్రితాపమునఁ దత్పదమేలుదు రన్న నిట్టినే
నవిహితయాగభాగములహంకృతిమైఁ గొన్నకున్న నూర్వశీ!
కవకవనవ్వరే త్రిదశకాంతలు? ..................."

అనిపలుకుచు (దానివీడ్కొలిపి) లేచి వెడలిపోయెను. వానికి నూర్వశీసౌందర్యమునకంటె రాజపౌరుషమే ప్రధానము! కావుననే మనసాహిత్యరసపోషణసంవిధానచక్రవర్తి,

మ. "ఒకనాఁ డూర్వశి 'మాటపొందు' నరకుండూహించి...
మీఁ కెల్ల నే
లికనై యుండెద యాగభాగములు పాలింపన్ విభుం
డయ్యెదన్."

అని యూర్వశి 'మాటపొందు' (యాగభాగాధికారము) నూహింపఁజేసెనే కాని దాని 'పొందుమాట' వానిం దల పెట్టనీయ లేదు!

నరకునియప్పటిసభ యెట్టిది:—ఇంద్రాదిదిక్పాలురు పరాజితులై దేవసైన్యములతోఁ గాందిశీకులైరి. బృహస్పత్యాది దేవగురువులు, మునీంద్రులు, మొదలగువా రంతకుము న్నే పలాయనసూత్రములం బఠించిరి. సుధర్మాస్థానమున నొక దేవ కింకరుఁడుగాని, ద్వారపాలకుఁడు గాని లేరు. ఇఁక నాసభను

నిందించినవా రెవ్వరు ? నరకుఁడు సురపుంగవుగద్దియ నధిరోహించినాఁడు. రాక్షససేనానాయకులు పార్శ్వపీఠముల నలంకరించినారు ! మిగిలినరాక్షసవృద్ధులు మొదలగువారు తక్కిన యాసనములను గైసేసినారు. రక్కసిలెంకలు నిలువంబడి గొలుచుచున్నారు. దేవదాసీజనము తాలవృంతములఁ గైకొని వీచుచున్నది. సేవకులగు గంధర్వులు పాడుచుండిరి. ఇదెట్టి సభయో యోజింపుఁడు. శర్మగారి యభిప్రాయమునుబట్టి యాసంభాషణము మఱియొకచో ననుచితమైన నగునేమో కాని యీసభకు నుచితముగానే యుండును.

కవి యాసంభాషణము వ్రాయుట ప్రమాదమా ?:— లోకములో నుత్తమమధ్యమనీచాదిపాత్రము లనేకస్వభావములుగలవియుండును. ఆయాపాత్రములకుఁ దగినసంభాషణముల నసభ్యములు గానివానిని మహాకవులు వ్రాయుదురు. ఇందసభ్యము లగుమోటుమాట లెవ్వియును లేవు గావున, గవి ప్రమాదపడె ననుటకు వలనుపడదు.

సోముని యీవ్రాఁతయే ప్రమాదమేని ద్రౌపదీవస్త్రాపహారణకథను వ్రాసిన వ్యాసునిది యత్యంతప్రమాద మనవచ్చును. ఎట్లన,

ద్రౌపది యుత్తమక్షత్త్రియకాంత; అగ్నియందు పుట్టిన పవిత్రురాలు. జగదేకవీరు లగుపాండవులభార్య. ధృతరాష్ట్రుని సభ నరకుని సభవంటిది గాదు! అందున్నవారు రాజులు,

రాజబంధువులు,శస్త్రగురువులు, ఇంకనుబలువురున్నారు. ధృతరాష్ట్రుఁడు గ్రుడ్డివాఁడుగాని తక్కినవారికిఁగన్నులున్నవి. అట్టి నిండుసభలో నందఱయెదుట, భర్తలు చూచుచుండ, మహాసాధ్వియు, ఋతుమతియు (నేకవస్త్రయు) నగుద్రౌపదిబట్టను విప్పించినకథను వ్రాసినాఁడు వ్యాసుఁడు! కర్ణుఁడాయిల్లాలి ననరానిమాట లాడినాఁడు! ఇట్లువ్రాయుట వ్యాసునితప్పు! తెలిఁగించుట నన్నయదీ! తిక్కనయు నీకథ నచ్చటచ్చటఁ దడవినాఁడు! వీరందఱును బ్రమాదపంకమునఁ బడినా రన వలసివచ్చునే !

ఎఱ్ఱనసోమనలపదములకుఁ గలభేద మేమి ?

ఎఱ్ఱన నరకాసురుఁ డూర్వశిని సభలోనికి రావించి యిట్లు పలుకుచున్నాఁడు—

“మ. వరుణుం దోలితి నర్థపుం జదిపితి న్వైవస్వతుఁ గెల్చితిన్
హరుఁబోఁజోపితి నేన యీశ్వరుఁడసర్వామర్త్యసిద్ధోరగా
సురగంధర్వవియచ్చరాదులకు; మెచ్చుల్మీఱ నీవింక న
న్నరవిందానన ! సత్కరింపుము మనోజానీకసంక్రీడలన్.”

“ఇంద్రాదిదిక్పతులతో యుద్ధముచేసి వచ్చితిని గావున నీతో ‘——’యుద్ధముసేయ మనసుగలదు.” అని యెఱ్ఱననరకుని యభిప్రాయము! ‘నిండుసభ’లో నొకయాఁడుదానిని గ్రామ్యధర్మమున బోధించుయుద్ధమున సత్కరింపుమని వేఁడిన యెఱ్ఱన నరకుఁడు సోమునినరకునికంటె సిగ్గుమాలినవాఁ డనియు,

సామనస్యము లేనివాఁడనియు, నీచపాత్రమనియుఁ జెప్పుటకు సంశయము గలదా ?

సభకు నూర్వశిని రప్పించి సోముని నరకుఁ డిట్లనుచున్నాఁడు—

"ఉ. నాకపురంబులో మెఱసి నందనకేళిఁ జరించి దివ్యకాం
తాకరతాళవృంతసముదాయసమీరము సోఁక రాజ్యముం
గైకొని నేఁడు దిగ్విజయగౌరవధన్యుఁడ నైన నా సభన్
నీకనుదోయి వెన్నెలలు నిండక కోర్కులు నాకు నిండునే?"

(ఆహా ! ఎంతమార్దవముతో నొప్పుచున్న దీపద్యము! పారిజాతకుసుమసౌరభములం గొని తెచ్చి పాఠకుల కిచ్చుచున్నదే! ఇట్టి సుకుమారపద్య మింకొకఁడు వ్రాయఁగలఁడా?)

యుద్ధముచే నలసివచ్చినవాఁడు గావున (సోముని) నరకాసురుఁడు దివ్యకాంతాకరతాలవృంతసముదాయసమీరపుఁ జల్లఁదనము చాలక యూర్వశికనుదోయి వెన్నెలల శైత్యము నపేక్షించుచున్నాఁడు. ఇందు భావ మెంతయో మృదువుగను, గంభీరముగను, మనోహరముగను లలితము లగుపదములచేఁ జిత్రింపఁ బడినది. ఉభయకవుల పద్యముల తారతమ్యమును బాఠకులు పరీక్షింతురుగాక !

తరువాతిపద్యములలోఁ గనఁబడు సోమునిపదములైన 'ాచేతనము, మిండజోకము' అనునవి రోఁతజనింపఁజేయు

ప్రిత్యా. కవికింబోలె విమర్శకునకును, ఏపాత్రము చెంతకు వచ్చినప్పుడు, ఆపాత్రముగా మాఱుచుండుట విధి. ఆవిధి నతిక్రమించెనేని యాతఁడు కృతార్థుఁడు గాఁజాలఁడు. ఈ ఘట్టమున విమర్శకుఁడు చిత్రరేఖాభూమికం దాల్పవలయును. (చిత్రరేఖగా మాఱవలయును) అప్పు డాతనిహృదయము నుండి, యంతకుమున్ను గ్రంథపరిచయమునఁ బ్రవేశించి యున్న యనిరుద్ధుఁడు, వెలుపలికిఁ బోవును. అనిరుద్ధుఁ డాతని మనంబున నుండనియప్పుడు పైయాక్షేపమే కల్గనేరదు. ఏమన,

ఉషాకన్యకు స్వప్నమం దగపడినవాఁ డెవ్వఁడో చిత్రరేఖ యప్పు డెఱుఁగదు. స్వప్నములలోఁ దఱచుగా, ఎఱిఁగిన రూపు, చూచినరూపు, తలఁచినరూపు, వానింగూర్చిన విషయములు వచ్చుచుండును. కావున నీకలలోఁ దోఁచిననేర్పరి ముచ్చు ‘నెఱుంగుదేనియున్’ అనుచున్నది! ఎఱిఁగిన—లేక, చూచిన—లేక తలఁచిన—వాఁ డెవ్వఁడేని వచ్చెనేమో యని యామెయభిప్రాయము. అది ప్రాపంచికజ్ఞానముగలది.

ఉషకు స్వప్నమునఁ గానవచ్చినవాఁ డనిరుద్ధుఁడనియు, వానిని జిత్రరేఖయు, నుషయు నెఱుంగరనియు మన మెఱుఁగుదుము గావున నిట్లాక్షేపించుచున్నాముగాని, యంతకుమున్నీకథ నెఱుంగనివారి కీశంకయే పొడమదు! ఆలోచించి చూడుఁడు. ఇందు ‘తెలివిమాలినతనము’ చిత్రరేఖదేమో!

సంస్కృతమూలమును, ఎఱ్ఱనహరివంశమును ఈయభిప్రాయమునే బోధించుచున్నవి.

శ్లో. "విజ్ఞేయో యస్యపుత్రో౽సౌ యన్నామా యత్కులశ్చసః
ఇత్యేవ ముక్తే వచనే తత్రోషా కామమోహితా
ఉవాచ కుమ్భాణ్డసుతాం కథం జ్ఞాస్యామ్యహాం సఖి
త్వమేవ చిన్తయ సఖి నోత్తరం ప్రతిభాతి మే."
హరివం. విష్ణు. 117 అ.

ఎఱ్ఱన:—

క. "చాయయు నందము నించుక
యీయను వని నీవు చెప్ప నెఱిఁగెదవేని........"

పైవాని భావము లన్నియు సమానములే.

ఆక్షే. [ (పిమ్మట) "జగమ్ములఁ గలతరుణపురుషుల యాకారముల నెల్లఁ బటమున వ్రాసి తెచ్చెదను. అందు నీపతిని గుఱుతింపు" మని పల్కి చిత్రరేఖ యింటికిఁ బోయినది. ఎఱ్ఱనయు నాయమవెంటనే వెడలి పోయినాఁడు. సోముఁడన్ననో యుషాదేవిని విడువక గట్టిగఁ బట్టికొనుచున్నాఁడు!"] అని వ్రాసినారు.

(వెనుక వీరు సోమునిని "మర్యాదను లజ్జను బాటించువాఁడుగాఁ" డనియు నీచలక్షణము గలవాఁ డనియు వ్రాసియున్నారు. ఆవ్రాఁత కిది భిక్షము పెట్టుచున్నది !)

ప్రత్యు. సోముఁడు ఉషాకన్యావిరహావస్థను గొంచెము వర్ణించుటచే నేరము పొంది వీరు పైరీతిని వ్రాసినారు. దీనిం బరిశీలింతము.

రెండువేలసంవత్సరములకుఁ బూర్వమునుండియు మన, (హిందూ) దేశమున బయలువెడలిన యనేకసంస్కృతనాటకములయందు నాయికల విరహావస్థలను (వానికి వేఱుగ రంగముల నిర్మించియుఁ) బలురీతుల వర్ణించుసంప్రదాయము కవులలోఁ గలదు; పురాణములయందును విరహిణీవర్ణనముగలదు. భాసకాళిదాసాది మహాకవులనాటకంబులయందును, దేవీ, స్కాందాదిమహాపురాణములయందును నానావిధముల విప్రలంభశృంగారవర్ణనము చేయఁబడియున్నయది. సర్వజ్ఞుఁ డగు నిక్కవియుఁ దనగ్రంథములోని తక్కినయనేకకథలందుంబోలె దీనియందును జాలవఱకు నాటకపద్ధతి నవలంబించి దీని నొక నాటకరంగస్థలంబుగ నొనర్చినాఁడు. కావున నమ్మహాకవి నట్లు దూఱుట పాడిగానిపని.

xiii. ఆక్షే. 'సోముఁడు ప్రబంధమార్గమునకుఁ ద్రోవ సూపి తెలుఁగుబాసకు దురవస్థను దెచ్చినాఁ' డని సూచించినారు.

పరిహా. ఇతఁడు ప్రబంధరచనమునకుఁ ద్రోవసూపిన మాట సత్యమే. ప్రబంధమార్గ మనఁగా నాటకముంబోలిన మనోహర మగుకొ్రత్తమార్గము. ఇదియే అతఁడు చూపినది. ఇట్లు చూపుటయే సాహిత్యరసపోషణసంవిధానచక్రవర్తిత్వము; మఱియు నవీనగుణసనాథత్వము. అతఁడు సూపిన మనోహరమార్గమునఁబోలేక పెడత్రోవలం ద్రొక్కిన యితర

కవ్రులయపథాధమున కాతఁడా బాధ్యుఁడు? ఇతరప్రబంధములలోని నానావిధవర్ణనములఁ జదివిచదివి విసివి యున్నాము. గావున నాతని నిప్పుడు నిందించుచున్నాము గాని యాలని నాఁటి కాంధ్రమున నది నవీనమార్గమే. ఆలోచింపుఁడు. (పింగళిసూరనార్యుని ప్రబంధములకీతనిగ్రంథమే మార్గదర్శి.)

xiv. ఆక్షే. "తనకు విరహతాపముఁ బరిమార్ప వచ్చిన పురంధ్రీమణులను కన్నుచోట నుషాదేవి సైఁప లేక కన్నీరు విడువఁగా, నాకన్నీటిని దుడిచిన వెంటనే చెలికత్తెలు "పన్నీటం జేయి కడిగికొనవలసి" యుండునఁట! ఏలయందురో, కామాగ్నిఁ గ్రాఁగిక్రాఁగి పొంగివచ్చునవిగాన! ఇంతటి యుష్ణమున నాకోమలాంగి కను లెట్లు నిలిచినవో!" అని యాక్షేపము.

ప్రత్యు. సామాన్యముగా మనుజునకు 106, లేక 107 'డిగ్రీ'లజ్వరము వచ్చినప్పు డాతనిబంధుగు లతిప్రేమముమెయి నాతనిశరీరముపైఁ జేయివైచి "ఆహా! మావానిమొదలు సలసలఁ గాఁగిపోవుచున్న" దని పలుకుచుందురు. ఇట్లు పలుకుట వాడుకయందే యున్నది!(గ్రంథములలో నతిశయోక్తు లనేకవిధములుగ నుండును. అట్టియతిశయోక్త్యాద్యలంకారము లనే మనము విమర్శింప దొరకొందుమేని మనభారతవర్షమునఁ గవియనువాఁడే యుండఁడేమో!) శరీరమునుండి యెంత

యుష్ణము వెడలుచున్నను గన్నులస్థితికి భంగముగలుగ నేరదు. అది భగవన్నిర్మాణచాతుర్యములలో నొకటి. కావుననే యుషాదేవికన్నుల కెట్టిభంగమును బాటిల్లలేదు !

XV. ఆక్షే. (౩) "ఎఱ్ఱన, చిత్రరేఖ లిఖించి తెచ్చిన వారి నెల్ల నుషాదేవితో విరివిగా వర్ణించి చెప్పుచున్నాఁడు. ఈయప్రస్తుతప్రశంస మన కేల యని వారినెల్ల సోముఁ డొక పద్యములో లిఖించి, భరతఖండమున నున్నవియు లేనివియుఁ బెక్కుదేశముల పేరులు సంగ్రహించి యొకసీసమునిండ నొకపేరుగాసముగాఁ గూర్చి, తనసర్వజ్ఞబిరుదమును సార్థక పఱచినాఁడు !" అని శ్లాఘ్యముగా రాక్షేపించిరి. (ఇట్టిశంకలు వ్యాసమును దీర్ఘము నొనర్చుకొనుటకుఁ గాక మఱేల ?)

ప్రత్యు. ఉపయోగములేనిచోట్లనైన నెఱ్ఱన విస్తరించి వర్ణించిన నది విరివిగ వర్ణించి చెప్పుట యగుచు. సోముఁ డుచితమైన చోటుల నుచితముగ వర్ణించిన నది యప్రస్తుత ప్రశంస యగును. ఆహా ! ఏమివిమర్శము !

ఇప్పు డుషాకన్యకుఁ గావలసినది యనిరుద్ధునిపటము. ఇతరరాజుల పటములను వర్ణించుచుఁ గూర్చున్నచో నది యప్రస్తుతవర్ణన మగుటయే కాక దానివలనఁ బాఠకులకు విసువు జనించుటయు నగును. తొలుతనే యనిరుద్ధునిపటము నెదుటఁ బెట్టినచో నౌచిత్యభంగ మగును. ఈవిషయములు దలంచియే యాణిముత్యములకోవ వలె దేశములపేళ్ల నన్నిటి

నక్లిష్టముగఁ గూర్చి, తదధిపతులపటములఁ జిత్రరేఖ యుషా కన్యకుఁ జూపె నని సోముఁడు ఔచిత్యము మెఱయఁ దనకవన పాటవమును జూపెను. కవిత్రయమున నొకఁడగు తిక్కన సోమయాజి, భీష్మపర్వ ప్రథమాశ్వాసమున వ్రాసిన యీదేశ ములపేరులం గనిన, సోముఁడు భరతఖండమున నున్నవానినే కాని లేనివానిని వ్రాయలే దని తెలియవచ్చును. (తిక్కన వ్రాఁతను వీరు గుఱుతించియున్నచో నిట్లు వ్రాయకపోవుదు రేమో !) చూడుఁడు !:—

వ.“పాంచాల పాండ్య బర్బర వత్స మత్స్య మగధ మళయాళ కళింగ కుళింగ కుకురు కోంకణ టెంకణ త్రిగర్త సాముద్ర సాళ్వ శూరసేన సుదేష్ణ సుహ్మ కురు కరూశ కాశ కోసల యవన యుగంధ రాంధ్ర సింధు చేది చోళ పుళింద పుండ్రక పాండ్యాభీర సౌవీర సౌరాష్ట్ర మహారాష్ట్ర విదేహ విదర్భ ద్రవిళ దశార్ణ కర్ణాట గౌళాంగ వంగ మరాట లాట బాహ్లిక బహుధాన కిరాత కేకయ యాశ్మంత కాశ్మీర గాంధార కాంభోజ కేరళ మాళవ నేపాళ ఘూర్జర కుంత లావంతి కానూపాదిజనపదంబులు.”

(40 ప. భీష్మ. ప్ర.)

ఇందు గలదేశములపేళ్లనే సోముఁ డిట్లు సీసమున వ్రాసినాఁడు.

సీ. "పాంచాలపాండ్య బర్బరకిరాతాభీర
కురువిదేహవిదర్భకుకురుగౌళ
గాంధారమగధకొంకణకళిందపుళింద
సింధుసౌవీరాంధ్రచేదిచోళ
సాముద్రసాల్వకోసలకళింగకుళింగ
వత్ససౌరాష్ట్రాంధ్రవంగమత్స్య
శూరసేనసుదేష్ణసుహ్మకాశకరూశ
లాటకర్ణాటమాళవవరాట
కుంతలావంతికానూపఘూర్జరత్రి
గర్తబహుధానయవనటెంకణదశార్ణ
పుండ్రబాహ్లీకద్రవిడకాంభోజహూణ
కేకయాశ్మంతకాశ్మీరకేరళములు.

క. "(మొదలగున నేకములు జన
పదములు గనుఁగొనెఁ దదీయపతులను మఱియున్
హృదయం బేమూర్తులఁ జే
రద రమణీమనంబులోని రమణుఁడు లేమిన్.")

ఇందు భరతఖండమున లేనిపే ళ్లెవియో విచారింపుఁడు! ఒక్కసముచ్చయ మేని చేరకుండ సోముఁ డాపేరుల నన్నిటిని పేరువలె నెట్లు కూర్చినాఁడో కనుఁడు!

కవిత్రియములో నింకొకఁ డగునన్నయభట్టారకుఁడు, సభాపర్వము, ప్రథమాశ్వాసమున,

సీ. "సుబలమార్కండేయ శునకమహాజాయన
మాండవ్యశాండిల్య మంకపాల
బకదాల్భ్యరైభ్యకభాలుకిజతుకర్ణ
గౌతమకౌశికకణ్వకుత్స
సావర్ణిపర్ణాదసత్యగోపతిగోప
వేనుమైత్రేయపవిత్రపాణి
ఘటజానుకాత్రేయశకలాపసుమిత్ర
హారీతతిత్తిరియాజ్ఞవల్క్య
వాయుభక్షభార్గవవ్యాసజైమిని
శుకసుమంతుపైలసువ్రతాదు
లయినమునులు.........(20 పద్యము)

అని మునులనామముల నొకసీసమునఁ గూర్పఁగా, సక్కవిత్రియముననే వేఱొకఁ డగు నెట్లన,

సీ. "వ్యాసభరద్వాజవాల్మీకిగౌతమ
కాశ్యపజాబాలికణ్వపులహ
యాజ్ఞవల్క్యాత్రిరైభ్యాంగిరోభృగుపరా
శరధూమ్రగాలవశంఖలిఖిత
హారీతసంవర్తకహయశిరశ్శౌనక
భద్రికక్షీవద్విభాండకోగ్ర
బకదాల్భ్యకౌశికాపస్తంబమాండవ్య
మంకణరోమశమందపాల

కథకలాపరోహితకాముకాయనాది
మునులు........................"

అని తనహరివంశము నుత్తరభాగమునఁ బంచమాశ్వాసమున నొకసీసమునందు గుర్చెను. మఱియు సోమనసీసమును మెచ్చుకొని యనేకు లాంధ్రకవు లారీతిన నేకసీసములను వ్రాసినారు. వానివివరణ మిట ననావశ్యకము.

"ఈచిత్రపటములం జూచుటలో నుషాకన్య యనిరుద్ధుని గుర్తుపట్టినరీతిని ప్రబంధపరమేశ్వరుఁ డెంతస్వాభావికముగా వర్ణించెనో కనుండు!" అని శర్మగా రెఱ్ఱనను బొగడి యొకపద్యమును వ్రాసినారు.

సీ. "దేవతలను బూర్వదేవతలను జూచి
దేవయోనుల నెల్లఁ దెలియఁ జూచి
... ... ... ... ... ...
అనిరుద్ధుఁ జూచి యత్యాదరమున
విగతసంశయమగుచూడ్కి వేఱొకటికిఁ
బోక యాకూతకౌతుకాద్భుతవిలోల
తారకంబయి నిలుకడఁ దలఁగులీల
మనసు తోఁ త్రోఁడ మాన్మథోన్మాదమంద."

ఇది పొగడఁదగినపద్యము కాదని నే ననఁజాలను గాని దీనింబట్టికొని సోముని నిందించుట సరిగా దనిమాత్ర మనియెదను.

పైపద్యములోని ‘ దేవయోని ’ యనుశబ్ద మేమి యనుచితముగానున్నదని శర్మగారు తలంచిరో! “భూతోఽయమ్ దేవయోనయః, కృపీటయోనిర్జ్వలనః ” ఇత్యాదులున్నను, ఈ ‘ చూచి, తెలియఁజూచుల’ నడుమ యోనిశబ్దము వికారముగఁ గానరాలేదుగాఁబోలు! ఎట్టిన సత్యకాలఋషి. ఇప్పటివారి యాశయముల నూహింపఁజాలకపోయినాఁడు! కనుఁడు! బలరామశ్రీకృష్ణులు నందుబవ్వనమున విలసిల్లుచున్న కాలమున వారిని గంసునిచెంతకుఁ గొనిపోవచ్చిన యక్రూర మహాశయుఁడు దేవకీదేవిదుఃఖము నుపన్యసించుసందర్భము నందు, (ఎ. హరి. పూ. భా. 8. ఆ)

సీ. పా. “ ...అక్కట పుత్త్రి తెలమితోఁ గుడిన చన్నులే
యాతల్లి చన్నులకట! ” అని ప్రస్తావించినట్లువ్రాసి

నాఁడు! ఏయూరిలోని దేవకి? అక్రూరుఁ డెచ్చటనున్నాఁడు? అతని కెట్లుగనఁబడుచున్నదో యామె! ఇట్టినా యాక్షేపములు?

ఆక్షే. (b) “(అనిరుద్ధపటము) చూచి యానందపరవశయై యెట్టినయుష తలాలునఁ జెప్పసంకోచించి ప్రేమపూర్వకముగ నిర్నిమేషదృష్టితో మాటాడక చూచుచున్నది. సోమునియుష తిటాలున మొగముపైఁ గొట్టినట్లు “ మనసు ప్రుచ్చిలి చొచ్చిన మత్తికాఁడు, వీఁడుగో ” అని చేసాఁచి చూపెనఁట!” అని యాక్షేపించిరి.

ప్రత్యు. ఉమకుఁ జిత్రరేఖ బహిఃప్రాణము. తన హృదయభావము దానితోఁ జెప్పినను దనమనమున నున్నట్లే యని యామెవిశ్వాసము. ఇంతలోనే మొగముమీఁదఁ గొట్టిన ట్లగునా ?

ఆక్షే. (౦) "ఎఱ్ఱనయుమ చాల వరాళవతి, గంభీర హృదయ, తనమనోభావము సు దటాలున వెలివెట్టదు. ఆయమ కామాతిరేక మంతయు మనసుననే రగులుచుండును. పైటికి వచ్చినను గంభీరముగ వచ్చును గాని పచ్చిపచ్చిమాటలతో కాదు --- ఇఁక సోమునియుమ యన్నో సర్వవిధముల విపరీతస్వభావము గలది." అని వ్రాసిరి.

ప్రత్యు. ఎఱ్ఱనయుమ గాంభీర్యమును జూచుఁడు !— మఱియుఁ గామాతిరేకము మనసుననే రగులుచుండుటను గనుఁడు !

చ. "అను సఖిభాషితంబులకు నంగజరాగరసంబు దోఁడుతోఁ
దనువున నాత్మఁ బిక్కటిలి దందడి వేగిరపాటు నాల్రియుక్
ఘనముగఁ జేయ నచ్చు తెలిగన్నుల జెప్పలఁ ద్రొబిందువుల్
వనరుహకేసరస్థపహించునారిలవంబులమేలు డింపఁగాక్.
వ. "నెచ్చెలి కేలు గేలం గీలించి మూలిం జేర్చికొని."
మ. ... ... ... మత్ప్రాణంబుతోఁ దుల్యగా
రమణీ యేను దలంతునిన్నుఁ బ్రియమారన్నీవునన్నట్టిభా
వము పాటించి భజించినఁగలుగు దైవస్ఫూర్తి నాకొక్కటికిన్.

క. "నిక్కము సెప్పెద నాదెస
నక్కటికము నీకు లేనియట్టిద యేనిన్
దిక్కారు లెవ్వరు ప్రాణము
లిక్కాయముతోడఁ బాయు నింతియ పిదపన్."

అని బాపోయి చావునకు సంసిద్ధ యైనది. అట్టిప్రాణతుల్య యగు చిత్రరేఖతోఁ బైరీతిని దనమనోజరాగమును వెలిపుచ్చిన యెఱ్ఱనయుష యనిరుద్ధునిపటమును జూడఁగానే, మనసు తోడ్తోడ మాన్మథోన్మాద మంద' 'బిగియఁజనుదోయి నొత్తిన పేరురంబు' గలవానిని 'అలరుమోవితీపానిన యాననంబు' వానిని పటములోనివానిని మెచ్చుచు,

క. "నను మఱపి యెందు వోయితి
గనుఁగొంటిని బట్టువడితి కైతవ మిటుచే
సినఁబోనిత్తునె? - - -" (ఎఱ్ఱనహరివం.)

అని మనమున ననుకొనిన ట్లున్నది. భర్తపటముచూడక మున్ను ప్రాణతుల్యగా నున్న చిత్రరేఖ, యిప్పుడు లాఁతిచెలి యైనది! మొదట సిగ్గుచే నించుక డాఁచినను బిమ్మట ససంభ్రమంబుగా - - - - చిత్రపటంబున నన్నయనిరుద్ధుని నంగుళిపల్లవంబున సోమునియుషవలెనే నిరూపించుచుఁ గులగోత్రాదుల నడిగినది! సోమునియుషకడ విపరీతస్వభావ మేమి గనవలెనో వీరికి? ఇవ్విషయమున నుభయగ్రంథములను బఠించి వారిసంభాషణాదులను బరిశీలించినఁ దారతమ్యము విశదము గాఁగలదు.

పిమ్మట వీరు, ఇరువురుకవుల నాయికానాయకుల (ఉషానిరుద్ధుల) స్వభావములను గూర్చియు, చిత్రరేఖ యని రుద్ధునిఁ దెచ్చుటంగూర్చియు, నాయికానాయకసమావేశాదులం గూర్చియుఁ గొంత విమర్శించి, యందు సోముని మిక్కిలియుఁ దూలనాడినారు.

ఏతద్భాగప్రత్యుత్తరమున:—ఇరువురుకవులు నెట్టి పాత్రముల నాయికానాయకులుగఁ గైకొనిరో, వారిలక్షణము లెట్టివో, వారిమూలగ్రంథము లెట్టివో, వానియం దీకథ యేరీతి నున్నదో, ఆయాపాత్రముల నిర్వాహ నెట్లు పోషించిరో— మొదలగు విషయములను (అనేకోదాహరణములతో)విపులముగఁ జర్చించియున్నాను. గ్రంథవిస్తరభీతిని దానిని బ్రస్తుతము నిలిపి ముందు నేను ప్రకటింపఁబోవు సంపూర్ణవిమర్శగ్రంథమునఁ జేర్చెదను.

శ్రీశర్మగారు సోమునిగ్రంథమున "నితరవిషయకములగు ప్రమాదములు గూడఁ గొన్ని కన్పట్టుచున్న" వని యాతనియెడఁ గొన్నిదోషములఁ జూపిరి.

xvi. ఆక్షేపము. (క) "శీతజ్వరము వచ్చి బలరామునితోఁ బోరునప్పుడుమాత్రము ఇతఁడు బలరాముని గదుఁడను పేర వ్యవహరించుచున్నాఁడు. శ్రీకృష్ణునకు గదుఁ డనితమ్ముఁ డుండె నని మాత్రము మనము వినియున్నాము.........

ఇది ప్రమాదమే యని చెప్ప నోరురాదు గాని సదుత్తరము విచార్యమే."

ప్రత్యు. గదః, అస్యాస్తీతి గదః=గదుఁడు=రోగము గలవాఁడు. (జ్వరముసోఁకినవాఁడు.) గదా అస్యాస్తీతి గదః= గదుఁడు=గదాయుధము దాల్చినవాఁడు.

("అర్శఆదిభ్యోఽచ్" అనుసూత్రముచే మత్వర్థమున అకారప్రత్యయము రాగా సంస్కృతమున 'గదః' అనియుఁ, దెలుఁగున 'గదుఁడు' అనియు నయ్యెను.

పైయర్థముల నాయాచోటుల ననుసంధించుకొనునది. భాషాభూషణుఁడు గావున శబ్దచమత్కృతిని జూపెను. బల రామున కాయుధములు రెండు:—ఒకచేత గద. వేఱుచేత హలము. కావుననే యతఁడు గదుఁ డనియు, హలి యనియు వ్యవహరింపఁబడినాఁడు. ఆతఁడు గదతో యుద్ధముచేసినట్లు సోమునిహరివంశమున ననేకప్రయోగములు గలవు. (చూచి కొనుఁడు.) గదుఁ డనుప్రయోగముగలయయ్యాశ్వాసముననే 'చటులగద' యున్నట్లు వ్రాసినాఁడు. (6. ఆ. 184)

ఆక్షే. "మఱియుఁ బ్రథమాశ్వాసము—

క. "ఆమురుఁడు రాక్షసకులు, స్వామి సుకృతి

వానిఁ జంపవచ్చుటకుఁ బరంధామపతి పుట్టె" నను పద్యములో 'పరంధామపతి'యని ప్రయోగించెను. సంస్కృతి మున పరంధామయని వ్యసముగాఁ బ్రయుక్తమైనపదమును

సమస్తముగా భ్రమించి యిట్లు వ్రాసె నని తోఁచెడిని. నా మెఱిఁగినంతవఱకు సంస్కృతాంధ్రకవు లెవ్వరును దీని నిట్లు ప్రయోగింపఁగానను. ఉపపత్తి గల్పించుటయు నసాధ్య మని తోఁచుచున్నది -- సోముఁడు తెలుఁగునకుఁ బ్రామాణి కుఁ డగును గాని సంస్కృతభాష కట్లగుట సందిగ్ధము." అని వ్రాసిరి.

ప్రత్యు. పరం ధామా యస్మిన్ సః పరంధామా, పరం=కేవలమగు(దుఃఖామిశ్రమగు)ధామ=సుఖము, యస్మిన్ సః=దేనియందు గలదో అది పరంధామా=వైకుంఠలోకము; పరం ధామ్నఃపతిః=పరంధామపతిః=వైకుంఠపతి=విష్ణువు.

పరం అనునది కేవలార్థవాచక మగునవ్యయము. స్వరాదిగణములోనిది.

శ్లో. ("పరంజ్యోతిః పరంధామ పరమాణుః పరాత్పరః"
బ్రహ్మాస్మృత్. ఉత్తర. ద్వి. ఇవి భగవన్నామములుగావున సమస్తపదము లని కొందఱు.)

"దండకము—పరంజ్యోతిరాకార ..." రాధాకృష్ణసంవాదము (మం. పార్వ)

" "శ్రీరామరామరామా త్రైలోకాభిరామా పరంధామ ..." (సీతారా.)

స్రగ్విణి. పరంధామ దివ్యప్రభావాభిరామా...
(శ్రీసీతా. త్రృతీ.)

" పరంధామయుద్దామసామర్థ్యముం జూపవే......"

(మహేంద్రవిజయము.)

ఇంకను ననేకప్రయోగములు గలవు.

తెనుఁగుభాషకు సోముఁడు ప్రామాణికుఁ డగునుగాని సంస్కృతమున కట్లగుట సందిగ్ధ మనిరి. ఏ తెలుఁగుకవి సంస్కృతభాషకుఁ బ్రామాణికుఁడో !

ఆక్షే. (౧) "కంటిం గంటి దయానిధిన్ గుణనిధిన్ గారుణ్యపాథోనిధిఁ" అని నాలవయాశ్వాసమున జనార్దను వాక్యమునఁ బునరుక్తిదోష మొందు గన్పట్టెడు." అని వ్రాసిరి.

ప్రత్యు. సామాన్యనిఘంటువులలో దయాకారుణ్య శబ్దము లేకార్థకము గాఁ గన్పట్టుచున్నను వానికి భేదము గలదు. వాచస్పత్యాదినిఘంటువులయందును, రసతరంగిణ్యాద్యలంకారశాస్త్రములయందును వానిభేదము వివరింపఁబడి యున్నది. ఈ రెంటిభేదము సంగ్రహముగ వివరించెదను.

(a) దయ=(1) దుఃఖము నొందిన ప్రాణులవలనిజాలి, (2) పరులదుఃఖమునకు నైఁపలేమి మొ॥

(b) కారుణ్యము=[కరుణస్య (కరుణాయుక్తస్య వా, కరుణావిషయస్య వా) భావః]=పరదుఃఖహరణేచ్ఛ=పరుల దుఃఖమును బోఁగొట్టవలయు ననుకోరిక... కావున నిదికవిత్వ వేగమున నైనప్రమాదము గాదు.

ఇదియునుగాక "కంటిం గంటి దయానిధిన్ గుణనిధిన్ గాంభీర్యపాథోనిధిన్" అని కవి ప్రయోగించియుండెనేమో!

"ప్రత్యేకవర్ణనములయందును నితఁడతనికన్న మించినాఁడని చెప్పవలదు" అని శ్రీశర్మగారు వ్రాసియున్నారు. ఇరువురగ్రంథములలోని యాయావర్ణనముల నాయాస్థలంబులంబట్టి వానివాని ప్రాశస్త్యమును పాఠకులు నిర్ణయించుకొనఁదగినవే కాని యిందు చర్చింప ననువుపడదు. ఈయిద్దఱి పొత్తముల నుండియు "నేకవిషయకము లగుపద్యముల నుదాహరించెద" నని శర్మగా రిచ్చిన యుభయులపద్యములందును మొదటిపద్యములోని మొదటిపాదములను మాత్ర మిచ్చుటఁ జర్చించెదను.

శివునివర్ణనము. సోమన :—

సీ. "తొలుకాఱుమెఱుఁగుల తోఁటలో నాడెడు
        రాయంచకొదమతోఁ రాయఁజాలి
    యిరులబండారంపుటింటికిఁ బెట్టిన
        బొందుమల్లెలకోటఁ బోర గెలిచి
    బలుమంచుఁగంబాలబలసిరాఁ జుట్టిన
        క్రొత్తమంజిడిబాగు కొఱఁతచేసి
    పాలవెన్నురువుగుబ్బలిమీఁద నెలకొన్న
        నిండువెన్నెలముగ్గు నిగ్గు చెఱిచి
    జడలఁ గ్రొన్నెల, మెడఁ బాపసరము, తొడలఁ
    బోడలతోఁ, మేన వెలిమిడిపూఁత మించఁ

బొడమి వేఁడితెనిముందటఁ బొడవుసూపెఁ,
బొమవులం దెల్లఁబొడవైన బోటువేల్పు."

ఎఱ్ఱన :—

సీ. "ఔఁదలఁ జదలేటిలే-దరఁగలు పొలుఁ
డగుచందమామ నుయ్యాల లూఁపఁ
దొడవులతలలఁ జెన్నడరుమానికముల
చాయ దిక్కుల నెఱసంజ నెఱపఁ
దోరంపుటేనికతోలి యేకైజకప్పు
కౌతుకతోఁ బ్రీతిఁ బొత్తుసేయ
దట్టంపుబూదిపూఁతల బూదిసఱచిన
పునుకలు పేరురంబునఁ దలిర్ప
మూఁడులోకంబులను గావ మొనసినట్లు,
చేత ముమ్మొనకైదువు చెన్నుమీఱ
వేల్పుపసువుచూడ్కికిఁ గడు వింతయొప్ప,
నేనె ముక్కంటి యున్నయాచెలువుపేర్మి."

(ఇరువురుకవులవర్ణనమునఁ గలపదికములును నించు మించుగ సమానములే.)

కైలాసవసుధరతటమున శ్రీకృష్ణభగవానుఁడు తపము సేయుచుండఁ బ్రత్యక్షుఁడైన మహేశ్వరుని నిరువురుకవులును వర్ణించిరి. వారిపద్యములలోని తొలిపాదములను గనుఁడు. ఇఁదు: ఎఱ్ఱనపద్య(పాద)ము మున్నుల గులుకువర్ణనము గల

యాంధ్రపద్యములలో నొకటియైయున్నది. సోమునిపద్య(పాద)మో! ఊహాతీతమై, ప్రకరణోచితమై యత్యంతప్రౌఢగలకవికిం దక్క నితరులకు రచింపనలవికానిదై యలరారుచున్నది.

తరంగములు గలనదియందు గాని, సముద్రమునందు గాని ప్రతిఫలించు బాలచంద్రునిఁ జూడఁగలిగిన యేకవియైనను శంభుదాసుని పద్యములోని మొదటిపాదము నూహించి వ్రాయఁగలఁడు. ఇట్టిరచన యెఱ్ఱనకుఁ గ్రొత్తగాదు.

చ. "సురుచిరపానపాత్రమున సుందరియొక్కతె కేలనింపఁ జం
దురుఁడు ప్రకంపితాంగములతోఁ దిలకించె......"

నృసింహపు. త్ర. 97.

ఈపద్యములోని భావమునకు మెఱుఁగువెట్టి పైపాదము నెఱ్ఱన వ్రాసినాఁడు.

సోముని(పద్య)పాదముం గనుఁడు.

ఛాయావిగ్రహప్రదర్శని (బయోగ్రాఫ్)యంత్రప్రదర్శనము ను గనినవారు, దానియొక్కొకరంగమును బ్రదర్శింపఁబడు నప్పు డందు విద్యుచ్ఛకలప్రవాహముఁ బరీక్షించియుందురు. అట్టివారు తచ్ఛకలప్రవాహద్యుతులకుఁ బెక్కుమడుంగు లెక్కుడు కాంతులు గలసోమునితొలుకాఱు మెఱుఁగులతోఁట యెట్లుండునో యూహింపఁగలరు. అట్టితోఁటలో నాఁడెడు 'రాయంచ' యఁట! కన్నుల మిఱుమిట్లుగొలుపుచుఁ జూడ

శక్యముగాక, మనస్సుచేతనే యెఱుఁగఁదగిన యామెఱుఁగుల తోఁటలోఁ దనయాట సైతము దోఁచునట్లు ప్రకాశించు 'రాయంచ' యెట్లుండునో యూహించుట కెట్టిమనోనిశ్చలత యుండవలయునో కదా? ఆరాయంచయో! 'కోదమ' యఁట!

తప మొనర్చుచున్నవాఁడు శ్రీకృష్ణదేవుఁడు. ఆతఁ డనిమిషులచేతను, యోగదృష్టిగల సంయమీంద్రులచేతను గొలువఁబడుచున్నాఁడు. అట్టివానికి వరమీయ నేఁగుదెంచు పరమేశ్వరుఁడు, తన నిండు తేజముతో,

'నీలతోయదమధ్యస్థ' ము లగు 'విద్యుల్లేఖా' పరంపరల కాంతిపుంజములం దలఁపించుచు, ''సీ. పా. ఎవ్వనికాంతి యం దీసూర్యచంద్రులు, మెఱుఁగుడుఁబురువుల ట్లెఱుఁగఁబడుదురు'' ఇత్యాది వాఙ్మనసాతీతము లగుమహిమల వర్ణించు పద్యములను జ్ఞప్తికిఁ దెచ్చుచుఁ బ్రత్యక్షుఁ డయ్యె నని వర్ణించు టెంతయుఁ బ్రకరణోచితమై యున్నది.

శంకరుని జటాజూటమున నున్నతరఁగలతోఁడిగంగను ఒకకవి 'జౌఁదలచదలేఱు'గాను, రెండవవాఁడు 'తొలుకాఱు మెఱుఁగులతోఁట'గాను గ్రహించిరి. మఱియు, నందు చలించు చంద్రుని నొకకవి యుయ్యెలలూఁగుబాలునిఁగాను, రెండవ కవి నర్తించు రాయంచగాను వర్ణించిరి. ఇట్లే తక్కినవియు నెఱుఁగవచ్చును.

ఆశ్వే. xvii.

సీ. "పవనవేగవిశీర్ణ పాదపాగ్రింబుల
జడియకుండఁగఁబట్టు సామజములుఁ
బూజార్థనియమిత పుష్పమాలికలపై
మధుకరంబులఁ జోపు మర్కటములు
నవభృథస్నాన పర్యంతనిర్మలత్వకై
కాసారములఁ గాచు కాసరములు
నిజనిజోటజభాగనీవారసీమలఁ జొరక
కావలియుండు సూకరములుఁ
గలిగి కంసవైరికన్నులపండువై
చెలువుమిగిలెఁ బూర్ణకలశవిగళ
వాలవాలవారిహారితన్మునిదారి
కాశ్రమంబు బదరికాశ్రమంబు."

"ఎందఱుకవులు ఋష్యాశ్రమముల వర్ణించినను నొకే యచ్చు! అందలిమహర్షు లెంతముక్కుమీఁదఁ గోపము గలయుగ్రస్వరూపులైనను, వారియాశ్రమమునఁ గలజంతువులు మాత్రము తమనైసర్గికస్వభావమునువిడిచి శాంతస్వరూపము లై యుండును." అని శర్మగారు కవియైన సోమునినేకాక సంసారబంధములఁ దెగఁగోసికొని యడవులం దపమాచరించు మునీంద్రులను సయితము దిట్టినారు.

ప్రత్యు. సోమనాథుఁ డెందఱాంధ్రకవులపద్యముల నుండి యాయచ్చును దీసెనో! నన్నయ కణ్వాశ్రమమును గాళిదాసువర్ణనలం దలంచికొని వర్ణించినాఁడు. సోముఁడు భట్టారకునిపద్యమునకు మెఱుఁగుపెట్టినాఁడు. ఇది ప్రకరణోచిత మగునో కాదో విచారింతము.

శ్లో. పరిత్రాణాయ సాధూనాంవినాశాయచదుష్కృతామ్
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే.

అని భారతమునఁ జెప్పఁబడినట్లు, సాధుజనరక్షణార్థము ద్వాపరయుగమునఁ బుడమిపై నవతరించిన శ్రీకృష్ణుఁడు, పూర్వము పలునారులు బదరికావనవాసులకు నరకాదిదుష్టరాక్షసులవలనఁ గలిగినబాధలను మాన్పి వారిని సుఖస్థితిం బ్రవేశపెట్టియున్నాఁడు. మఱియుఁ జిరకాలమునకు నయ్యాశ్రమమును జూడ మరల నేఁగుదెంచుచున్నాఁడు. అట్టి శ్రీకృష్ణునకు నిప్పు డయ్యాశ్రమ మెట్లు గోచరింపవలయును?

దుష్టమృగములు సయితము తమవికారచేష్టలు మాని యాముసీంద్రులకు విధేయములై పూజాద్రవ్యముల కేనియు నెట్టివాటిల్లకుండ సేవ యొనర్చుచున్నట్లును, మునికుమారికలు దుష్టదానవులవలని బాధలు మఱచి స్వేచ్ఛగ మెలంగుచు నాశ్రమవృక్షములపాదులకు నీరుపోయుచు నుండినట్లును జూపట్టవలదా ?

అయ్యాశ్రమస్థితింజూచి దూరమునుండియే శ్రీకృష్ణుఁడు జపహోమాదిక్రియలకు విఘ్నములు లేకుండ మునీంద్రులు సుఖమున్నారు గదా యని తెలిసికొని యానందింపఁగలఁడు. కవి దీనిని రచించునప్పుడు—

"శ్లో. రమ్యా స్తపోధనానాం
ప్రతిహతవిఘ్నాః క్రియాః స్సమవలోక్య
జ్ఞాస్యసి కియద్భుజో మే
రక్షతి మౌర్వీకిణాంక ఇతి."

అను నభిజ్ఞానశాకుంతలములోని శ్లోకమును మన మునఁ దలంచికొనె నని తోఁచెడి.

ఇట్టి సాహిత్యరసపోషణసంవిధానమును నిందించి, "ఈ కవిసమయమును దాఁటిన పాపమునఁ బోయిన రొుకరిద్దఱిలో నెట్టినయు నొకఁడు" అని శ్రీశర్మగారు వ్రాసియున్నారు! ఆతఁ డట్టిపాపమునఁ బోయెనో లేదో చూతము!

"స్వాభావికవర్ణనములను జేయుటలోఁ గవిత్రయము వారు పెట్టినదే భిక్షము. ఆశక్తి సోమునివంటివా రెందఱు తపము చేసినను రాదు" అనియుఁ దమకడపటియాశయమును శ్రీశర్మగారు వెలిపుచ్చినారు!

కవిత్రయము వారి గ్రంథములయందుమాత్ర మతిశయో క్తివర్ణనలు లేవా? స్వాభావికవర్ణనములు సోముని గ్రంథమున మాత్రము లేవా? మహాకవులు చదువరుల మనముల రంజించు

పొంటె నాయాసమయముల ననేకవిధములగు వర్ణనము లొనర్చి భిన్నరుచులను జూపుచుందురు. వానినెల్ల వివరించుట పిష్టపేషణమని యెంచి, నన్నయ యెఱ్ఱనలు రచించిన (సోముని యస్వాభావికవర్ణనమువంటి) వానిలో నొక్కొకదానిని వ్రాయుచున్నాను. (నన్నెచోడదేవుని కుమారసంభవమునను నిట్టివి గలవు)

నన్న. సీ. ॥ శ్రవణసుఖంబుగా సామగానంబులు
సదివెడుశుకములచదువు దగిలి
కదలక వినుచుండుకరులయుఁ గరికర
శీతలచ్ఛాయఁ దచ్ఛీకరాంబు
కణములచల్లనిగా డ్పానపడి వానిఁ
జెందిసుఖంబున్న సింహములయు
భూసురప్రవరులు భూతబలుల్ దెచ్చి
పెట్టునీవారాన్నపిండతతులు
గడఁగి భక్షింపనొక్కటఁ గలసియాడు
చున్నయెలుకల పిల్లులయొందుసహజ
వైరివర్గంబులయు సహవాస మపుడు
సూచిమునిశక్తి కెంతయుఁ జోద్యమంది.

(ఇందు మునులప్రభావము సెప్పంబడినది. అందు శ్రీకృష్ణదేవుని పరిపాలనమహిమ సూచింపఁబడినది.)

నృసింహపురాణములో—

ఎఱ్ఱన—

సీ. "హరిభూతభావిదివ్యావతారంబులఁ
గీర్తనంబొనరించుఁ గీరసమితి
సప్తసామములు సస్వరముగ మునికోటిఁ
జదివించుఁ గోకిలసముదయంబు
శ్రీకాంతుకమనీయశృంగారలావణ్య
కథలు వేర్కొను శారికాగణంబు
పరిణవమంతోత్రస్వాదపరిపాక మింపార
నభ్యాస మొనరించునలికులంబు..."

ఈయెఱ్ఱనపద్దెముమాత్రము స్వాభావికవర్ణనముగలదని శర్మగారు చెప్పఁగలరా? సోముని కాలమునాఁటి కాతని పద్యమే యాంధ్రభాషయందు గొత్తరకమైన యచ్చు. పిమ్మటి కవులువ్రాసినవానిం జదివినయలవాటున నాతని నాక్షేపింపఁ దగునా?

విమర్శకునకుఁ బక్షపాతరాహిత్య ముండవలయును. పక్షపాతము మనంబున నుండెనేని యన్నియు దోషములుగానే కన్పట్టును. ఆక్షేపించుతలంపే పాడము నెడ నెఱ్ఱన స్వాభావిక భిక్ష మనునదిమాత్రము నిలుచునా? చూడుఁడు! ఎఱ్ఱన హరివంశమున,

సీ. "తరువిటపాసక్తధౌతవల్కలపంక్తి
కమనీయతోరణకల్పనముగ

హాయమానంబులై యొండొండ వెలిఁగెడు
ప్రేతాగ్ను లభినవదీపములుగ
దుగ్ధపానంబునఁ ద్రుళ్లు పెయ్యలనోరి
నురువులు సితపుష్పవిరచనలుగఁ
గోరి నీడంబులు సేరెడి ఖగముల
వాసితంబులు జయధ్వానములుగఁ
దనసమాగమోత్సవమునఁ దగినసుఖము
లప్రయత సిద్ధములుగ నతిశయిల్లు
మునిజనాశ్రమరేఖ నవ్వనజనాభుఁ
డర్థిఁ దడిసి యం దొకరమ్యమైనచోట. ”

ఇది మిక్కిలి రమణీయమైనపద్యమే కాని పురోభాగిత్వమే వహించుచో నిందుమాత్రము శంకలు దోఁపవా? “కటి విడిచి యుదికి యారవేసిన గుడ్డలు తోరణాలు! పర్ణశాలలోని మంటలు దీపాలు! పెయ్యలనోటియెంగిలి నురువులు పుష్పములు!......ఆహా! ఏమి! శ్రీకృష్ణుని దారిద్ర్యభోగము! సోముఁ డిట్టిదానికై తపము చేయకుండుగాక!” అనుట యెట్టిదో పైవ్రాఁతయు నట్టిద యగు.

పిమ్మట శర్మగారు శైలిం గూర్చి కొంత వ్రాసియున్నారు. దీనింగూర్చి యతివిస్తర మేల? శైలిని మెచ్చుకొనుట పాఠకునిహృదయంబును బట్టి యుండునని పలువురు పండితులింతకుమున్నే వ్రాసియున్నారు. కొందఱకు నన్నియ వ్రాఁత

ప్రియము; కొందఱకుఁ దిక్కనది; కొందఱకు సోమనది; కొందఱకుఁ బోతనది; కొందఱకు శ్రీనాథునిది; కొందఱకు సూరనది; కొందఱకు రామకృష్ణునిది; కొందఱకు రాయలది; కొందఱకు రామరాజభూషణునిది;......ఇట్లే,...“భిన్నరుచిర్హిలోకః” అని యున్నదికదా! సోమనాథుని శైలి నిరుపమానముచు, నిరవద్యముచు, నిర్దుష్టముచు, మనోహరము నని చెప్పుటకంటె దానిం గూర్చి వేఱుగ వ్రాయ నక్కఱలేదు. శైలియందు దిక్కనయు నాతనికి దీటురాఁడు. తక్కిన యెల్ల విషయములఁ దిక్కనతరువాతికవి యితఁడే.

“వేయేల? సర్వవిధముల నిరవద్యము లగు కవితా లక్షణములకెల్ల నాలవాలభూతులు కవిత్రియమువారే. అట్లు లేకున్న నాంధ్రప్రపంచ మంతయు వారినే పరమప్రమాణ భూతులనుగా నమ్మియుండుటకుఁ గారణము లేదు.” అని శ్రీశర్మగారు వ్రాసిరి.

కవిత్వ(ముయొక్క) నిర్దుష్టతకే వారు పరమప్రమాణ భూతులని యాంధ్రప్రపంచము వారిని నమ్మినదిగాని వారి శైలిని నమ్ముట యెట్లు? ఎవరి శైలి వారిది. నిర్దుష్టతయందు నాచనసోమనాథుఁడే విషయమునను వారికిఁ దీసిపోవువాఁడు గాఁడు. కావుననే శబ్దరత్నాకరకారు లాతనిని గవిత్రియముతో పాటు మొదటితరగతికవిసింహముగా నెంచియున్నారు. “విశేషించి శైలిమొదలగు వానియందు వారి నాతఁడు

మించుచున్నాఁడు. " అని పలువు రింతకు మున్ను వ్రాసియే యున్నారు.

xviii. ఆక్షే. " వలాహకంబుం బోలెఁ గరకాస్పదంబై, కుంజరంబుం బోలెఁ గుంభాభిరామంబై రంగస్థలంబుం బోలె శైలూషశతరమ్యంబై......" ఇత్యాది కేవలకల్పనాధారములగువాక్యములు పైకెంతమనోహరంబుగఁగాన్పించినను, లోనఁ జూచితిమేని నిస్సారములుగ నుండును." అని శర్మగారు వ్రాసిరి.

ఇది 'కవిత'నుగూర్చి ప్రత్యేకోపన్యాసము వ్రాయువారు వ్రాయఁదగిన వాక్యము. అంతియగాని కవితారతమ్యనిర్ణయసందర్భమున నుండవలసినది గాదు. ఏమందురో, ఈయసారపువ్రాఁత, వీరు మెచ్చుకొనిన కవిత్రయమువారికి, నందును మిక్కిలిగ నెఱ్ఱనకు, ససారముగనే తోఁచియుండెను ! చూడుఁడు ! ఎఱ్ఱాప్రెగ్గడ—

వ.......' వేదంబునుంబోలె ననేకశాఖావలంబి ద్విజగణసేవ్యంబును, జలధరంబునుంబోలె గగనాచ్ఛాదనాభోగంబును శైలంబునుంబోలె బహుపాదపపరివేష్టితంబును.......(ఇం డింకను గలవు.") హ. పూ. ష.

వ.......శైలంబులుంబోలె నుద్ధతశృంగంబులును, మహాతరువులుంబోలె బంధురస్కంధంబులును, చంద్రకిరణం

బులుంబోలె బహువిగ్వ్యాపకంబులును......(ఇం దింకను గలవు !) హరి. పూ. స.

నన్నియ—వ......“ఉద్యానవనంబునుంబోలె బహువిద్రుమ లతాలంకృతంబైనదాని, నాటకప్రయోగంబునుంబోలె ఘనరసపాత్రశోభితరంగరమ్యంబైనదాని......” ఆదిప. ద్వి. 28 ప.

తిక్కన-వ......వివేకరహితహృదయంబునుంబోలెఁ దమోదూషితంబును విదగ్ధవనితాప్రేమంబునుంబోలె దుర్నిరూపంబును, “విరాటప. ద్వి. 325 ప.”

ఇట్టివి సంస్కృతవాఙ్మయంబునందును గొల్లలుగ లేక యున్నవి. వానివివరణ మనావశ్యకము.

ఇఁక శ్రీశర్మగారి వ్యాసమునందున్న యొకపద్యమును (ఎఱ్ఱనదానిని) గూర్చిన వ్రాఁతను జూపి విమర్శభాగమును ముగించెదను.

శ. వ్రా—“ఉషగన్నట్టు లనిరుద్ధుఁడును మొదలే కలగన్నాఁడు. తనమనసు నాకన్యయందు దగిలినది. గంభీరభావుఁడు గావున తనభావము నొరులకు తెలియకపడనీక మెలఁగుచుండెను. ఆతనిం గొనిపోవచ్చిన చిత్రరేఖ యాతనియవస్థను వర్ణించుపద్యముం జూడుఁడు! (ఎఱ్ఱనహరివంశము.)

“సీ. బలిమికోలున నఖ్వదళకొత్తినను మొగం
బెల్లఁ దానైయున్న వెల్లఁదనము

ధీరత దెచ్చికోల్పోండినఁ బలుకుల
యందు గద్గదిక వాయంగలేమ
గరువపుఁజూపుఁ బుచికొనియున్నను
రాగమే తెమవున రాము చేరఁ
జేతులు వేఁకచేఁతలకై చక్కఁ
బచరించినను నచ్చుపడదు చేష్ట
యితనిచిత్తమెవ్వతియేని చతురయొక తె
గొన్నయది దైత్యనాథునికూఁతు రితనిఁ
బొందినట్టుల యితనికిఁ బొందుగలుగఁ
బోలు దైవికమయ్యు నప్పొలఁతియందు."

ఈపద్యము నుదాహరించి శర్మగారు, "ఇట్టిపద్యమును దిక్కనతప్ప నితర కవులెవ్వరును వ్రాయలే రని చెప్ప సాహ సించెద" మనిరి. ఈపద్యము చాల బాగుగ నున్న దని నేనును జెప్పెదను. కాని తిక్కనతప్ప నితరకవులెవ్వరు వ్రాయలేరనుట మాత్రము సాహసమే యనెదను. ఇట్టిపద్యము లితరాంధ్ర కర్తల గ్రంథములలోను ననేకములు గలవు.

పైపద్యములోని రెండవపాదమునుగూర్చి వీరు "ఇందు యతిభంగముమాత్రమకాక స్పష్టముగ నర్థమును గావుట లేదు." అని పుట యధోభాగమున సూచికను వ్రాసినారు. దీనింబట్టి మొదటిపాదము వీరికర్థమైనట్లేకదా! మొదటిపాద మును బరిశీలింపుఁడు! వీరికెట్లన్వయమైనదో! మొదటి

పాదమునకంటె రెండవపాదమే సులభముగ నర్థమగుచున్నది. చూడుఁడు !

ధీరత=ధైర్యము, తెచ్చికోల్=తెచ్చికొనుటను, పొందినన్=పొందినప్పటికిని—అనియర్థము. ధైర్యముఁ దెచ్చికొనినను బలుకులయందు గాద్గద్యము తొలంగలేదని భావము. ఇఁక మొదటిపాదముం గనుఁడు ! ఇందు సమాపకక్రియయే లేదు ! (అర్థముమాట తరువాతఁ జూచి కొందము !)

" బలిమికోలు " ఇది యేమిశబ్దమో ! దీనికి లక్షణ మేమో ! ' బలిమి ' అనువిశేష్యశబ్దమునకు ' కోలు ' అను ప్రత్యయ మనుప్రయుక్త మగుటకు మార్గమేదో ! ఎట్టిన మహాకవి ' బలిమికోలు ' అనియే వ్రాసియుండునా ?

ఏలేఖకుఁడో తాను ప్రతి వ్రాయునప్పుడు మాతృకయందున్న మొదటిపాదములోని యక్షరములను సరిగా గ్రహింపఁ జాలకయో, ప్రమాదముననో ' బలిమికోలు ' అని ' బలిమి ' శబ్దమునకు ' కోలు ' అనుదానిని జేర్చెఁగా, దానిని మాతృకగా గ్రహించిన మఱియొకవ్రాయసకాఁడు, రెండవ పాదమున ' తెచ్చి ' యనుక్రియాపదమున కదియేల చేర్పఁబడరా దని కాఁబోలు, ' తెచ్చికోల్ ' అని వ్రాసియుండును. తుదకది ' తెచ్చికోల్ పొందినధీరత ' యనియో, ' ధీరత పొందిన తెచ్చికోల్ ' అనియో మాఱఁగా, " ఈతలతిక్క—యన్వయమేల ? యతిదప్పినఁ దప్పెఁగాక " యని యెవ్వరో

స్పష్టముగా నర్థముకావుటకై ‘ధీరత తెచ్చికోల్ పొందిన’ యని మార్చియుందురు. ఇట్లున్నను స్పష్టముగ నర్థముకాలే దని వీరన్నారు!

శ్రీపీఠికాపురసంస్థానపుఁ దాళపత్త్రిప్రతిలోని యీ క్రిందిరెండుపాదములును జదివినచో నెఱ్ఱనమహాకవి వ్రాఁత నిర్దుష్ట మని విశదమగును.

సీ.“బలిమికొల్వున నవ్వ్రదభుకొత్తినను మొగం
బెల్లఁ దానైనది వెల్లఁదనము
ధీరతఁ దెచ్చి పొందించినఁ బలుకుల
యందు గద్గదిక వాయంగలేదు.”

పిమ్మట వీరు సోమునికవిత్వమును గొంత పొగడినారు. ఆపొగడిక యందైన నాతనియెడ దోషారోపణమును జేయక యుండలేదు! అందున్న యొకవిషయముమాత్రము చూపెదను.

సోమనాథుఁడు వ్రాసినఘంటాకర్ణోపాఖ్యానములోని కొన్నిపద్యములను వీరుమెచ్చుచు, ఘంటాకర్ణుఁడు శ్రీకృష్ణుని తోఁ బలుకు,

“శా. ఘంటాకర్ణుఁడ నేను నాయనుజుఁ డీ
కాలాంతకుం డేము ము
క్కంటిం గొల్తుము కిన్నరేశుపనికై
కైలాసశైలంబునన్

జంట స్వచ్ఛపు సారమేయములు నీ
సైన్యంబులుఁ మాఁవె యే
వెంటం బోయితి మేమి గాఅడవిలో
వేటాడరే యెవ్వరుఁ ? ”

ఉ. హ. ద్వి

అనుపద్యము నుదాహరించి “ముక్కంటిం గొల్తు మనుట ప్రాసమునకై వచ్చినది......ఘంటాకర్ణుఁడు పరమ వైష్ణవుఁడు.” అని వ్రాసిరి ! ఇది పొగడులోఁ దెగడు !

సోమనాథునివంటిమహాకవి ప్రాసమునకై పరమవైష్ణవుని శుద్ధశైవునిఁ జేయునా ? ఇప్పటివా రెవరైన నొకహిందువును బ్రాసముకొఱకు సాయెబును జేయుదురా ?

ఒకవేళ సోముఁ డట్లు ప్రాసమునకే వ్రాసినాఁ డనుకొన్నను ‘కిన్నరేశుపనికై’ అనుదానికి గతి లేదే ! అది దేనితో నన్వయించును ? ఇచ్చట నన్వయించుకొనుటయందు వీరు తొందరపడినారు. దోషమారోపించుతలంపున్నప్పు డర్థాన్వయాదులపై బుద్ధి యుండునా ?

“కిన్నరేశుపనికై కైలాసంబున ముక్కంటిం గొల్తు” మని యన్వయము.

(పరమవైష్ణవులు మాత్రము శైవులకడ నధికారులై యుండఁగూడదా ? ఉండలేదా ? వారు మహమ్మదీయులఁ గొలిచినారు గారా ? ఇప్పుడు మనయాంగ్లేయులఁ గొల్చుచుండ

లేదా ? అట్లు కొలుచుట గ్రాసమునకుఁ గాని ప్రాసమునకుఁ గాదు ! ఏఁటి యాక్షేపమో యిది !)

మఱియు మూలమును జూచినచో ఘంటాకర్ణుఁ డెట్టి వైష్ణవుఁడో తెలియును. ఆతఁడు మొదట విష్ణునామము విన నొల్లక చెవులకు గంటలు కట్టికొనిన శుద్ధశైవుఁడై యుండి పిమ్మట బోధితుఁడై పరమవైష్ణవుఁ డయ్యెను !

పైపద్యమునందలి యొకశబ్దముం గూర్చిన చర్చ, యప్రస్తుత మయ్యు భాషాసంబంధి యగుట, నిచ్చట సంగ్రహముగ వ్రాయఁబడుచున్నది.

శబ్దరత్నాకరమున ' వెంట ' అనుశబ్దమునకు ' వేట ' అనునర్థము వ్రాయఁబడి పై " ఘంటాకర్ణుఁడ......మాయవే, వెంటంబోయితి మేమి..." అనుపద్యమే యుదాహరింపఁబడి యున్నది. దీనిం గూర్చి నన్నిచోడమహాకవి కుమారసంభవము పీఠికయందు బ్రహ్మశ్రీ మానవల్లి రామకృష్ణకవిగారు,

" ఇతని (నన్నెచోడని) కాలములో దీర్ఘమువిూఁది యర్ధబిందువును బూర్ణబిందువుగానే వాడుచున్నట్లును కృష్ణదేవరాయలకాలమునకే యది యర్ధబిందు వయ్యెననియు నిక్కృతివలనఁ దేలుచున్నది. దీర్ఘమువిూఁది నెఱసున్నలు సోముఁడుకూడఁ బ్రయోగించి యున్నాఁడు. చూడుఁడు.

(ఆ). "ఉ. ఎంచిన ప్రేమ నీపదక
మిమ్మని రుక్మిణి మున్ను వేఁడుడుం

బూంచిన పూంపుదక్కఁ బలు
    పోకలఁ బోవుచునుండు దేవుఁడున్
డాంచిన సొమ్ముచేరె సక
    టా మదిఁ గోరవిసత్యభామకున్
నోంచిన వారిసొమ్ము లవి
    నోమనివారికి వచ్చునే యిలన్.
                                        ఉ. హ. ప్రి. 167

(b) "శా. ఘంటాకర్ణుఁడు నేను......ము,కట్టంటిం......
జంటన్......వేంటం......(ద్వి. 140)

"ఏచుశబ్దమున నరసున్న యీయర్థమున లేదు; వేఁట, యనుటకు 'వెంట' యని రూపాంతరము స్థలాంతరమున నెచట లేదు......" అని వ్రాసియున్నారు.

ఆచార్యులవారియర్థమును, కవిగారియభిప్రాయమును (రెండును) బొసఁగనివిగాఁ గన్పట్టుచున్నవి. ఏలయన,

సామాన్యముగా, పూర్వులు పూర్ణబిందుపూర్వకము లగునక్షరములను ద్విత్వసహితములుగ, అర్ధబిందుపూర్వకము లగువానిని పూర్ణబిందువుతో ద్విత్వరహితములుగ వ్రాయుచు వచ్చిరి. ఎట్లన, 'పండు' అను దానిని 'పండ్డు' అనియు, 'వాఁడు' అనుదానిని 'వాండు' అనియు వ్రాయుచుండెడి వారు. ఈహేతువును బట్టి పై రెండు పద్యములలోఁ బ్రాసాక్షరములు గలశబ్దముల నీక్రిందివిధమున మనము గ్రహింపవచ్చును.

(a) "ఎంచ్చిన, పూంచిన, డాంచిన, నోంచిన"
అని పూర్వులవ్రాఁత.

"ఎఁచిన, పూఁచిన, డాఁచిన, నోఁచిన"
అని యిప్పటివారివ్రాఁత.

(b) "ఘంట్టాకర్ణుఁడు, ముక్కంట్టిన్, జంట్టన్, వెంటన్"
అని పూర్వపువ్రాఁత.

"ఘంటా...ముక్కంటిన్, జంటన్, వేఁటన్"
అని యిప్పటివ్రాఁత.

సావధానముగఁ బరికించుచోఁ బైరీతి నుండునక్షరములకుఁ బరస్పరము ప్రాసమైత్రి యొప్పును సరిపడ దని విశదమగును. ప్రామాణికాగ్రగణ్యుఁడైన సోమనాథుఁ డిట్టిప్రాస సాంకర్యము నొనర్చినాఁ డనుట న్యాయేతర మని నాయభిప్రాయము. (ఇట్టిప్రాస మతిపురాతనకాలమున నుండెడిది. నన్నియాదులు దానిని సమ్మతింపక సంస్కరించినారు. తిక్కన సోమనాథు లీసంస్కారమునే యవలంబించినారు.)

(a) శ్రీ రామకృష్ణకవిగారు "ఏచుశబ్దమున నరసున్న యీయర్థమున లేదు." అని వ్రాసియున్నారు. "ఈయర్థ" మనఁగా నేయర్థ మని వారియభిప్రాయమో విస్పష్టము గా లేదు. ఏచు=అతిశయించు, పెరుఁగు, విజృంభించు మొదలగునవి. (శబ్దరత్నాకరము)

'ఈయర్థ' మనఁగా—అతిశయించు మొదలగు నావిధానొకయర్థ మని వారియాశయ మైనట్లు తోఁచెడిని. అప్పటికైన 'ఏచినప్రేమ' అనుచోఁ బైపద్యములలో మొదటిదానియందు సబిందుక నిర్బిందుక ప్రాసపాంకర్య మేర్పడును. కావున "ఎంచిన ప్రేమ" యనియే సోముఁడు వ్రాసియుండు నని వారిమత మైనట్లు తేలుచున్నది. సోమనాథుఁ డట్లే వ్రాసియుండు నను కొన్నను, "ఎంచు" నకుఁ గలయర్థములలో నొక్కటియు నిచ్చుటఁ బొసఁగదు. చూడుఁడు. ఎంచు=గణించు, తలఁచు, ఆక్షేపించు, ప్రశంసించు మొ॥ (శబ్దరత్నాకరము.)

పూర్వుల వ్రాఁతను బట్టి 'ఎంచిన' అనుదానిని 'ఏఁచిన' అనియే మనము గ్రహింపవలసియుండును. 'ఏ, ఓ' లు పైపొల్లులు లేకుండ 'ఎ, ఒ' అని పూర్వము వ్రాయఁబడుచువచ్చెడి వనుట (నేఁడుసయితము పెద్దలగువారును, మఱికొందఱును నట్లే వానిని వ్రాయుదురనుట) యెల్లరకు విశదమే. కావునఁ దాళపత్త్రగ్రంథలేఖన సంప్రదాయమును బట్టి 'ఎంచిన' అనుదానిని 'ఏంచిన' అనియు, పిమ్మట 'ఏఁచిన' అనియు మనము గ్రహింపవలసియుండును.

సోమనాథమహాకవి(సార్థబిందుకమగు)'ఏఁచు' ధాతువునే యిచ్చటఁ బ్రయోగించియుండును గాని 'ఏచు' అనుశబ్దముతో సబిందుక నిర్బిందుక ప్రాసపాంకర్యముగాని, 'ఎంచు' శబ్దముతో పూర్ణాపూర్ణబిందుపూర్వకము లగునక్షరములకుఁ బ్రాస మైత్రి

గాని యొనర్చియుండదు. (సార్ధబిందుకమగు) 'ఏచు' నకు 'బాధించు' అని యర్థము. (చూ. శబ్దరత్నాకరము—ఏచు) ఏచినప్రేమన్=బాధించుచున్నప్రీతిచేత నని యర్థము. (ఈ 'బాధించు' నది పదకముపై బ్రేమపదకమునం దున్నయాసక్తి తన్ను బాధింపఁగా నని భావము.

ముద్రితగ్రంథములలోని "ఏచుచు బ్రేమన్" (వీరేశలింగముప్రతి) "ఏచును పేందురిన్" (వావిళ్లవారిప్రతి) అనుపాఠములు, సోమనాథుని శబ్దాలంకారనియమమునకు (ఏచిన, పూఁచిన, డాఁచిన, నోఁచిన అనుక్రమమునకు) భంగకరములు గావున నసంగతములు. కావున 'ఏచినప్రేమ' అని యుండఁదగును.

(b) 'వెంట'కు 'వేఁట' యనునర్థము స్థలాంతరమున నెచ్చటను లేదని రామకృష్ణకవిగారు వ్రాసియున్నారు. సత్యమే. శబ్దరత్నాకరమున నీయర్థము ప్రమాదయుక్తముగఁ గన్పట్టెడిని. పూర్వపుఁవ్రాఁతను బట్టి "ఘంటాకర్ణుఁడు..." అను పద్యమునందు "వెంబ్టై" అని యున్న "వెంట"కు "త్రోవ" యనియే యర్థము గాని 'వేట' యను నర్థముగాదు.

ఏ వెంటం బోయితిమి=ఏత్రోవను బోయితిమి? అని యర్థము. 'ఏతప్పుత్రోవను బోయితిమి? అని భావము.

ఉదాహ:—ఏమి చేసితి నని నన్నుఁ దిట్టితివి?=ఏమి తప్పువని చేసితి నని నన్నుఁ దిట్టితివి?—అనుట.

పైపాదమున వేఱొక 'వేట' శబ్దమున్నది గావున నీ 'వెంట' కుఁ ద్రోవ యనునర్థమును గ్రహించుటయే యుక్తము. ఏ(తప్పు)తోవను బోయితిమి? కాఱడవిలో వేటాడరాయేమి? యని యన్వయము. సీతారామాచార్యుల వారిప్రతిలో 'వెంట్ట' అనుటకు 'వెంట' యని యుండుటచే నిట్టిభ్రాంతికిఁ గారణ మయ్యె నని తోఁచెడిని.

ఇంతవఱకు నాచనసోమనాథునిపై నారోపింపఁబడిన దోషములు, దుర్గుణములు భ్రమప్రమాదపరికల్పితములుగా నిరూపింపఁబడినవిగదా! ఇఁక నాతనికవిత్వతత్త్వమునుగూర్చి యించుక విన్నవించెదను.

నాచనసోమనాథమహాకవి 'ఆంధ్రవ్యాసమహర్షి' యగు తిక్కనసోమయాజికి శిష్యుఁడనియు 'ఆంధ్రకాళిదాసుఁ' డనియుఁ జెప్పఁదగినవాఁడు. సకలవిద్యాపారంగతుఁడు. ఆతని గ్రంథములోని గద్యమునందును, బుక్కరాయలచే నాతని కియ్యఁబడిన దానశాసనమునందును ననేకబిరుదము లాతనికిఁ గలవు. అవి యన్నియు సార్థకములు. ఇతనిగ్రంథమునందు భారతములోని కొన్నిభాగములను మించు నవీనగుణము లనేకములు గలవు. "ఈతఁడు తిక్కనసోమయాజియం దపారగౌరవము నుంచి యాతనివలెఁ గవిత్వముఁ జెప్పనెంచి తత్ప్రయత్నమును బరిపూర్ణముగ నెఱవేర్చుకొనెను." అని విమర్శకాగ్రేసరులగు మ. రా. రా. శ్రీ మానవల్లి రామకృష్ణకవి,

ఎం.ఏ. గారు వ్రాసినది యథార్థము. తిక్కనసోమనలపద్యము లందు సొంఁడొంటిని బోల్పఁ దగిన పద్యములు నూఱుల కొలఁదిఁ గలవు. మఱియుఁ గొన్నివిషయముల నాతని కీతఁడు * తీసిపోవుచున్నను, గొన్నివిషయముల 'గురువును మించిన శిష్యుఁ' డగుచున్నాఁడు. అవి మృదుమధురపదప్రయోగముల తోఁ గూడిన శైలిలోనగునవి. ఈతనిపద్యములు భాషాదేవి విపంచీనినాదముం బోలె శ్రోతలకు మహత్తరానందముం గూర్చును. ఏయేస్థానముల నేయేపదముల, నేయేలోకోక్తులఁ బ్రయోగించినఁ జదువరులహృదయములయం దాయాకథా భాగములలోని విషయము లచ్చొత్తింపఁబడినట్లుండి హాయిం గూర్చునో యాప్రయోగవిధానమును దిక్కన తరువాతఁ బక్కఁగ నెఱిఁగినవాఁ డీతఁ డొక్కఁడే. వేసవి తెరువరికి నెలయేటిబోలెఁ బాఠకవర్యునకు నీతనికవిత యెనలేనిసౌఖ్య మొడఁగూర్చును. కవిత్రయములో నొకఁడగు శంభుదాసుఁడు ను, కవిసార్వభౌముఁ డగుశ్రీనాథుఁడును ననేకస్థలంబుల సోమునికల్పనలను, పదపద్యంబులను, భావములను ననుకరిం చియుండి రన నీతని యౌత్కృష్ట్యముంగూర్చి వేఱచెప్ప నేల? అందు 'సీసమునకు శ్రీనాథుఁడు' అనుశ్రీనాథునిప్రఖ్యాతిలతకు సోమనాథుని సీసపద్యకవితాధోరణియే యాలవాలము. శ్రీనాథుని సీసపద్యముల పోకడ లన్నిటికి సోమునిసీసము లే

* ఈ 'తీసిపోవుట' అనునది యాతనిసంపూర్ణగ్రంథము లభించువఱకే!

యాధారములు. మఱియు శ్రీనాథునికవిత్వములో ననేకస్థలం బుల నాచనసోమునిచిఱునవ్వు గానవచ్చుచుండును. వేయేల? కవిసార్వభౌముఁడు సోముని శిష్యులలో నగ్రగణ్యుఁ డని చెప్పుట యతిశయోక్తి గానేరదు. ఎట్లన శ్రీనాథులయనుకరణ ములం గనుఁడు.

సోమన:—

సీ. మకరంద మాని మైమఱచిన గొనయంబు
వెడమ్రోయు గడిఁబోని వింటితోడ
జలజకేసరరాజి జల్లెడమూఁకగా
దాఁటు వశారిరథ్యములతోడఁ
గన్నికారపుమొగ్గ కనకంపుగుబ్బగాఁ
గోయిలనోరూరుగాడుగుతోడ
రతికన్నుగవమచ్చరముసేయుటెక్కెంబు
వడఁక వీతెంచుసేవకులతోడ
వలపుఁదూపులు గరసాన వాఁడిసేసి
మందునెలతోడఁ దనమేనమామ యైన
నిండునెలతోడ వలరాజు నిర్జరేంద్రు
సభకు నేతెంచె భుజబలోత్సాహ మెసఁగ. ”

(సంస్కృతహరివంశమున నీవర్ణనము లేకున్నను సోముని నెట్టన యీరీతి ననుకరించినాఁడు.)

(1) ఎఱ్ఱన:—

సీ. “ముందట నెలమావిమొక్కల నలరించు
కర్త దా నగుచెలికాఁడు నడవ
నిరువంకలందును విరులతేనియఁ గ్రోలు
దారలు మోదంబునఁ దుల్లి యాడ
నునుఁగుత్తుకలతీపుఁ గనఁ గూయుపులుఁగుల
చారునాదములు కైవారములుగఁ
జందనగిరినుండి చనుదెంచి చల్లని
బంటెల్లపనులకుఁ బరువువెట్టఁ
జిలుకమావులు గట్టిన చిగురుతేరి
పసిఁడిబలుమీనుపడగ యెద్దెసల మెఱవఁ
జెఱకువిల్లు పూవమ్ము లేర్పఱ ధరించి
గట్టిబిగిసి యేతెంచె నక్కడిమిమగఁడు.”

(2) శ్రీనాథుఁడు. (హరవిలా. తృ. ౩౮ ప.)

సీ. “కాంతాజనంబుల కటివంకబొమలతోఁ
బ్రతివచ్చు పుష్పచాపంబుతోడఁ
గోకిలవ్రాతంబుఁ గుక్కిళ్లుమ్రింగించు
క్రొమ్మావిచిగురాకుగొడుగుతోడ
రతిదేవినిడుసోగగ్రాలుకన్నులుడాలు
దలఁపించుమీనకేతనముతోడ

భుజగలీలావతీభుక్త శేషము లైన
గంధవాహకిశోరకములతోడఁ
జందురునితో వసంతమాసంబుతోడ
రాజకీరరథం బెక్కి ప్రాభవమున
వచ్చె వలరాజు చిత్తానువర్తనముగ
సంభ్రమముతో మహేంద్రునాస్థానమునకు.

(పైమూఁడుపద్యములను బరీక్షించినపాఠకవర్యులు తత్తత్కవుల సామర్థ్యముల నరయుదురుగాక!) మఱియు, సోమనాథుని హరివంశగ్రంథమును జదువఁ దటస్థించిన యాంధ్రకవులందఱు నాతనిపద్యములవంటి వానిని విడువక వ్రాసియే యుండిరి. ఒండురెం డుదాహరణములు.

సోమన—

సీ.పా. "మాఁగుపాఱిన చంద్రమండలంబునుబోలె
వదనారవిందంబు వన్నెదఱుగ

చఱిగొండ ధర్మన—

సీ.పా. "సైంహికేయచ్ఛన్నచంద్రబింబమురీతి
వదనంబు మిక్కిలి వాడి కంద

సోమన—

సీ.పా. "బ్రహ్మర్షుఖార్థమై పర్వతేశు నితండు
దాల్చినాఁ డీతండు వ్రాల్చినాఁడు

ఫణిపరంపరతోడి పన్నగేంద్రు నితండు
మెట్టినాఁడీతండు చుట్టినాఁడు

కవిలోకబ్రహ్మ—

సీ.పా. "శేషపన్నగరాజు సెజ్జగా నాతండు
వ్రాల్చినాఁ డీతండు వ్రాల్చినాఁడు

సోమన—

సీ.పా. "దైతేయమదవతీధమ్మిల్లములతోడ
విరుల్రనెత్తావికి వీడుకోలు

నిశ్శంకుని కొమ్మన—

సీ.పా. "దైతేయకాంతలతళుకుఁగెమ్మోవుల
పీటికాశ్రీలకు వీడుకోలు

(వీరమాహేశ్వ.)

సోముని గ్రంథములోని నరకాసురయుద్ధమును పోతన భాగవతములోనిదానిని జూడఁదగును. చూపఁ బూనిన నిట్టివెన్నియోని గలవు. గ్రంథవిస్తరభీతిని విరమించెద.

శ్రీమాన్ ఘనప్పాకము, అనంతాచార్యులవారి వైజయంతీపత్త్రికయందు నాచనసోమనాథునిఁ గూర్చియు, నాతని గ్రంథముం గూర్చియు వ్రాయఁబడిన ప్రశంస యాతని యధార్థ్యమును దెలుపుచున్నది గావున దాని నిచ్చట వ్రాయుచున్నాను

... ... “ఇట్టియుద్గ్రంథమును దేహధనవ్యయములు చేసి యతిప్రయాసమున దీనిని సంపాదించి ముద్రించి లోకవ్యాపకముచేసిన వీరేశలింగము పంతులుగారిదివఱకు శతాధికగ్రంథములు వ్రాసి పొందిన గౌరవములకంటె దీని ముద్రించుటచే సంపాదింపఁగలకీర్తియె వేయిమడుంగు లెక్కువ యని మాయభిప్రాయము ......... ఈకవి సర్వజ్ఞుఁ డైనను ఇతనికి వేదాంతమునందు గలప్రజ్ఞ యపార మన్నియుఁ దోఁచుచున్నది. ఇతఁడు కేవలపుస్తకవిద్యలయందె కాక వాత్స్యాయనోక్తంబు లగు చతుష్షష్టికళలయందును కుశలుఁ డని యితని గ్రంథము వేయివిధంబులఁ జాటుచున్నది. ఇతఁడు పుట్టుకవి. లోకస్వభావము చక్కఁగా నెఱింగినవాఁడు. అపారమైన భావనాశక్తిగలవాఁడు. ఆంధ్రభాషయందెల్ల నితఁ డొక్కఁడే పదవాక్యప్రమాణజ్ఞుఁడు. ఏకవియు నూహింపని యనేక విషయముల నీతఁడు పాటించియున్నాఁడు. ......... ”

ఈరీతిగ సోమనాథుని కవిత్వము పలువురచేఁ గొనియాడఁ బడియున్నది. నవీనగుణసనాథుఁ డగుసోమనాథుని గ్రంథమునఁ గొన్నివిశేషము లగపడుచున్నవి. అందొక పద్యమును బట్టి గ్రహింపఁదగిన కొన్నివిశేషములను మాత్ర మిచ్చుట నిచ్చుచున్నాను.

ఉ. ధనదాంతఃపురతారహారములు, యా
దఃపాల బాలాఘన

స్తనకాశ్మీరము, ధర్మరాట్కులవధూ
సంవ్యానకౌశేయముం
దనుజేంద్రారివరావరోధదయితా
ధమ్మిల్లమాల్యంబులుం
గినుకం దెచ్చి ఘటింపఁ జూచు జయల
క్ష్మీనిత్యనైపథ్యముల్.

ఉ. హ. ప్ర. 16ప.

నరకాసురుఁడు దిక్పాలపత్నులయలంకారములం దెచ్చి, వానితోఁ దనజయలక్ష్మిని నైసేయఁజూచుచున్నాఁడు. అప్పుడు వానిదృష్టి 'బుద్ధిః కర్మానుసారిణీ'యనున్యాయమున దిగధీశ్వరసతులకడకు, (ఉత్తరమునుండి తూర్పునకు) అప్రదక్షిణముగాఁ బోవుచున్నది. ఏమన, లబ్ధవరుఁడైన వానికప్పుడు గలుగఁ బోవు దిగ్విజయసంపద స్థిరముగ నుండునదిగాదు. ఈపద్యము మొదలుకొని యాగభాగములకై మునీంద్రులను నరకుఁడు బాధించుపద్యమువఱకును నీయౌచిత్యము చక్కఁగాఁ బాటింపఁబడి నవీనగుణసనాథునిరచనాసామర్థ్య మనన్యసాధ్య మని వేనోళ్లఁ జాటుచున్నది. చూడుఁడు.

నరకునితో దేవేంద్రుఁడు మొదట సమర మొనర్చు చుండ నాతనికిఁ దోడుగావచ్చినలోకపాలుర రాక సప్రదక్షిణము గాఁ గవి చెప్పియున్నాఁడు :—

తే. గీ. "వచ్చె యక్షగుహ్యకులతో వైశ్రవణుఁడు;
దోఁచె వారుణభుజగయాదోబలముల
తోడ వరుణుండు; కాలమృత్యువులతోడ,
నడచె దండధరుండు దానవులమీఁద."

ప్ర. 24.

దీనివలన రాఁబోవుదేవతల యపజయము సూచింపఁ బడినది.

మఱియు నరకుని నోటనుండి వచ్చుమాటలు గల యీక్రిందిపద్యముల నరయుఁడు.

ఉ. "ఆలలితాంగిఁ జూచి నర
కాసురుఁ డిట్లనుఁ బాకశాసనుం
డాలములో ననుం గదిసి
యంతక, పాశి, కుబేర యుక్తుఁడై
తోలుపులం బడెన్ ... ... ... ... ... ...

ప్రథ. 61 ప.

ఇందు దిగధీశులరాజ్యములు స్థిర మైన వగచున్నవి గావునఁ బ్రదక్షిణముగఁ జెప్పఁబడియె.

(అప్రదక్షిణము.)

మ. అవె సుత్రామరథంబు లల్లవె కుబే
రానేకపశ్రేణులు

ల్లవె పాశ్చాత్త్యతురంగమంబు లవె ప్రే
తాధీశవీరావళుల్

నరకునికి లభించిన వైరథానములు వానికి నిల్చునవిగావు. కావున నపరిదక్షిణము.

(ప్రదక్షిణము.)

చ. “ అవు నిదిపోలు వానవుఁడు
నంతకుఁడు న్వరుణుండుఁ బార్వతీ
ధవసఖుఁడుం బ్రతాపమునఁ
దత్పదమేలుదురు.........”

ప్రి. 80 ప.

(అప్రదక్షిణము.)

శా. “ పాశిం బాఱఁగఁ దోలి, యంతకు దిశా
పట్టంబు గావించి, పూ
ర్వాశాధీశ్వరు వెన్నడిం జని, ధనా
ధ్యక్షు న్విభాళించి కే
లీశస్త్రాస్త్రవిహారుఁడైన నచటన్
లేకుండ నిర్మించితిఁ
మీశాస్త్రంబులు నింక నెవ్వరికగుఁ
మేలైన యజ్ఞాంశముల్?

ప్రి. 91.

మఱియుఁ బైవానిలో నీతండు పాటించిన వృత్తములను గూడఁ బరీక్షింపఁ గోరెదను. పై "ధనదాంతఃపుర... అనుపద్యమును బట్టియు, నింకను గ్రంథమునఁ గానవచ్చు కొన్నిచోటులం గలపద్యములను బట్టియు వివరింపవలసిన విశేషము లనేకములు గలవు. వానిని మఱియొక గ్రంథమున వ్రాయఁదలంచి ప్రస్తుతము, ప్రబంధరాజములోని యీక్రింది పద్యరాజమున నిక్కవిచక్రవర్తిని స్తుతించుచు ముగించుచున్నాను.

శా. "ఔరా! హారివచోరసస్థితి! యహో
హో! శబ్దదాంపత్యా! మ
య్యారే! పాకబుజాక్రమంబు! భళి! శ
య్యారీతు! లోహో! చమ
త్కారం! బద్దిర! జాతివార్తలు! పురే!
ధారాసమారూఢి! మ
మ్మారా! రాజదలంకృతుల్! కవులలో
మాన్యుండ వీవన్నిటన్ !"

# రసాభివర్ణన పటుత్వము

౨౦

— ఎఱ్ఱన, సోమనలు —

ఆంధ్రపత్రిక దుర్మతివత్సరాదిసంచికయందు బ్ర. శ్రీ. రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారు, ఎఱ్ఱన,సోమనలతారతమ్యము ను స్థిరపఱుప నిట్లు వ్రాసియున్నారు.

శ. వ్రా. "రసపరివాహమున నెఱ్ఱనయం దున్నంత బిగువు, నిర్మలతయు సోమునియెడ లేవు. ఒక్కయుదాహరణ ము—ఉలూఖలబద్ధుఁడగు బాలకృష్ణుఁడు ఱోటిని జమిలిమద్దుల నడుమ నీడ్చుకొనిపోఁగా, నాచెట్లు కూలెను. అప్పుడు కొందఱు గోపికలు సంభ్రాంతలై పాఱివచ్చి యశోదతో నిట్లనిరి :

"ఉ. ఎక్కడిబిడ్డ నీకు ? నిటు
లెంతయుఁ గట్టెఁడి వేయుగంబులన్
బ్రాక్కుడు ఱోటితో బలియుఁ
బుత్రిని ద్రాఁపులఁ గట్టి నాఁడువా
రక్కట ! కల్గిరే ! వినఁగ
నాఱడికోయెఁ గుమారుఁ డేపుసన్
మిక్కుటమైన ద్రాఁకు లవె
మీఁదఁబడెన్ ఏశిఁ దాఁ బెసంగెడున్."

"మ. అనినం దల్లడమంది మేను విరియన్
హా యంచు గోపాలభా
మిని విస్రస్తములై స్తనాంచలము ధ
మ్మిల్లంబు దూలంగ లో
చనపద్మంబుల బాష్పధార లెసఁగన్
సంభ్రాంతిఁ బాదద్వయం
బును దొట్రిల్లఁగఁ బాఱె గోపికలు ను
ద్భ్రాంతాత్మలై తోఁ జనన్."

" ఉత్తరహరివంశమున ననిరుద్ధుఁడు చిత్రరేఖచే నపహరింపఁబడఁగా నాతని యాఁడువారు,

" సీ. చెందమ్మివిరులలోఁ జిందు తేనెలుఁబోలెఁ
గన్నుల బాష్పాంబుకణము లడర
వలుదచీకట్లలోఁ బ్రాలు చుక్కలుఁబోలె
వేణీభరమ్ముల విరులు వ్రేలఁ
దూలుతీగలవెంటఁ దూగు తేఁటులుఁబోలె
ననుసన్నడుముల నారులొరయ
రేయి జక్కవలఁ జేరిన చంద్రికలుఁబోలెఁ
జన్నుల ముత్యాలసరులు పెనఁగ

ముద్దుమోము లల్లార్చుచో మూఁపులందు
గగ్న భూషణజాలంబు గళవళింప

మార్చిమార్చి చేతులవ్రేళ్లు మడఁచికొనుచు
నింక నెట్లమ్మ యనుచు నయ్యెంతు లేడ్వ."

"పై రెండు పద్యములును బరీక్షింపవేఁడెదను. ఏడ్పు పన్ని వేళ మొకతీరయినను రసధార రెండవపద్యమునకన్న మొదటిదానియందు తీక్ష్ణము కాదా? రెండవదానియందు చమత్కార మెక్కువయని యంగీకరించితిని. కాని యంత మాత్రమున మనము మోసపోరాదు. యశోద వెంటనే, కృష్ణుఁడు కాలో చేయియో విఱుచుకొన్నట్లు, ఎట్టిన 'సంభ్రాంతి'తోఁ బరువెత్తినట్లు, మనలఁ బరువెత్తించినట్లు ఉన్నది మొదటిపద్యము. రెండవది యేడ్చువారితో సానుభూతి లేక తూలికయు వన్నెలుఁ దీసికొని నిదానముగా నవ్వుచ్చుఁ జిత్రించినట్లున్నది. ............ " అని శర్మగారు వ్రాసిరి.

ప్రత్యు. పైవ్రాఁతను జదివిన పాఠకమహాశయులకు శర్మగారిచ్చిన యుదాహరణము, ఇరువురుకవులు నొకేఘట్టము ను వర్ణించినవి గాదనుట స్పష్టమే. మొదటిది యెఱ్ఱాప్రెగ్గడ హరివంశ పూర్వభాగములోనిది. రెండవది సోముని ఉత్తర హరివంశములోనిది. ఈరెంటికిని సాదృశ్యము గానరాదు. ఎట్లన, ఆయాఘట్టములయందు క్లేశమనుభవించుపాత్రములు వేఱు; వారుండుస్థానములు వేఱు; వారికిఁ దటస్థించినయవస్థ లును వేఱే. ఎఱ్ఱనఘట్టమున,

యశోద గొల్లభామ. ఆమె నివసించునది వ్రేపల్లె. కూలినవృక్షములనడుమనున్న శ్రీకృష్ణుఁ డెట్టయెదుట నగవడుచున్నాఁడు! చానంజేసి యశోద సంభ్రాంతయై పరువెత్తినది.

సోమనాథుఁడు వర్ణించుస్థలము ద్వారకానగరమునందున్న యనిరుద్ధునిసౌధము. శోకించువారు శుద్ధాంతకాంతలు. దుఃఖము సంభవించునప్పుడు, రాజాంతఃపురమున వసించు నబల లెట్లు విలపింతురో యాస్థితి సోముఁ డెఱుఁగును. రాణివాసపుస్త్రీలు, “మార్చి మార్చి చేతులవ్రేళ్లు మడఁచికొనుట, ఇంక నెట్లమ్మయనుట” కంటె నెక్కుడుగ నేమియుం జేయఁజాలరు. వారు యశోదవలె పిడుఁబడి పర్వులెత్తఁ జాలరు. పరువులెత వలయునన్నను, ఆతఁ డెచ్చటనున్నాఁడో వారికిఁ దెలియదు. అంతకుమును సౌధములన్నియు వెదకి వెదకి “ఇంక నేమిసేయుదమమ్మ” అని వగచియే యుండిరి. కావున యశోద పొందినంత తొట్రుపాటు ననిరుద్ధకాంతలు పొందవలసినంత యుక్తిఅ గానరాదు.

చిత్రరేఖ యనిరుద్ధు నెత్తికొనిపోవుటను శీఘ్రగా రెఱుంగుదురు గావునఁ గవి తల్లడపడలేదని సంభ్రమించుచున్నారుగాని, యయ్యవరోధజనము హృదయముల నెఱింగిన సోమనాథమహాకవి యంతలోఁ దొందరపడువాఁడా? ఆతఁడు సర్వజ్ఞుఁడు.

తనుబిడ్డఁడు గానరానియప్పుడు తల్లిదండ్రులు మొదలగు వారు వానియుదంత మెఱుంగుదాఁక నొకవిధమైన విషాదముతోఁ గన్నుల నీరుదెచ్చుకొనుచుఁ దదన్వేషణప్రయత్నములఁ గావింతురు. హృదయమునఁ గీడు దోఁచుచున్నను దానివెనువెంట నాశయు నుదయించి దానిం గప్పుచుండును. ఇది లోకస్వభావము. విమర్శకుఁడు దీని నెఱిఁగియుండవలయును.

నాగానందనాటకమున, జీమూతవాహనుని వెదకికొనుచు వచ్చు వానితలిదండ్రులు తమపాదములచెంతఁ బడిన తమ పుత్త్రుని శిరోరత్నమును జూచియు, నాతనిదేమోయని తల్లడపడియు నది యచ్చట గరుడఁడు భక్షించు సర్పములదై యుండు నని వెంటనున్న సునందుఁడు పలుకఁగానే కావచ్చు నని యాశఁ జెందిరి !

అట్లే యనిరుద్ధుని సంపూర్ణోదంతము తెలియవచ్చు దనుక నాతని యేఁడువారు, ఆతఁడు మరలిరావచ్చు నను నాసతో నెక్కుడు సంభ్రాంతిపాలు గారు. ఆసమయమున నుపాయశూన్యులై, మాటిమాటికిఁ జేతులవ్రేళ్లుమడఁచికొనెడి యా సుకుమారమూర్తులు తచ్ఛోకాంకురావస్థయం దేరీతి నుండిరో వ్రాసిచూపుట కవిదోషము గాదు.

మహాకవుల హృదయములు విశాలములు. వారికి మనోనిశ్చలత మెండు. వర్ణ్యములైన విషయములను వారు నానారూపములఁ జిత్రింతురు. వర్ణ్యవిషయ వైచిత్ర్యము

మెఱయు ననుభావములతో నొప్పుచోఁ బాఠక లహృదయముల కది బాగుగఁ దట్టును. ఆమె యేడ్చుచున్నది; ఆమె కంట తడిపెట్టుచున్నది; ఆమెలోచనాంబువులు చెక్కుటద్దములపై జాలువాఱుచున్నవి—ఇత్యాను లాయాయవస్థల ననుసరించి వ్రాయఁబడుచుండును.

నూతం బడి యేడ్చుచున్న దేవయానిని నన్నయ మహాకవి యిట్లభివర్ణించి యున్నాఁడు :—

" సీ. చనుదెంచి యమ్మహాజనపతి జలమపే
క్షించి యచ్చో విశ్రమించి చూచి
తత్కూపమున విలసత్కూలఘనవల్లి
యన్నిష్టసఖి నూఁదియున్నదాని
గురుకుచయుగముపైఁ బరువడిఁ దొరఁగెడు
కన్నీరు పూరించు చున్నదానిఁ
దన సమీపమునకు జనులయాగమనంబు
పన్నుగాఁ గోరుచు నున్నదాని
వరుణదేవుతోడఁ గరమల్గి జలనివా
సంబు విడిచి భూస్థలంబువలని
కరుగుదేర నున్న వరుణేంద్రుదేవియుఁ
బోనిదాని దేవయానిఁ గనియె. "

(ఆదిప. తృ. 139)

మహాభారత యుద్ధపర్వములయందు మరణించిన వారలయు, వారిం గూర్చి విలపించువారలయు వర్ణనము లనేకములు గలవు. రణరంగమున మృతినొంది పడియున్న యభిమన్యు శవమును దిక్కనసోమయాజి యనేకార్థాలంకారములతో నభివర్ణించియున్నాఁడు. (చూ. ద్రోణప. ద్వితీ.)

మఱియు నభిమన్యుకుమారునికొఱకుఁ దండ్రి యగు నర్జునుఁడు శోకించుటను శబ్దాలంకారములతో నిట్లు వ్రాసియున్నాఁడు మన కవిబ్రహ్మ!

" ఉ. హా యను ధర్మరాజతన
      యా యను నన్నెడఁబాయ నీకు జ
   న్నే యనుఁ దల్లి నేఁపఁ జను
      నే యనుఁ గృష్ణుఁడు పీఁడె వచ్చె రా
   వే యను నొంటిపోక తగ
      వే యను నేగతిఁ బోవువాఁడ నే
   నో యభిమన్యుఁడా యనుఁ బ్రి
      యోక్తుల నుత్తరఁ దేర్పవే యనున్. " *

(ద్రోణ, ద్వి. 242.)

స్త్రీపర్వము ద్వితీయాశ్వాసమునందు రణభూమిం బడియున్న దుర్యోధనాది కౌరవరాజపుత్రశతశవములయు,

---

* ఈపద్యమునుబట్టి యెంతమందికవు లెన్నిరీతుల శోకరసమును వర్ణించిరో యని వ్రాయవచ్చును! (చూ. అనేకాంధ్రప్రబంధములు.)

ఆ శవములం జేరి పలవించు తద్భార్యలయు, వారిదుఃఖముల యు, భీష్మాదికురువీరుల కళేబరములయు నభివర్ణనము వానైన నొనర్పక కవిబ్రహ్మ యగు తిక్కనసోమయాజి గర్భశోకాతుర యగు గాంధారిచేతికిం దూలికను, రంగులను నిచ్చి వర్ణింపం జేసినాండు.

వర్ణనములు నానావిధము లని చూపుటకై యింతగా వ్రాసితిని గాని యాకవిచంద్రులపై దోషముల నెంచుటకుం గాదు. అవి దోషములును గావు.

ఒక్కొక్కప్పుడు శోకించుచున్న పాత్రములుసయితము విపన్నుల నభివర్ణింపవలసివచ్చుచుండును. విక్రమోర్వశీయ నాటకము ప్రథమాంకము నారంభమున,

రాక్షసుం డెత్తికొనిపోయిన యూర్వశికొఱకేడ్చుచున్న రంభాద్యప్సరోవనితలు, పురూరవశ్చక్రవర్తితో “ప్రభువరా! ఊర్వశిని కేశిరక్కసుండు చెఱగొనిపోయినాండు. వేగమ పోయి విడిపింపుమా” యని సత్వరమంగ విన్నవింపక,

“యాతపోవిశేషపరిశఙ్కితస్య మహేన్ద్రస్య సుకుమారం ప్రహరణమ్ ప్రత్యాదేశో రూపగర్వితాయాః శ్రియః, అలఙ్కార స్స్వర్గస్య సా నః ప్రియసఖీ ఊర్వశీ కుబేరభవనా న్నివర్తమానా సమాపత్తిదృష్టేన హిరణ్యపురవాసినా కేశినా దానవాధిపేన చిత్రలేఖాద్వితీయా బన్దిగ్రాహం గృహీతా॥”

అని దాని సౌందర్యమును నిదానముగ వర్ణించినట్లు వ్రాసినాఁడు కవికులగురువు కాళిదాసుఁడు.

శ్రీశర్మగారి యభిప్రాయముననుసరించి 'ఏష్వసన్నివేశ మొకటి' రని భావించినను ఊర్వశీసౌందర్యాభివర్ణన మిచ్చటఁ దప్పినది గాదు. తప్పెనేని యాచక్రవర్తి తానే పోయి యూర్వశిని విడిపించి తెచ్చుటయు, ఆనాటకము పుట్టుటయు లేకపోయియే యుండును. (ఇచ్చటఁ గాళిదాసమహాకవి భావౌదార్యమును గూర్చియు, నౌచిత్యప్రకర్షముం గూర్చియు వర్ణింపఁ జోటు చాలదు.)

శ్రీకృష్ణునిపాటును గన్నులారఁ గాంచి సంభ్రాంతయై పరువెత్తిన యశోదను జిత్రించి చూపినాఁడు శంభుదాసుఁడు. ఆనాఁటిరాత్రియం దలంకృతలై, మందిరమున శయనించి, వేరువను దమప్రాణేశ్వరుంగానక యలజడినొందుసిరపరాధిను లగు ననిరుద్ధకాంతలను జిత్రించి చూపినాఁడు సర్వజ్ఞుఁడు. ప్రకరణము ననుసరించి చేయఁబడినది గావున నీవర్ణనము దోషయుక్తము గాదు.

ఇఁక నెఱ్ఱాప్రెగడ వర్ణనము నొకదానిని జూపెదను. కంసుఁడు మృతిఁబొందినపు డాతని యవరోధవనితలు,

"సీ కరతాడనములు చన్గవలపై లత్తుక
చట్టలు చఱచినచాడ్పుఁ దెలుపఁ

తెగి రాలు హారమౌక్తికములు సశ్రుబిం
దువు లేర్పఱుపరాక్ష దొందడింప
నెండెడువాతెఱ నెసఁగు తాంబూలర
క్తిమ శోకవహ్నిఁ గ్రిక్కుడు తెఱఁగుగఁ
దూలెడు పయ్యెద దుఃఖాంబునిధిలోనఁ
గడలుచందంబునఁ గడలుకొనఁగ
వీడి వెన్నుల వ్రేలెడివేణులోలి
వెలసి కాలాహినిభములై సొలపుజూప
*  *  *  *"

(ఎఱ్ఱా. హరివం. పూ. ౯ ఆ.)

ఏడ్చినట్లు, "ఏడ్చువారితో సానుభూతి లేక నిదానముగ నవ్వుచుఁ దూలికను, వన్నెలను దీసికొని చిత్రించినాఁడు" పరిబంధపరమేశ్వరుఁడు! విమర్శకుఁడు వ్రాయఁదగినవా యీవ్రాఁతలు ?

ఎన్నఁటికైనను మరలఁ గానఁగలమను నాసతోనుండు ననిరుద్ధవనితలవగపునందు, నెట్టయెదుట నగపడుచున్న కంసుని కళేబరముం జూచి యాతనిదయితలు పొందెడు దుఃఖమునందు నుగల రసాభివర్ణనపటుత్వము నారయునది.

శ్రీ దేవాయ నమః

# పూర్వగ్రంథముల యవస్థలు

పూర్వకాలమున ముద్రాయంత్రాది ప్రకటన సౌకర్యము లు లేకున్నను, పూర్వగ్రంథములనుండి వేలకొలఁది ప్రతులను వెలువరించి, లేఖకమహాశయులు ముద్రాయంత్రములకంటెను మహత్తరమైనయుపకారము నొనర్చియున్నారు. అప్పటివారి కాయాగ్రంథములయెడ భక్తియు, శ్రద్ధయు నభిలాషయు సమధికముగనుండుటయకాక, వానికిఁ దగినశరీరదార్ఢ్యమును, ఓపికయు నుండెడివి. పరమార్థబద్ధులగు వారియెడ నెల్లరుఁ గృతజ్ఞులై యుండుట ధర్మము.

అక్కాలమున మనుజునకు వ్యాపారనిమగ్నత మిక్కిలి యుఁ దక్కువ. పారలౌకికబుద్ధి యెక్కువ. కడుపున కింత యన్నము, కట్టుకొనుట కింతవస్త్రము—కరమున నుక్కుగంట ము, కక్షమున నాకుఁబొత్తము—ఇవియ యప్పటి లేఖక ముద్రాయంత్రమునకుఁ గలముఖ్యపరికరములు !

కాలక్రమమునఁ గవులసంఖ్యయు, గ్రంథములసంఖ్య యు, లేఖకులసంఖ్యయుఁ, బ్రతులసంఖ్యయు నభివృద్ధిఁ గాంచెను.

సరియైన యొకయచ్చునుండి తీయఁబడుపుస్తకప్రతులెన్ని వేలైన నొక్కతీరున నుండును. అట్లుగాక యొకగ్రంథము నుండి పదిమందిలేఖకులు పదిప్రతులను వ్రాయుచో నవి యన్నియు నొక్క రీతి నుండవు. పూర్వకాలమున నొక్కొక గ్రంథమునుండియు, దానిప్రతికలనుండియుఁ బ్రతులను వ్రాసికొనులేఖకులు పలువురుండెడివారు. కాలము క్రమించిన కొలఁది ననేకవిధప్రమాదములచే నాయాగ్రంథముల ప్రతుల యందు, అక్షరలోపములు, పదలోపములు, పాఠభేదములు నధికము గాఁజొచ్చెను. మూలగ్రంథములు నశించెను.

భిన్నమతములవారు తమతమమతముల కనుకూలముగ నుండునట్లు కొన్నికొన్నిచోటుల నాయాగ్రంథముల సవరించుచు, క్రొత్తక్రొత్తభాగములను రచియించి వానియందు దూర్చుచు నుండిరి. పాఠకరసికులు దమబుద్ధికి స్వారస్యముగ నుండునట్లు దోఁచినకల్పనములఁ గొన్నిటి నచ్చటచ్చటఁ జేర్చుచువచ్చిరి. కవులుకొందఱు తమప్రయోగములు సాధువు లగునట్లు పూర్వగ్రంథములలోనిపాఠములను దిద్దివైవఁజొచ్చిరి. లక్షణగ్రంథకర్తలు దమ లక్షణములకు సరిపడని పూర్వ ప్రయోగములఁ బెక్కింటిని జక్కఁబఱిచి తమకు లక్ష్యములుగా నొనరించుకొనిరి. ఈరీతి ననేక హేతువులచేఁ బూర్వ గ్రంథములు నానావిధముల మాఱిపోయినవి. పూర్వకవి యెవ్వఁడైన దనపేరితో నున్న యిప్పటిగ్రంథమును గనుఁగొన

గలుగునేని "ఇందలికవిత్వము నాదేనా ?" అని యాతఁడు తెల్లఁబోవునంతటి దుస్థితికి నొకొ్కక పూర్వగ్రంథమును బాల్పడియెను.

పెక్కు వేలేండ్లనుండియుఁ గురుశిష్యపరంపరలచే నిరంతరము పఠింపఁబడుచు అలేఖ్యమై, 'శ్రుతి' యను సార్థకనామము వహించి వచ్చిన "వేదము" మాట ప్రస్తుత మటుండనిచ్చి గీర్వాణభాషయందు వ్రాయఁబడిన యుద్గ్రంథములలో నొకటియగు మహాభారతము మాఱిపోయినవిషయము మాత్ర మొకింత తెలిపి, యనంతర మాంధ్రభాషాగ్రంథములయవస్థలనుగూర్చి ముచ్చటించెదను.

సంస్కృతమహాభారతరచనము జరిగి కొన్ని వేలవత్సరము లయినది. వ్యాసునినాఁటిలిపి యెట్లుండెనో యెఱుఁగరాదు. ఆనాఁటిలిపికిని నేఁటిలిపులకును నడుమ నెన్నియో (వందలకొలఁది) మార్పులు జరిగియుండెను. వేలకొలఁది వత్సరములనుండి అనేకవిధముల మాఱినలిపులతో భిన్నదేశముల వసించు లేఖకపరంపరలచేతులలోఁ బడి లెక్కకుమిక్కిలియగు నవతారములఁ గాంచిన సంస్కృతమహాభారతము కాలక్రమమునఁ బలువిధములైనమార్పులను జెందుచువచ్చి, యొకొ్కక దేశమునందును, మఱి కొకొ్కక లిపియందును నానావిధములగుపాఠములతోఁ దత్తదనురూపములగురూపములను దాల్చెను! (వ్యాసుఁడు తొలుత నిరువదినాలుగువేల

శ్లోకములు గలభారతమును రచించెననియు, నుపాఖ్యానములతో లక్షగ్రంథ మయ్యె ననియు నవతారికయందు వ్రాయఁబడి యున్నది.)

ఒక్కయాంధ్రదేశమునందే బహువిధపాఠములు గల ప్రతులుగలవు. వేయిసంవత్సరములక్రిందటఁ దెలుఁగుదేశమున నున్నసంస్కృతమహాభారతమునకు నేఁటిదానికి ననేకవిషయములయందు ననేకస్థలములలో గ్రంథలోపము, గ్రంథాధిక్యముఁ గలిగియున్నట్లు నిరూపించు గొప్పసాక్ష్య మొకటి మనకు లభించియున్నది. అది యేదన, నన్నయభట్టారకుని యాంధ్రమహాభారతము. నన్నయమహాశయుఁడు భారతముఁ దెలిఁగించుచు, (ఆనాఁడు) మూలగ్రంథమున నేయేపర్వము లెన్నెన్ని శ్లోకములు గలిగియుండెనో, యావివరమును దనపాత్రమున వ్రాసియున్నాఁడు. నన్నయనాఁటి సంస్కృతమహాభారతమునకును, ఇప్పుడు ప్రచారమున నున్నదానికిని గలభేద మిచ్చట వివరింపఁబడుచున్నది :—

| సంస్కృతమహాభారతము. | | నన్నయనాఁటిది. | ఇప్పుడు ప్రచారముననున్నది. |
|---|---|---|---|
| పర్వములు. | ఉపపర్వ. | శ్లోకసంఖ్య. | శ్లోకసంఖ్య. |
| ఆదిపర్వము. | 18 | 9984 | 8884 |
| సభా | 9 | 4311 | 2111 (2511) |
| ఆరణ్య | 16 | 13664 | 11664 |
| విరాట | 4 | 3500 | 2050 |

| | | | | |
|---|---|---|---|---|
| ఉద్యోగ | 11 | 6998 | 6698 | |
| భీష్మ | 5 | 5884 | 5884 | |
| ద్రోణ | 8 | 10919 | 8909 | |
| కర్ణ | 1 | 4900 | 4964 | |
| శల్య | 4 | 3220 | 3220 | |
| సౌప్తిక | 3 | 2874 | 870 | |
| స్త్రీ | 5 | 1775 | 785 | (775) |
| శాంతి | 4 | 14525 | 14732 | |
| అనుశాసన | 2 | 12000 | 8000 | |
| అశ్వమేధ | 2 | 4420 | 3320 | |
| ఆశ్రమవా | 3 | 1106 | 1506 | |
| మౌసల | 1 | 300 | 320 | |
| మహాప్రస్థాన | 1 | 120 | 320 | |
| స్వర్గారోహణ | 1 | 200 | 209 | |
| | 98 | 100700 | 84446 | |
| | | 84446 | | |
| | | 16254 భేదము. | | |

శతపర్వసనాథమగుమహాభారతము శతసహస్రశ్లోకములు గలదిగదా! హరివంశభవిష్యపర్వములు చేరకుండఁగనే

(98 పర్వములయందే) నన్నయకాలమున దానియందు లక్ష గ్రంథమున్నట్లు స్పష్టమగుచున్నది!

తెలుగులిపి, వంగదేశ (బంగాలి) లిపి, కలకత్తా, బొంబాయి, కుంభఘోణనాగరలిపులు—వీనియందు ముద్రింపఁ బడిన భారతపుఁబ్రతులయందుఁ బలుచోట్లఁ బలు భేదములు గోచరించుచున్నవి. కృష్ణద్వైపాయనుని మహాభారతమును జైరీతి నెవరికివలసినట్లు వారు వైశంపాయనునికాలముచుండియుఁ, బెంచియుఁ, దగ్గించియు నానావిధ పాఠభేదములు గల దానినిగా నొనర్చిరి.

ఇట్లే గీర్వాణభాషయందున్న శ్రీమద్రామాయణము, భాగవతము మొదలగు నితిహాసపురాణాదులే కాక, కాళిదాసాదిమహాకవులకావ్యములును వివిధపాఠములు గల వయ్యెను. వానిలోని యొండు రెండు పాఠములను గూర్చి యిచ్చట ముచ్చటించెదను.

"సహసా విదధీత నక్రియా" మిత్యాదిశ్లోకములు నాలుగైదు భారవి కిరాతార్జునీయములోను, స్కాందపురాణములోని మాహేశ్వరఖండాంతర్గతమగు కేదారఖండములోను గానవచ్చుచున్నవి. మఱియు "సర్వక్షితిభృతాంనాథ!" అను శ్లోకము విక్రమోర్వశీయనాటకమునందును, వాల్మీకిరామాయణమునందును గానంబడుచున్నది. వీనిని లేఖకులే చేర్చిరో, కవులే సంగ్రహించికొనిరో విచారింపవలసియున్నది.

* * * * * * * *

ఆంధ్రభాషాగ్రంథములును బైయవస్థలకు లోనయ్యెను. ఛందోవ్యాకరణాదివిషయములందు మతభేదము లుత్పత్తిల్లెను. తుదకు ననేకవివాదములకు నాకరములైన ప్రయోగసహస్రములతో నవి యెల్ల నిండిపోయెను. గురువులు, శిష్యులు, కవులు, లక్షణగ్రంథకర్తలు, పౌరాణికులు, లేఖకులు మొదలగువారు సందిగ్ధపాఠములఁ గాంచి సంకటపడఁజొచ్చిరి.

ప్రపంచమున నాగరకత యభివృద్ధిఁ గాంచెను. అన్ని దేశములయందును అచ్చుసాలలు నెలకొల్పఁబడియెను. పండితులు బహుదేశములనుండి పలుప్రతులఁ దెప్పించి తమకు యుక్తముగఁ గన్పట్టుపాఠముల నిర్ణయించి భారతభాగవత రామాయణాదిగ్రంథముల ముద్రింపించిరి. తెల్లకాగితములు, నల్లనియక్షరములు గల యచ్చుపొత్తములు జనులనేత్రముల నాకర్షించుచుండెను. పెద్దలు తాటియాకుల పుస్తకములపైఁగల తమయభిమానమును విడువఁజాలరైరి. ఎట్లయిననేమి ? కాలప్రవాహము గణనాతీతములగు నచ్చుపొత్తములతో దేశమున వెల్లివిరిసి తాళపత్త్రగ్రంథముల నడుగంటఁ జేసెను. గంటములఁ దుప్పుపట్టెను.

అచ్చుపుస్తకము లమితముగ నమ్ముడువోవుట నరసి, యనేకు లచ్చుశాలల నమరించి, అనేక పూర్వగ్రంథముల నసంఖ్యాకములగుప్రతులుగా నచ్చొత్తించి, యత్యల్పములైన ధరల కమ్మఁజొచ్చిరి. వెలలు తగ్గినకొలఁది గ్రంథములు

పరిష్కారవిహీనములై, తప్పులతడకలై యెల్లవారికిఁ గ్లేశమును గలిగించుచుండెను. కవులు,విమర్శకులు నిర్దుష్టపాఠనిర్ణయమునకై తాళపత్రగ్రంథములబూఁజును దులుపవలసినవారైరి.

అట్టిసమయమున దేశభాషాపత్త్రికలు గొన్నిబయలు వెడలెను. ఛందోవ్యాకరణాదివిషయములనుగూర్చి వాదోపవాదములు పత్త్రికాముఖముల నెలువడెను.అచ్చుపొత్తములను బట్టి కొందఱు, చిన్నయసూర్యాది వ్యాకరణములఁ జూచి కొందఱు—అఖండయత్యాదులు, త్వార్థకేకారసంధ్యాదులు-కూడుననియుఁ, గూడవనియు వాదింపఁదొడంగిరి. ఈరీతిని దేశమంతయు భాషావిషయములుగల వివాదములచే మిక్కిలియుఁ గలఁతనొందుచుండెను.

చెన్నపురియందు ‘ వేమూరు వేంకటకృష్ణమ్మసెట్టి అండ్ సన్సు ’ అనువారు పైమహాక్షోభమును దీర్ప నెంచి, సార్థకనామయగు ‘ఆనందముద్రాశాలను’ స్థాపించి, యాంధ్ర భారతాది గ్రంథరాజములను యథాశక్తిని బండితులచేఁ బరిష్కరింపించి, నేత్రానందకరంబుగ నచ్చొత్తించి, భాషా మహాదేవికి వినూత్నసౌధరాజముల నిర్మించిరి. ‘ గుజ్జరీ ’ పుస్తకములతో నిండిపోయియున్నయయ్యెదనునబయలు వెడలిన ‘ ఆనందముద్రాశాలయ ’ గ్రంథములు—కారుమబ్బులచే గాఢమైయున్న యంధకారసమయమునఁ ద్రోవగానక తల్లడిల్లు బాటసారులకు, నామబ్బుల నెడనెడఁ దోఁచికొనుచుఁ దోఁచు

ధవళకిరణుని పండువెన్నెలలుంబోలె—పాఠకులకు మహాత్త్వానందమును గూర్చెను. 'శ్రీ వావిళ్ల రామస్వామి శాస్త్రులు అండ్ సన్సు' అనువారును అనేకగ్రంథములను జక్కఁగఁ బ్రచురించి లోకోపకారము నొనర్చుచుఁ దమపూర్వులఘనత నభివృద్ధి నొందించుచున్నారు. ఇట్లే పలువురు మహనీయులు పలువిధములగు గ్రంథములను సొగసుగ ముద్రింపించుచు లోకకృతజ్ఞతకుఁ బాత్రు లగుచున్నారు.

"ప్రమాదో ధీమతాపి" అను నార్యోక్తి గలదుగదా! ఎవ రెంతగా శ్రమపడి, కంట వత్తి నిడికొనిన నెన్నివిధములఁ బరిష్కరించినను, ఆయా గ్రంథములయందు దప్పులు దొరలక మానినవి గావు.

పూర్వపూర్వతరముద్రణములు గల గ్రంథములమాట యటుండనిచ్చి, ఒక్క యానందముద్రాక్షరశాలవారిచే వెలువడిన పలుకూర్పుల భారతపుఁబ్రతులను బరీక్షించుచో వానియందు దప్పుపాఠములు బహుభేదములతోఁ జూపట్టెను. (చూ. 'ఆనంద' వారి మొదటి, రెండవ, మూఁడవకూర్పుల భారతపుఁబ్రతులు.)

మఱియు, సుజనరంజనీముద్రాశాల (కాకినాడ), ఆదిసరస్వతీ (వావిళ్ళవారిది), శారదామకుట (విశాఖపట్టణము) ముద్రాశాలలు, రామనారాయణపుస్తకశాల (చెన్నపురి) వారు ప్రకటించిన భారతపుఁబ్రతుల నోపికమైఁ బరిశీలించు

వారికి వానియం దెన్నియో భిన్నపాఠములు గానవచ్చును. నన్నయ తిక్కన లన్నివిధములగు పాఠములను వ్రాసియుండిరా తమ భారతమునందు ? ఇవన్నియు లేఖకులు, పండితులు, కవులు, లక్షణగ్రంథకర్తలు తెచ్చిపెట్టినవే !

ఆంధ్రభాషకు నాంధ్రమహాభారతము పరమ పవిత్రా[illegible] వారికి [illegible]చినన్నిపాట్లు మఱే [illegible]దని చెప్పవచ్చును. అ[illegible] ([illegible]) సంస్కారముల పాలు[illegible] తిక్కన [illegible] వపుడేని వారికి నూతన[illegible] విషయముల నేర్పఁగల యొకయొజ్జగా దానిని మనవారు పరిణమింపఁ జేసినారనుటకు సందేహము లేదు. అప్పకవినాఁటికే యాంధ్రమహాభారతమున కీయవస్థ కొంతపట్టినదని యీ క్రిందిపద్యమువలన నెఱుఁగ వచ్చును.

ఉ. “ నన్నయముఖ్యసత్కవిజ
నంబులకావ్యములందు లేఖకుల్
గొన్నియుఁ బాఠకాధములు
గొన్నియుఁ బోకడఁ బెట్టఁ దక్కువై
యున్నెడఁ గాంచి జానపదు
లోడక దిద్దినతప్పుతోఁగవ లె

ర్లి న్నిజమంచుఁ గైకొనిన
లక్షణవేత్తలు సమ్మతింతురే ?॥

అప్పక. తృ.

ఆంధ్రమహాభారతపాఠభేదము లసంఖ్యాకములు. వానిఁ బ్రదర్శించుటకు నిందు చోటు చాలదు. పరమప్రమాణగ్రంథ మగునట్టి దాని పురాతన తాళపత్త్రగ్రంథపాఠములను లక్షణ గ్రంథములయం దుదాహరింపఁబడిన దానిభిన్నపాఠములను, వివిధముద్రాశాలలయందు ముద్రింపఁబడిన దానిప్రతులలోని పాఠభేదములను దత్తత్కవికాలభాషాసంప్రదాయములతో సంపూర్ణముగఁ జర్చించి యొకప్రత్యేక విమర్శగ్రంథముగఁ బ్రకటింపఁబడవలసియున్నది.

భాస్కరరామాయణాదిమహాకావ్యములును ప్రబంధములును నానావిధమరవస్థల పాలైయున్నవి. అందును భాస్కర రామాయణములోని యరణ్యకాండము మిక్కిలియుఁ బురాతన మైన గ్రంథమగుటచే, భారతమునుబోలె నదియును గడుంగడు శోచనీయ మగునవస్థకు లోనయినది. (ఈకాండములోని వందలకొలఁదిపద్యము లన్యకవివిరచితములే !) పైపుస్తకముల లోని పాఠములుసయితము ప్రత్యేకగ్రంథమున విమర్శింపఁబడ వలసియున్నవి.

ప్రస్తుతము కొన్నిగ్రంథములలోని—అనర్థకములు, అనన్వయములు, అపరిష్కృతములు, అస్థానపతితములు,

అనేకగ్రంథస్థములు అంతర్హితములు, అసమీక్షితములు, అపరిశీలితములు, అసందర్భయుక్తములు—నగుపాఠములలో గొన్నిటినిమాత్రము చూపెదను.

(1) అనర్థకము :—

"చ. ఉరుతరకుంకుమారుణప
యోధరయై కరసక్తభాసురాం
బర యగుపాశహస్తదెస
భానుఁడు సేర "దృఢానురాగసుం
దర యగుతూర్పు దాల్చె" నుచి
తస్థితి లేనిదపోలె నన్యునిన్
మరగినకాంత కాంతులకు
మానుగఁ బశ్చిమగణ్యయే కదా."

—భాస్కరరామా. యుద్ధ. సాయం. వర్ణ. 2631 ప.

ఇది యర్థాన్వయములు లేనిపద్దెము. శ్రీకల్పలతాధిపతులు లోకప్పుడు దీని నర్థమునకై ప్రకటించిరి. దీని నిర్దుష్టపాఠముఁ గనుఁగొనవలయునని యే ననేకముద్రితగ్రంథములను, వ్రాఁత పుస్తకములను బరిశోధించితిని. అన్నిటఁ బైపాఠమే యున్నది. ఒకనాఁడు పీఠికాపురవాస్తవ్యులగు బ్ర. ములుకుట్ల బ్రహ్మయ్యశాస్త్రిగారియింట నొకపురాతన తాళపత్రగ్రంథ మున్నదని విని యప్పాత్రముఁ దెప్పించి చూచితిని. అందు యుక్తమైన

పాఠము గానవచ్చి మెనలేని యానందముఁ గూర్చినది. ఆపాఠ మిది :—

" చ. ఉపతర......... దృఢానురాగసుందర మగుచూపుఁ
దాల్చి......"

(లేఖకప్రమాదమున నెట్టిపాఠ మెట్టిగతికి వచ్చినదో కనుఁడు!)

(2) అనన్వయము :—

సీ. బలిమికోలున నవ్వు దళుకొత్తినను మొగం
బెల్లఁ దానైయున్న వెల్లఁదనము
ధీరతఁ దెచ్చికోల్ పొందినఁ బలుకుల
యందు గద్గదిక వాయంగలేదు
* * * * —ఎఱ్ఱనహరివం. ఉ. భా. 7 ఆ.

ఇందు తొలిపాదమున కన్వయములేదు. బలిమికోలు— ఈశబ్దము దుష్టము. (విశేష్యమునకు 'కోలు' ప్రత్యయ మనుప్రయుక్త మగుట యెట్లు?) రెండవపాదమున యతి లేదు. ఇది యనన్వయము, అపరిష్కృతమునని చెప్పవచ్చును. దీని నిర్దుష్టపాఠము శ్రీపీఠికాపురసంస్థానస్థతాళపత్త్రగ్రంథమున నిట్లున్నది.

" సీ. బలిమికొల్పిన నవ్వు దళుకొత్తినను మొగం
బెల్లఁదానైనది వెల్లఁదనము

ధీరతఁ దెచ్చి పొందించినఁ బలుకుల
యందు గద్గదిక వాయంగలేమ..."

(3) అపరిష్కృతములు :—

(a) "క. విషయేంద్రియ ప్రపంచము
హృషీక మనఁబరగు నీ వతీతుఁడవై యు
న్మిషితముగ నది ధరించుట
హృషీకేశనామశోభివైతివి కృష్ణా!"

—ఎఱ్ఱనహరి. ఉ. భా. 6 ఆ.

దీని నాలవపాదమున గణమును, యతియును దప్పినవి. పైసంస్థానపుప్రాఁతప్రతియం దిట్లున్నది:—"సుమహృషీకేశనామశోభివి కృష్ణా!"

(b) "చ. రవివరబింబ మూర్ధ్వగతి
రశ్మికమై పరిలంబమానమై
వరుణహరిద్వధూటి దగ
వారిధితోయము సేఁదువేడుకం
గరపరిముక్తమైన కన
కంపుఘటం బనఁ జక్రివాకికా
విరహకృశానుకూట మన
వీక్షణదృశ్యత నొందె నత్తఱిన్.

—భాస్కరరా. యుద్ధ. సాయం. వర్ణ. 2632 ప.

ఇందు మొదటిపాదమున ప్రాసము దప్పినది. నిర్బాధక

మైనపాఠము దొరకలేదు. (ఒకచోటమాత్రము "పరరవిబింబ మూర్ధ్వగతవర్తితరశ్మికమై విలంబమై" అని యున్నది.)

(c) క. విని యాచారుల బోవం
బనిచి విచారించి విగతపరిచారుండై
చనుదెంచెఁ జంద్రహాసముఁ
గొని యల్లన కాలనేమి గృహమున కంతన్."
—భాస్కరరా. యుద్ధ. 1608 ప.

ఇందు నాలవపాదమున యతి దప్పినది. నేను జూచిన ప్రతు లన్నిట నిట్లే యున్నది. పరిశుద్ధపాఠమునకై యింకను యత్నింపవలసియున్నది.

(4) అపానపతితములు :—

(a) "ఉ. ఇమ్మను జేశ్వరాధముల
కిచ్చి పురమ్ములు వాహనమ్ములున్
సొమ్ములు గొన్ని పుచ్చికొని
చొక్కి శరీరము వాసి కాలుచే
సమ్మెటవ్రేటులం బడక
సమ్మతి శ్రీహరి కిచ్చి చెప్పె నీ
బమ్మెర పోతరా జొకఁడు
భాగవతమ్ము జగద్ధితమ్ముగన్."

ఈపద్య మాంధ్రభాగవతమునవతారికయందు (13) పద్యముగాఁ గానంబడుచుఁ బూర్వోత్తరసందర్భములఁ జెఱుచు

చున్నది. చాటుధారగాఁ బఠింపఁబడుచుండెడి యిప్పద్యము నే లేఖకుఁడో యెప్పుడో యిచ్చటఁ జేర్చినాఁడు! ప్రతు లన్నిట నిట్లే యున్నది!

(b) చ. కుదురుమొలుంగు నిబ్బరపు
గుబ్బలపై నయనాంబుపూరముల్
సెదరఁగ నేల యేడ్చెదవు
చెల్వ దురంతవిషాద వేదనా
విదళితమానసాబ్జ వయి
వేమఱు నాయువు శాశ్వతంబె సం
పదలు స్థిరంబులే విధివి
పాకము దాఁటఁ దరంబె యేరికిన్."

ఇది శంకరకవి హరిశ్చంద్రోపాఖ్యానము, పంచమాశ్వాసమున 87 వ పద్యముగా ముద్రింపఁబడి యస్థానపతితమై యున్నది. ఇది రామరాజభూషణుని హరిశ్చంద్రనలోపాఖ్యానమున, 54 వ పద్యము. శంకరకవి గ్రంథమున నచ్చోట రెండు మూఁడు పద్యము లన్వయరాహిత్యము నొనర్చుచున్నవి. సరియైన ప్రతి లభింపలేదు.

(5) అనేక గ్రంథస్థములు :—

(a) "సీ. నిండారఁ జెగఁగొని నిగిడించుతూపుల
వైరిమర్మంబులు వ్రిచ్చి వ్రచ్చి

బిగితంపుముష్టి కంపితమైన యసిధార
విమతకంఠాస్థులు విఱిచి విఱిచి
యనుపొంద నల్లార్చి యాఁదంద పెనుగద
శత్రుదేహంబులు సదిపి చదిపి
చదల మూర్ఛగఁబర్వ శక్తిశూలాదులఁ
బగఱపీనుఁగు లుర్విఁ బఱపి పఱపి

గీ. యేదినంబును వృథవోవ నిదికడిమి
యొదవఁ బోరాడు నాటనె న్నిందు నేని
కూఁడు సవియగుఁగాక నిష్కార్యభ్రమైన
దర్పమూరక యూరింపఁదరమె? దేవ!

—ఉ. హ. పం. 20 ప.

(b) ''కం. చేతులకసిఁబోఁ గయ్యము
సేఁ తవిలెను నట్టివిధము సింతించి ననుం
బ్రీతుంగాఁ గరుణించుట
యాతఱి నెనవోల్పరాని యాఁగి మహేశా!''22 ప.

ఈపద్యములు సోమునియుత్తరహరివంశము పంచమా
శ్వాసమునందును, ఎఱ్ఱాప్రెగ్గడ హరివంశోత్తరభాగసప్త
మాశ్వాసమునందును గానవచ్చుచున్నవి. శైలినిబట్టి యివి
సోమునివే యగును. ఈపద్యములు నాచన సోముని
యుత్తరహరివంశపుఁబ్రతులయందు, (1)తంజావూరిప్రాఁతప్రతిం

(2) వావిళ్లవారి ముద్రితప్రతి, (3) శ్రీపీఠికాపురసంస్థానము లోని వ్రాఁతప్రతి—అను నీమూఁడుప్రతులయందును నున్నవి; శ్రీ వీరేశలింగముపంతులవారు ముద్రింపించిన రెండుకూర్పుల యుత్తరహరివంశపుఁబ్రతులయందు నివి లేవు. కారణ మేమన, శ్రీవీరేశలింగముగారు, తమయొద్దనున్న వ్రాఁతవ్రాఁతప్రతి యందు పైపద్యములు లేనిహేతువున నవి ప్రక్షిప్తము లని భావించికాఁబోలు వానిని ద్రోచివైచిరి. ఈహేతువుచేతనే సోముని హరివంశములోని మఱికొన్ని పద్యములను సయితము వారు త్రోచివైచినారు. చూడుఁడు!

చ. కలఁగనివారు నిన్ను మదిఁ
గాఁగిట నెత్తెడువారు ముక్తికిం
దొలఁగనివారుగాఁ దెలియు
దుం దలపోయుదు లోన నాసలుఁ
జలఁగవు హృత్సరోజసద
నంబున నిన్నుఁ దెత్తు నంతకుఁ
మలఁగఁగదే త్రికోణమణి
మంటపదీపికపై మహేశ్వరా!

—ఉ. హ. పం. 10 ప.

చ. ఇనసమతేజ పంటివె య
తీవభుజక్రమపక్రమక్రియా

ఘనులగు పోటుబంటులకు
గాఢతర ప్రతిపక్షపక్షభం
జనహృదయైకరంజన వి
శాల మహామహిమాలయైన య
య్యనిమొనఁగాక కల్గునె స
ముంచితకీర్తియు ధైర్యమూర్తియుఁ.
—ఉ. హా. పం. 26 ప.

ఈపద్యములు రెండును పైమూఁడుప్రతులలోనే కాక ప్రబంధమణిభూషణమును(మా. రామకృష్ణకవిగారు ప్రకటించిన) సంకలితగ్రంథమునందును వెలయుచు సోముని వని చాటుచున్నవి! (రచ్చ్రమాకులనెల్లను......" అనుపద్యముగూడ వారు ముద్రింపమానివైచిన వానిలోనిదే!)

(బి) " ఉ. ఎంచి నుతింపశక్యమె... ... ..."

ఈపద్యము శ్రీనాథుని హరవిలాసమునందు, పినవీరన్న శాకుంతలములోను గానవచ్చుచున్నది. ఇద్దానికర్త యొకఁడై యుండును గాని యిరువురు నైయుండరు. లేఖకుఁ డెవ్వఁడో యొకని గ్రంథమునుండి దీనిని రెండవవాని గ్రంథమునఁ జేర్చియుండును.

(6) అంతర్హితములు:—

(a) " శా. నాతో మార్కొన లేరు నిర్జరమరు
న్నాగేంద్ర బృందారకా

రాతు ల్మున్నగ దేవసంఘములు పో
రన్ ధీరసంగ్రామమునం
డీత్రైలోక్యమునందు గల్గనము రణం
బెవ్వాని లేకుండఁగాఁ
జేతుల్ వేయు వృథాభరం బగుచువ
చ్చెం దేవ! యీమేనికిన్."

—ఉత్తరహరివం. పంచ.

(ఇది పై "నిండారఁ దెగగొని..." అను పద్యము పై నుండఁదగినది.)

ఈపద్యము నప్పకవి రేఫఱకారప్రాసమునకై "సోముని హరివంశము" లోనిదని యుదాహరించియున్నాఁడు. ఇది బాణాసురుఁ డీశ్వరుని యుద్ధభిక్షమును వేఁడు ఘట్టములోనిది. ఇది యప్పకవీయాది లక్షణగ్రంథములయందుమాత్రము గానవచ్చుచున్నది. ఉత్తరహరివంశపు వ్రాఁతప్రతులలోఁగాని అచ్చుప్రతులలోఁగాని కానరాదు. ఇట్టి వింకను నెన్నిపోయిన వో యాతనిగ్రంథములోనివి !

(b) "క. ఓరోరి రాచవాఁడా
రారా నావెంటఁ దిరుగు రా గోసఁగివై
బారాదిమాడ లిచ్చెదఁ
గోరా నీయప్పు దీర్చు కోరా పెలుచన్."

ఈపద్యము శంకరకవి హరిశ్చంద్రోపాఖ్యానములోనిదని శ్రీ బ్రౌన్ దొరవారు "బారాది" శబ్దమునకును, శ్రీ సీతారామాచార్యులవారు "గోసంగి" శబ్దమునకును నుదాహరణములుగ దమతమనిఘంటువులయందు వ్రాసి యున్నారు. ఇది యిప్పటిప్రతులయందు గానరాక మాయ మైనది!

(7) అసమీక్షితములు:—

లక్షగ్రంథకర్తలు దమలక్షణములకు లక్ష్యములుగా నిచ్చియున్న యితరగ్రంథములలోని పద్యములను గొన్నిటి నాయాగ్రంథములయందు దాము చూచియున్నట్లే వ్రాసి యున్నారు. ప్రస్తుత మొకలక్షణగ్రంథమునుగూర్చిమాత్రము వ్రాసెద. అప్పకవి యాయాగ్రంథములలోనివని యుదాహరించిన యీక్రిందిపద్యముల నాతఁడవ్వానియందు చూచియుండలేదని తెలియఁగలము:—

(౧) "క. వనకన్యకయఁట! నేనఁట!
వనమున గాంధర్వమున వివాహంబఁట! సూ
నునిఁ గనెనఁట! మఱచితినఁట!
వినఁగూడునె యిట్టిభంగి విపరీతోక్తుల్?"

ఈపద్యము వాగనుశాసనుని యాదిపర్వములోనిదని యప్పకవి దాను చూచినట్లే స్పష్టముగా వ్రాసినాఁడు! (చూ.

అప్పక. ప్రథ. 232) ఇది పినవీరన్న శకుంతలాపరిణయము లోనిది. కథాసందర్భమునుబట్టి తనకుఁ గంఠస్థమైయున్న యీ పద్యము భారతములోని దని భావించినాఁ డని తోఁచెడిని.

(b) మ. "ఒకనాఁ డిందుధరుండుఁ బార్వతియు లీ
లోద్యాన కేళీసరి
న్నికటానేకవనప్రదేశముల దై
తేయేంద్రకన్యాప్సరో
నికురుంబంబులు పారిజాతకుసుమా
నీకంబుపైఁ జల్ల ద
ర్పకబాణంబుల కెల్ల నెల్లయగు సౌ
భాగ్యంబు శోభిల్లఁగన్."

ఈపద్యము నప్పకవి యాదిపురాణములోని దని వ్రాసినాఁడు. ఇది నాచనసోమనాథుని యుత్తరహరివంశమున నున్నది. సోముని హరివంశమునకు 'ఆదిపురాణ' మను నామమున్నట్లు గానరాలేదు.

(c) " శా. ఆవాలుంగనుదోయి యానగుమొగం
బాగుబ్బ పాలిండ్ల పెం
పావేణీభర మాతనూవిలసనం
బాయొప్పులే చెప్పినం
గైవారంబగుఁగాదె కేవలశిరః
కంపంబు గల్పించి యా

హా ! వృష్టింపదె యిక్షుధన్వునకు న
య్యబ్జాక్షి నీక్షించినన్."

ఇది కళాపూర్ణోదయములోనిదని యప్పకవి సంధిగత
ప్రాసమునకై యుదాహరణముగ నిచ్చియున్నాడు. ముద్దరాజు
రామనామాత్యుడు, రాఘవపాండవీయవ్యాఖ్యానమున నిది
పినవీరనగారి ప్రయోగముగా గథారంభపద్యవ్యాఖ్యయం
దుదాహరించి యున్నాడు. పరిశోధింపగా నిది పినవీరన్న
శృంగారశాకుంతలమున గానవచ్చును.

(8) అపరిశీలితములు:—

(౧) " క. శ్రీమాద్యదంధ్రదేశ
క్షేమదకరవాల ! సుజనకీర్తితగుణాలో
లా ! మంజులవాగ్జాలా !
వేమక్షితిపాల ! నిత్యవిజయవిశాలా ! "

ఇది యెఱ్ఱనహరివంశము నుత్తరభాగము ద్వితీయా
శ్వాసము మొదటను చతుర్థాశ్వాసము మొదటనుగూడ
ముద్రింపబడియున్నది. కవి యొకచో వ్రాసిన యాశ్వాసాది
మాంతిమపద్యముల నింకొకచో వ్రాసియుండడు. దీనిపాఠము
శ్రీపీఠికాపురసంస్థానపుదాళపత్త్రపుస్తకము చతుర్థాశ్వాసము
మొదట నిట్లున్నది.

క. " శ్రీపార్వతీశభక్తో
ద్దీపితగుణ ఘోరరాయ దీర్ఘోరుకృపా

స్థాపిత సామ్రాజ్య సము
ద్దీపిత వేమక్షితీంద్ర దీప్తి దినేంద్రా."

(ప్రతియం దున్నట్లు వ్రాయఁబడినది.)

(బి) శ్రీ వీరేశలింగముపంతులవారు ముద్రింపించిన యుత్తరహరివంశము రెండుకూర్పులయందును ప్రథమాశ్వాసము కడపట,

(1) "పారావార...(2) చక్రకరశ్వథ...(3)జలధిగిరినివాసా..." అను నాశ్వాసాంతిమపద్యములును, వీనిపై నొక పెద్దవచనమును ముద్రింపఁబడియున్నవి. పైపద్యములు సోముని యుత్తరహరివంశమునందే చతుర్థపంచమాశ్వాసాంతముల నున్నవి. (వచన మెవ్వరు వ్రాసినదో!) సోముఁడాపద్యముల ను రెండుచోట్ల వ్రాసియుండఁడు. శ్రీ పంతులవారు వాని నేకారణమున నచ్చుట ముద్రింపించిరో! వ్రాఁతప్రతుల నన్నిట "ఇచ్చుట గ్రంథముపాతము" అని (ప్రథమాశ్వాసము కడపటనున్న "కన్నమోహంబు" అను పద్యముకడ) వ్రాయఁబడియున్నది. (పంతులవారియొద్దనున్న ప్రాఁతవ్రాఁత ప్రతిలో నీయాశ్వాసమే లేదుగదా!)

ఇది యిట్లుండ, "శ్రీ వావిళ్ళ రామస్వామిశాస్త్రులు అండ్ సన్సు" వారును పైపద్యములను, వానిపైనున్న పెద్ద వచనమును శ్రీ పంతులవారిప్రతిలో నున్నట్లే యొక్క యక్కర మైన భేదము గలిగియుండకుండఁ దత్ప్రథమాశ్వాసముకడపట

ముద్రింపించినారు ! ఏప్రతియందును లేని యీపద్యవచనములు వీరి కెట్లు వచ్చెనో ! పైవిషయమును వీరు తెలిసికొనియుండిరేని మూలమున నున్నట్లే "గ్రంథపాతము" అని ముద్రింపించియుందురుగదా!

(9) అసందర్భయుక్తములు:—

మనలక్షణగ్రంథములయం దున్నన్ని పాఠవైచిత్ర్యము లితరభాషాగ్రంథములు వేనియందును నుండవని చెప్పవచ్చును. కవిజనాశ్రయము, కావ్యాలంకారచూడామణి, ఛందోదర్పణము, కవిచింతామణి, సులక్షణసారము, లక్షణసారసంగ్రహము, అప్పకవీయము, సర్వలక్షణసారసంగ్రహము, రంగరాట్ఛందము మొదలగు గ్రంథములలోని యనేకలక్షణపద్యములును, ఉదాహరణపద్యములును నేయే గ్రంథములలోనివో, ఎవ్వరెవ్వరివో నిర్ణయింపరాక దుర్భేదములై తలయేఱు వోడమించుచున్నవి. గ్రంథవిస్తరభీతిఁ దద్వివరణమును విల్చి యొకముఖ్యవిషయముమాత్ర మిచ్చట నుదాహరించెదను.

"సులక్షణసారము" లింగముగుంట తిమ్మన వ్రాసినది గదా! అది తాతంభట్టుదని శ్రీవావిళ్ళ రామస్వామిశాస్త్రులు అండ్ సన్సువారు ముద్రింపించినారు. ఇంకను మఱికొందఱు తాతంభట్టుదనియే వ్రాసియున్నారు. తాతంభట్టు వ్రాసినది కవిచింతామణిగాని సులక్షణసారము గాదు! కర్తపేరే యెట్లు మాఱిపోయినదో !

మఱియు అప్పకవి, సులక్షణసారమును, తత్కర్త యగు లింగమగుంట తిమ్మనను దన గ్రంథమునఁ జేర్కొనియున్నాఁడు. (చూ. అప్పకవీయము, ప్రథమ, తృతీయాశ్వాసములు) దీనింబట్టి తిమ్మనకు నప్పకవి పిమ్మటివాఁడని తేలుచున్నదిగదా! ఇట్టి యప్పకవి వ్రాసిన లక్షణపద్యములు తిమ్మకవిసులక్షణసారములోఁ గానవచ్చుచున్నవి! ఇది యేఁటిసందర్భము? ఆంధ్రగ్రంథములదుర్గతి యింతకంటెను మిన్నుముట్టఁగలదా?

ఈయసందర్భములెల్ల నానాదేశలేఖకులు నానావిధములఁ దమకుఁ దోఁచినట్లెల్ల తాళపత్త్రగ్రంథములయందు దప్పు పాఠములుగా వ్రాయుచువచ్చుటచే సంభవించినవి.

కావున భాషోద్ధారకులగు మహారాజులును, భాషాభిమానులగు శ్రీమంతులును దమయౌదార్యము మెఱయ భాషాతత్త్వవిదులగు కవులను, పండితులను, విమర్శకులను బోషించి, ప్రోత్సహించి బహుదోషసంయుక్తములై దిక్కుగానకయున్న యాంధ్రభాషాగ్రంథరాజములను జక్కఁగఁ బరిశీలింపఁజేసి తత్కవిచంద్రుల సంపూర్ణకళలు వెలయునట్లు ప్రకటింపించి భాషాజ్ఞానలాలసులగు విద్యార్థులఁ గృతార్థులఁ జేయుదురుగాక యనియు, గ్రంథప్రకాశకులిఁక నైనఁ దగుపరిశోధనములఁ జేయింతురుగాక యనియు విన్నవించుచున్నాను.

# కాసటబీసట

'కాసటబీసట' యనుశబ్దము వాడుకయందు 'కకారాది'గ వినఁబడుచున్నది. శబ్దరత్నాకరగ్రంథకర్త సీతారామాచార్యుల వారు దీనిని 'గాసటబీసట' యని 'గకారాది' పదముగా గ్రహించియున్నారు. దీని యాద్యక్షరము పరుషమో సరళమో నిర్ణయించుటకుఁ దగినయాధారము గానరాలేదు. మన యాంధ్రభాషయందు ఇట్టి సందిగ్ధపదము లనేకములు గలవు. అట్టివానిలో "కకారాదులా? గకారాదులా;" అనుసందేహము ను గొల్పునవియుఁ గొన్నిగలవు:—

(౧) గ్రక్కదలు=కదలు+కదలు. (క్రక్కదలు ? or గ్రక్కదలు ?). ఇట్టే గొనకొని, గొప్పలు, గొండెములు మొ॥ (ఇవియొక గణములోనివి.)

(౨) గండరించు—కండరించు ?, గాదిలి—కాదిలి ? ఇత్యాదులు వేఱొక జాతిలోనివి.

(3) గనుపు—కనుపు; గడప—కడప; గుంట—కుంట మొ॥ మఱియొక తెగలోనివి. ఇట్టి భేదము లింకను గలవు.

"కకార మాద్యక్షరముగాఁగల (తెలుఁగు) పదములు (కొన్ని) కాలక్రమమున గకారాదులుగా వాడుకలోనికి

రావచ్చు" నని చెప్పుటకుఁ దగినహేతువు వనభాషయందు గానవచ్చుచున్నది. ఏదియన, "ప్రథమ, ద్రుతము మొదలగు వానికి బరమైన కకారము గకారమగు" నను నియమము మన యాంధ్రమునఁ గలదు. దానంజేసి వ్రాఁతనుబట్టియు, వినికినిబట్టియు 'కకారాది' పదము 'గకారాది' పదముగా నుచ్చరింపఁబడుచుఁ గ్రమముగా మాఱిపోవుచున్నది. ఉదా:- కడచు—గడచు; కనుక—గనుక; కానుగు(చెట్టు)—గానుగు—ఇత్యాదులు గ్రంథములఁ బరుషాదులయ్యు వ్యవహారమున సరళాదులై యున్నవి. పదాదిగకారము కకారముగా మాఱిపోవునట్టి సూత్రము లేమింజేసి గకారాదిపదము కకారాది పదముగా వ్యవహరింపఁబడనేరదు.

ఈహేతువులనుబట్టియు, వాడుకనుబట్టియుఁ బ్రస్తావమున నున్నశబ్దమును 'కాసటబీసట' యని కకారాదిపదముగానే నేను గ్రహించితిని. ఇఁక దాని యర్థమునుగూర్చి యించుక విమర్శించెదను.

శబ్దరత్నాకరమున 'గాసటబీసట'కు 'సలక్షణముగాని చదువు' అని యర్థము వ్రాయఁబడి, దానికి నెత్తావిగ్గడ ప్రయోగ ముదాహరణముగా నియ్యఁబడినది. ఈయర్థము నాధారముగాఁ జేసికొని బ్ర.శ్రీ. కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రి గారు తమ నన్నయభట్టారక చారిత్రమున,

“ నన్నియభట్టునకుఁ బూర్వ మీ తెలుఁగు(భాస) గాసటబీసటగా నుండెడి దని (యెఱ్ఱన) వెక్కిరించుచు వ్రాసి నాఁడు. “ గాసటబీసట ” యనఁగా సంస్కారశూన్యమైన భాష—అనఁగా కోడు భాషవంటిదని మనవారు నిఘంటువుల యందు వ్రాసికొనియే యున్నారు.............. ” అని సీతారామాచార్యుల వారియర్థమునకుఁ డిప్పణము వ్రాసినారు!

పట్టాభిషేకసంచికయందు బ్ర. శ్రీ. పెండ్యాలసుబ్రహ్మణ్య శాస్త్రిగారు రాజనరేంద్రునితండ్రి విమలాదిత్యునికాలమున క్రీ. శ. ౧౦౧౮ స॥ వ్రాయఁబడిన ( ఏడువాడలపాలెపు ) శాసనములోని విషయముల వివరించు సందర్భమున,

“ అన్నిటికంటె దీనియందు శోధింపఁ దగినది నన్నియభట్టునకుఁ బూర్వమునం దుండిన ‘గాసటబీసట’యగు నాంధ్రిభాష ...... ఈశాసనములోని భాష ‘కాసటబీసట’ గానే కలదని తలఁచుచున్నాను......” అని వ్రాసి పిమ్మటఁ దచ్ఛాసనము నుదాహరించి యున్నారు. ఆశాసనములోని కొంతభాగము నిచ్చట జూపుచున్నాను.

“ స్వస్తి సకాలబుధజనసంస్తూయమాన సూర్య్యాఽవం శోద్భావరామభట్టారకా వరప్రసాదలబ్ధ రాజాభిషేకా సంపతి శాఙధ్వజపీతాంబరపతి గరుడదప్యనధ్వజమాదుపురపరమేశ్వర వేంగీపుర బ్రహ్మఘోషణాశ్రయా శ్రీమాంత్మాశాయాధిపతి యాయ్నవఱా కామారాజు శ్రీమ్మతెఱమారాజు శ్రీమత్

యిన్నడి బెడంగ్గరాజు శ్రీమ్మాత్ శోడపరాజు శ్రీమాత్ కాలియుగ కణ్నరాజూ శ్రీమత్ మాన్వాలగాపడ్డు స్వస్తి సకాబ్దంబుఃర్థంభ నూటానల్వాది యగునేణ్డ......పడవాలు నడపనేయకునకు అగ్రహారంబులతోడి పాడియిచ్చి అగ్రహారంబ కానుగవ చెరువులు దయసేసియిచ్చిన సాసనము పూర్వతః * పోంగోట్టవిసీమ మసీమం, నైరత్యతః కవుఋాత్సీమ మసీమం...పశ్చిమతః పోతిపూడ్డిసీమమశీమం...దీని నెడపక నడపిరేని అఋాడివేల్దె స్వర్గమ్మున నుణ్డంగాన్తురు......నటిసినవారు ఆఋవదివేలేన్డు? నరకయోని నుణ్డుదురు..."

ఈశాసనములోని గీర్వాణభాషసయితము (ఆంధ్రి భాషకంటెను) దోషభూయిష్ఠమై యుండుటచే నది లేఖకుని మహిమమని యెంచనగును గాని నన్నియకుఁబూర్వ మాంధ్ర భాష యిట్లే యుండెడిదని తలంప వలనుపడదు. లేఖన

* ఈశాసనములోని తెలుఁగుబాసగల యీభాగమునకును, నన్నియ భట్టారకుఁడు వ్రాసిన నందంపూఁడి శాసనములోని తెలుఁగుబాసగల భాగమునకును భేదమంతగాఁ గానరాదు. అందుల యొండు రెండువాక్యములు మాత్ర మిచ్చట నిచ్చుచున్నాను. "పూర్వతః ఇయ్యూరియుం బిల్లైమపెద్దపూణ్డియుం బొలగరసున పల్లమున కొణ్డిఁయుగుంటనడుమ సీమా,... నైరృత్యతః ఇయ్యూరియు నెరపులయు ముందరమునయుం బొలగరుసున ముయ్యాలికుఱ్ఱ సీమా, పశ్చిమతః ఇయ్యూరియు ముందరమునయు మడకుటితియుం బొలగరుసున ముయ్యాలికుఱ్ఱ సీమా......"

విషయమున మొన్నమొన్నటికిని ఇప్పటికిని గల భేదమే యపారమనుట మనతాతలనాఁటి తాటియాకులపొత్తములు, నేఁటిమనవృద్ధుల చేవ్రాళ్లు (ఒంమ్మంగ్గి, వెంకటనరసిహ్వాం, కంద్దుల లత్సుంన్నవాి్రలూ), అనేకనమస్కారమ్లుచేశీ చాయం గల విన్నపమ్లు — మొదలగువానిని గనినవారికి విశదము. కావున నన్నయకు మున్ను తెలుఁగుబాస లక్షణవిరుద్ధమై (కాసట బీసటమై?) యుండెడి దని నిరూపించుట కీశాసన మాధారము గాఁజాలదుగాని నన్నయభట్టారకచారిత్రములోని

"నన్నయకుఁబూర్వపు శాసములన్నియు సంస్కృతముననే యున్నవి. కాని తెలుఁగున నొక్కటియు లేదు. దీనిచేఁ దెలుఁగు నన్నయకాలమువఱకు వ్రాయఁబడునవస్థవఱకే రాలే దని తెలియవచ్చుచున్నది."

"తెలుఁగుబాసయందు నన్నయభట్టారకునాఁటికొక్క చిన్నశాసనమైన లేకుండుట చూడ నన్నపార్యుని నాఁడే తెలుఁగు వ్రాయఁబడుస్థితికి వచ్చిదని తెలియవచ్చుచున్నది," (65, 66 పు.)

ఇత్యాదులగు బ్రహ్మయ్యశాస్త్రిగారివాక్యము లాధార రహితము లగునట్లు చేయుటకుమాత్రము (ఈశాసనము) సాధనమగుచున్నది.

ఇఁక 'కాసటబీసట'శబ్దమునకు "సంస్కారశూన్యమైన

(కోదుభాషవంటి) భాష " యను పై వ్యాఖ్యానము సరిపడిన దేమో విచారింతము. ఈశబ్దమునకు మూలమైన

" ఉ. భాసురభారతార్థముల
భంగులనిక్క మెఱుంగ నేరమిం
'గాసటబీసటే' చదివి
గాథలు ద్రవ్వ తెనుంగువారికిన్
వ్యాసముని ప్రణీతపర
మార్థముఁ దెల్లముసేసినట్టి య
భ్యాసనకల్పులం దలఁతు
నాద్యుల నన్నియతిక్క నార్యులన్. "

అనుపద్య మెఱ్ఱాప్రెగ్గడనృసింహపురాణములోనిది. దీనికిఁ బైటిప్పణమునుబట్టి, " భా ర తా ర్థ ము ల స త్య ము నెఱుంగ నేరక పోవుటచేత 'సంస్కారశూన్యమైనభాష' చదివి గాథలు త్రవ్వుచున్న తెలుఁగువారికి... ..."

అను తాత్పర్య మేర్పడుచున్నదిగదా!

(అ.) (సంస్కృత)భారతార్థములనిక్క మెఱుంగఁజాలక పోవుటకును సం స్కా ర శూ న్య మై న (తె లుఁ గు) బా స చదువుటకును గల చుట్టఱికమేమో!

(క.) బ్రహ్మయ్యశాస్త్రిగారిమతమున న న్ని య కు మున్ను తెలుఁగునఁ గవిత్వమే కాక వ్రాఁతసదువులుసహితము

లేవుగదా ! * వ్రాఁత లేనిదానిని జదువుట యెట్లు ? గాథలు వ్రవ్వుట యెట్లు ? (చూ. పైపద్యము 3 పాదము.)

ఈరీతిని విచారింపఁగా, 'కాసటబీసట' శబ్దమునకు 'సంస్కారశూన్యమైనభాష—వ్రాఁత సదువులు లేనిభాష (కోదుబాసవంటిభాష), అని వ్యాఖ్యానము సేయుటవలనఁ బైపద్యమంతయు భావశూన్య మగుచున్నది. కావున దాని కాటిప్పణము సెల్లదు.

పై టిప్పణమున కాధారమైన శబ్దరత్నాకరములోని "సలక్షణము గాని చదువు" అను సర్థము నించుకగ నాలోచింతము.

(కాసటబీసటే చదివి=సలక్షణముగాని చదువునే చదివి, సీతారామాచార్యులవారు)

---

* చూ. నన్నియభట్టారకచారిత్రము:—1 "నన్నియ తెలుఁగుబాస శాసించువఱకు దీనిని బ్రజలు తమతమ యభిప్రాయముల వెల్లడించుపనికే మాత్రము వినియోగించుచుండిరి. కాని చదువను వ్రాయను వినియోగించుట లేదు." (64 పుట.)

2 "ఈబాస యాకాలమున నింటికడ మాటలాడుకొనుటకుమాత్రమే వాడఁబడుచుండెడిది గాని తదితరవ్యవహారమునకు వాడఁబడుటయేలేదు; వ్రాతలోనే పెట్టబడెడిది కాదు..." (65 పుట)

3 "నన్నపార్యునినాఁడె తెలుఁగు వ్రాయఁబడుస్థితికి వచ్చినది..." (66 పుట) (ఇత్యాదులు.)

ఆచార్యులవారిమతమున నన్నియకుమున్ను తెలుఁగునఁ గవిత్వమును, గ్రంథములుఁ గలవు. మఱియు లక్షణమును నేర్పడియుండెను. (చూ. శబ్దర. భాషాప్రశంస—10పేరా.) కావున నన్నియాదులచే రచింపఁబడకపూర్వము భారతగ్రంథము, ఏదో సలక్షణముగాని చదువున నుండెడిదనియు, దానినే చదువుకొని తెలుఁగువారు దానియర్థముదెలియనేరక గాథలు దప్పుచుండెడివా దనియు సీతారామాచార్యులవారు భావించియుందురని తోఁచెడిని. ఎట్టిలక్షణశూన్యమైన భాషయందు భారత ముండియున్నను దానియర్థములభంగులనిక్కమెక్కడకుఁ బోఁగలదు? రామాయణముపాట, భారతముపాట, బొబ్బిలిపాట మొదలగునవి సలక్షణముగాని తెలుఁగు భాషయం దెన్నియో యున్నవి. కాని వాని సత్యార్థములు మాత్రము మాటువడినట్లు గానరావు. ఈరీతి నెటుచూచినను ఆచార్యులవారి యర్థముసయితము సరిపడియుండ లేదు.

కావున 'కాసటబీసట' శబ్దమును ఎఱ్ఱాప్రెగ్గడ మహాకవి యెట్టిభావముతో నేయర్థమునఁ బ్రయోగించినాఁడో కనుఁగొందము.

రాజరాజనరేంద్రునకుఁ బూర్వము భారతగ్రంథము "బహుభాషల బహువిధముల" నుండెడిది. * ఆర్య మత

* రాజరాజునకు మున్నే జైనభారత, రామాయణాదిగ్రంథము లాంధ్రమున నుండెడివనియు మతపవాదములచేఁ దక్కిన జైనబౌద్ధాది

విరుద్ధధర్మములఁ బ్రబోధించు నితర (జైనాది) ... ... ... భారతముల (విక్రమార్జున విజయాదుల) కంటె బ్రాహ్మణ (వేదవిహిత) ధర్మములఁ బ్రతిపాదించు వేదవ్యాసభారతమే మన యాంధ్రులకు నధిక విశ్వాసపాత్రమై యుండెను. కాని యందలిభాష గీర్వాణభాషయై యుండుటచే నది యెవ్వరో సంస్కృతపాండిత్యము గలవారికిఁ గాక యితరులకు దుర్గ్రాహ్యమై యుండెను. కావున మనవా రాగ్రంథమును తద్భాషావేత్తలు చదివిచెప్పఁగా విని తెలిసికొనవలసినవారైరి. యెల్లచోటుల నెల్లవేళల సంస్కృతపండితు లొనఁగూడుట కష్టమగుచు వచ్చెను. మఱియు వ్యాసభారతమును దెలిసికొను నభిలాషమును బెద్దయగుచు వచ్చెను. (అది తెలుఁగున లేదయ్యెను.)

అట్టిస్థితిం జేసి తెలుఁగువారు గీర్వాణభాషయం దున్న యమ్మహాభారతము నేచదివి—అంతకుమును సంస్కృత పండితులవలన వినినవి కొన్ని జ్ఞప్తి యందుండియు, గొన్ని యుండకయు, గొన్ని తెలిసియుఁ, గొన్ని తెలియకయు—నెట్లో యర్థము జెప్పికొనుచు నుండిరి. మఱియు, జైనాది భారతములు (విక్రమార్జునవిజయాదులు) వ్యాసభారతమునకు విరుద్ధములైన ధర్మములును, కథలును గలవై వినఁబడు

---

గ్రంథములతోపాటు అవియును దగ్ధము గావింపఁబడె ననియు గొందఱ యభిప్రాయము. ఇది సత్యమేని కావచ్చును. (నన్నయభారతముతరువాత నవి వ్యాప్తి లేక నశించియైన నుండవచ్చును.)

చుండెను. దానం జేసి, 'భాసురభారతార్థములభంగులనిక్క మెఱుంగనేర' క, మన తెనుంగువారు 'గాసటబీసట'— తెలియనిభాష (అన్యభాష)యందున్న (భారత) గ్రంథమునే చదివి గాథలు ద్రవ్వుచుండిరి. కావుననే "బహుభాషల బహువిధముల బహుజనములవలనవినుచు భారతబద్ధస్పృహు లై యున్న తెనుంగువారికి నాంధ్రమహాభారత మొకటి గావలసివచ్చెను.

ఆసమయమున నాంధ్రదేశచక్రవర్తి, మనుమార్గవర్తి, పరమపవిత్రుఁడు, ధర్మమిత్రుఁడు, నిర్జితశాత్రవనరేంద్రుఁడు, రాజరాజనరేంద్రుఁడు, బ్రాహ్మణ (వేద) మతోద్ధారకుఁడై, నన్నియభట్టారకునిచే నారాయణభట్టాదుల సాహాయ్యమునఁ "తెనుంగువారికి వ్యాసమునిప్రణీతపరమార్థము దెల్లము సేయు" మహాభారతాంధ్రీకరణమునకుఁ గడంగునట్లు చేసెను.

కావున 'కాసటబీసట' * అనఁగా తెలియనిభాష అని యర్థము. పైయర్థము గాకున్న నచ్చోట వేఱొకయర్థము పొసఁగదు. నేఁడును హిందూస్థానీ ఇంగ్లీషు మొదలగు నన్యభాషల మాటాడుకొనువారిని జూచి యవి తెలియనివారు "ఏదో 'కాసటబీసట' మాటాడుచున్నారు మాకు తెలిసినది గాదు" అని చెప్పుచుందురు.

---

* 'కాసటబీసట' అనునది— కాసరకూసర, కొక్కిరిబిక్కిరి, చికిలిమాకిలి, చీఁపరపాఁపర, వంకరటింకర ఇత్యాదిజాతిలోనిది.

శ్రీదేవా శరణమః

# కవిరాజశిఖామణి

## కావ్యవిశేషములు

### ఉపోద్ఘాతము

ప్రాచీనాంధ్రకవులలో నన్నిచోడదేవుఁ డనుమహారాజకవి యొకఁడు చేరియున్నాఁ డనువిషయము పందొమ్మిదవ శతాబ్దియందున్న యాంధ్రలోక మెఱుఁగదనియే చెప్పవచ్చును. పెక్కండ్రు నన్నిచోడరాజులనామములను వెలువరించిన శాసనపరిశోధకులకుసయిత మీకవిరాజశిఖామణియుదంతమును దెలుపుశాసన మొక్కటియు నేఁటికిని లభించియున్నట్లు గానరాదు.

విషయ మిట్లుండ, ఇరువదియవశతాబ్దిప్రారంభమున— "నన్నియభట్టునకు నూఱేండ్లు ముందున్న రాజకవిచంద్రుని గ్రంథ మొకటి లభియించె—" ననువృత్తాంతము వార్తాపత్రికలయందు ప్రకటింపఁబడి, యాంధ్రప్రపంచ మంతయు నమిత సంభ్రమాశ్చర్యములపా లగున ట్లొనర్చెను.

గీర్వాణకవితాసతికి వాల్మీకిమహర్షి * జనకుఁ డని

---

* వేదములయం దనేకచ్ఛందములనామము లుండుటయే కాక వేదములో ననేకభాగములు ఛందోబద్ధములై యుండుటచే ప్రథమకవి వాల్మీకిగాఁడని కొందఱియభిప్రాయము. రచనాదివిశేషములనుబట్టి భారతముకంటె రామాయణమే యర్వాచీనమని కొందఱియాశయము. వాల్మీకికంటె మున్న కవు లుండినట్లు రామాయణగ్రంథమే చెప్పుచున్నది. దానిచర్చ కిది యదనుగాదు. కాని, వాల్మీకిని వ్యాసుఁడు గాని, వ్యాసుని వాల్మీకి గాని పేర్కొనకుండుట యాశ్చర్యవిషయముమాత్ర మగును.

భారతవర్షమంతయు విశ్వసించి యుండినట్లే, ఆంధ్రకవితా కన్యకకు నన్నియభట్టారకుఁడు తండ్రి యని యాంధ్రదేశమెల్ల నమ్మియుండెను. ఏతద్విశ్వాసమునకువిరుద్ధముగా, పందొమ్మిదవ శతాబ్ది కడపటిభాగమున విద్యాధికులగువిమర్శకులు గొందఱు నన్నియభట్టు ప్రథమాంధ్రకవి గాఁడనియు, నతనికి ముచ్చు దెలుఁగునఁ గవిత్వమే లేనియెడల నన్నికట్టుదిట్టములతో నంత నిర్దుష్టముగా నూతనముగా గ్రంథరచన సేయుట నన్నియభట్టు నకుఁ గాని, మఱియెవ్వరికిఁ గాని సాధ్యమై యుండదనియు... వ్రాసి, యాంధ్రవాఙ్మయచరిత్రమున నభినవప్రకరణము నొక దానిని జేర్చిరి. ఈవినూత్నప్రకరణము దేశమునఁ గొంత కలవరపాటును జనియింపఁ జేసెను.

ఇట్టిసంచలనసమయముననే పైని వ్రాసిన 'ప్రాచీన గ్రంథసంపాదనవృత్తాంతము' పత్త్రికలయందు ప్రకటింపఁబడి యాంధ్రదేశము నొక్కసారి యుద్భ్రాంత లూగించెను. కొందఱా ప్రకటనమును గని పెదవులు విఱిచిరి. కొందఱు గ్రంథ సంసిద్ధికై యెదురు చూచుచుండిరి. కొందఱు నన్నియకుఁ బూర్వపుఁ గవిపేరితో గ్రంథమే సృష్టింపఁబడుచున్న దని వాకొనఁజొచ్చిరి.

క్రీ. శ. 1909_వ సంవత్సరమున—"కుమారసంభవము: నన్నిచోడదేవప్రణీతము—" అను శీర్షికతో నొకగ్రంథము (ప్రథమభాగము) ముద్రితమై ప్రకటింపఁబడియెను. దానిముఖ

పత్త్రిమునందును, పీఠికయందును దద్గ్రంథకర్త క్రీ. శ. 940 సం॥—అనఁగా నన్నియభట్టునకు నూఱేండ్లమున్నుగ నున్న వాఁ డని వ్రాయఁబడియుండెను. అందులకవిత్వము ప్రాచీనతమమై యుండుటంజేసి దాని నాధునికులు సృష్టించుచున్నా రన్న ప్రవాదము చల్లఁగా నడుగంటిపోయెను. భాషాభిమానులా గ్రంథ మేనాఁటిదో నిశ్చయింపఁ బూర్వగ్రంథశాసనాదులఁ బరిశీలింప దొరఁకొనిరి.

భట్టారకమహాశయునికిఁ బూర్వము తెనుఁగునఁ గవిత్వమే లేదని విశ్వసించియున్నయాంధ్రుల హృదయక్షేత్రములయందు 'అతనికి మున్ను తెలుఁగుకవిత గలదు.' అనువాక్యబీజముల నావాపించుటయే మొదట దుర్ఘట మయ్యెను. ఎట్టకేలకుఁ బరిశోధనములు వెల్లివిరిసినకొలఁది నవి నాటుకొన, "అతనికిఁ బూర్వ మద్గ్రంథములు లేవుగాని స్వల్పముగ పాటలు, పద్యములు నుండినవి." అనుభావాంకురములు క్రమముగాఁ దలసూపెను. ఇట్టిచో, "నన్నియకు మున్ను ప్రబంధములుండెడివి" అనుపలుకుఁదీవలు రేకెత్తుటకుఁ గాలచక్రమింకను దొరలవలయునేమో !

ప్రస్తావమున నున్నకుమారసంభవము ప్రకటింపఁబడిన తరువాత విద్యాధికులు పలువురు కడుంగడు నోపికనై శాసనాదులను బరిశోధించి, తత్కర్త యగు నన్నిచోడఁడు నన్నియభట్టునకుఁ దరువాతివాఁ డనియు, తిక్కనకుఁ బూర్వుఁడనియు

నిశ్చయించిరి. నేఁటివఱకును నన్నిచోడకవికాలమునుగూర్చి కావింపఁబడిన విమర్శములయం దొక్కటియు నిర్బాధక మగు నొక్కయాధారముతో నైనఁ గూడినదిగా నుండలే దనియు, నాతఁడు నన్నియకుఁ బూర్వుఁ డయియే యుండు ననియు నిరూపించుచు నే నొకవిమర్శమును వ్రాసితిని. అది మచిలీపట్టనములోని 'శారద' యందు (రక్తాక్షి సం॥ ఆషాఢమాస సంచికయందు) ప్రకటింపఁబడినది గావునఁ గవికాలమును గూర్చి యిచ్చట మరలఁ జర్చింపలేదు.

## ప్రస్తుతవ్యాసము

ఇప్పుడు—నన్నిచోడమహారాజకవి తనకావ్యము నే రూపమునఁ దీర్చియున్నాఁడు? దానియవతారిక యెట్లున్నది? ఇతనికాలమున నంధ్రభాషకుఁ గలపదపరికరసంపత్తి యెట్టిది? అందు గల ఛందోవ్యాకరణాది విశేషము లేవి?—ఇత్యాది విషయములుమాత్ర మీవ్యాసమునఁ బ్రశంసింపఁబడుచున్నవి.

## కుమారసంభవము ప్రబంధము

కవిరాజశిఖామణి తనకావ్యమును ప్రబంధరూపమున మనోహరముగాఁ దీర్చియున్నాఁడు. ఆశ్వాసాంతగద్యముల— "కుమారసంభవకథ"—అని వ్రాసికొనియున్నను, తాను వ్రాయునది ప్రబంధమే యని గ్రంథావతారికయం దిట్లు చెప్పి కొనియున్నాఁడు:—

ఉ. "జంగమమల్లికార్జును నిసర్గకవిస్తవసీమసూక్తియు
క్తుం గొనియాడి... ... ... ... ... ...
భంగిగ విస్తరించెదఁ బ్రబంధము సద్రసబంధురంబుగన్."

దీనినిబట్టి నన్నెచోడకవులకుఁ బూర్వమే యాంధ్రకవితాసీమంతిని, గీర్వాణాద్యన్యకవితాసతులతోఁ పాటు మనోహారాలంకార విభూషితయై, త్రిలింగవాఙ్మయరంగమునఁ బ్రబంధభూమికం గైకొని స్వతంత్రప్రచారము సలుపఁదగినంతవయఃపరిపాకము నందిన ప్రౌఢయై యుండెనని విశదమగుచున్నది.

## గ్రంథావతారిక

ఇప్పటికి మనకుఁ దెలిసినంతవఱకు నన్నెచోడనికుమారసంభవములోని యవతారికయే యితరాంధ్రకవుల గ్రంథములలోని యవతారికలకు మార్గదర్శినియై యుండినట్లు గానవచ్చుచున్నది. ఎట్లన—ఇందు, ఇష్టదేవతాప్రార్థనము, గురుచరణాభివందనము, పూర్వకవిస్తుతి, పండితసంభావన, కుకవినింద, కావ్యనిర్మాణప్రశంస, అష్టాదశవర్ణనాదికవివరణము, కృతిసమర్పణవిధానము, స్వకీయకులగోత్రాద్యభివర్ణనము, నిజగురుమాహాత్మ్యాభినుతి, షష్ఠ్యంతములు, కుమారసంభవకథాసంగ్రహము, కథారంభము—క్రమముగాఁ జేయఁబడినవి. పిమ్మటికవు లిట్టివీనిలోఁ దమకు వలయువాని ననుసరించి పారంపర్యముగఁ దమగ్రంథములయం దిష్టదేవతాస్తుత్యాదులఁ

గల్పించుకొనుచువచ్చినట్లు గానవచ్చుచున్నది. (చోడని కిం బూర్వమును నిట్టిపద్ధతు లుండియుండును.)

## ఇష్టదేవతాప్రార్థనము

కవినన్నిచోడరాజు శైవుఁడు గావునఁ దనగ్రంథమున మొదట మహేశ్వరునిఁ బ్రధానదైవతముగా స్తుతించెను. పిమ్మట—హరి, అజ, రవి, గజానన, షణ్ముఖ, మార, గిరిజా, సరస్వతీస్తవములను వరుసగా నొక్కొకపద్యమునఁ గావించెను. ఇది 'నన్నయకుఁ బూర్వము దేశిసత్కవులు కావ్యారంభమున నొనర్చుచుండిన ప్రాచీనస్తోత్రపద్ధతి'యై యుండినట్లు తోఁచెడి. మఱియు నన్నయభట్టు తనకు ముందున్న యీసనాతనాచారము విడువలేక—దానిని గొంతసంస్కరణమునకుఁ దెచ్చి-సంగ్రహపఱచి,

" హరి, హ, రాజ, గజాన, నార్క, ష
ణ్ముఖాస్య, మార, సరస్వతీ,
గిరిసుతాదిక దేవతాతతి
కి న్నమస్కృతిఁ జేసి... ... ..."

అని సగముపద్యమునఁ బైదేవతలనందఱ నిమిడ్చి యొకేనమస్కారముతో వారిస్తోత్రమును సాగించినట్లును (కేతనామరేశ్వరాదులుమాత్రము చోడకవిస్తోత్రవిధానమును గొంతవఱకనుసరించినట్లును)పిమ్మటనదివిరళమై(తిక్కనాదుల నుండి మాఱిపోయి) నట్లును గానవచ్చుచున్నది. నన్నయ

భట్టారకుఁడే పృథమాంధ్రగ్రంథనిర్మాతయై యుండినచో, నపూర్వముగా దానుసృష్టించుచుండినయమ్మహాకావ్యమునఁ దాను స్తుతించుదేవతల నందఱను పరమభక్తియుక్తిని సావధానముగా నొక్కొకపద్యమునను వినుతించియే యుండును గాని యేకపద్యార్థముననే స్తుతించియుండఁడు.

నన్నిచోడనిగ్రంథములోని యిష్టదేవతాప్రార్థనమున నొక్కవిశేషము గన్పట్టెడిని. ఈశ్వరేతరులకు తమగ్రంథములను గృతియిచ్చుమనకవులందఱును, కృత్యాదిని దాము స్తుతించుదైవతములు, తత్తత్కృతినాయకుల రక్షించునట్లు వ్రాయుదురు. చోడకవి తనగ్రంథమును నిజగురు వగు జంగమమల్లికార్జునునకు గృతిగ నిచ్చియుండియు, నారాయణమహేశ్వరాది దేవతలు తత్కృతిపతిని గాచునట్లు వ్రాసియుండలేదు. ఈ విధాన మపూర్వముగఁ గన్పట్టుచున్నది. *"గురుర్బ్రహ్మ గురుర్విష్ణుః, గురుర్దేవో మహేశ్వరః...." అనుసూక్తిచొప్పున నాతఁడు వారియం దభేదమును బాటించియున్నాఁడు. కావుననే,

---

*పింగళిసూరనార్యుఁడు తనరాఘవపాండవీయమహాకావ్యమును విరూపాక్షదేవున కంకిత మిచ్చియుండియుఁ, దద్గ్రంథమును వ్రాయఁ దన్నుఁ బురికొల్పిన యాఁకవీటి పెద్దవేంకటప్పపాలు నాయా దైవములు రక్షించునట్లు వ్రాసియున్నాఁడు.

చ. "గురువున కిష్టదైవమున
        కుం బలికిం గృతిసెప్పి పుణ్యముం
    బరమును దేజముం బడయ
        వచ్చు జగంబుల నిశ్చయంబు; మ
    ద్గురువును, నిష్టదైవమును
        గూర్చుని జేసెఁడు దాన; నాకుఁ గా
    కొరునకు నిట్లు సేకుఱునె
        యొక్కట లాభము లెన్ని యన్నియుఁ."

అని తనజన్మము సార్థకమైనవిధమును మనసారఁ దెలిపికొనియున్నాఁడు.

## పూర్వకవిస్తుతి

గురుసంకీర్తనానంతరము మనమహారాజకవిరాజు పురాతన కవిస్తోత్రము ననిదంపూర్వముగా రచించియున్నాఁడు :—

క. "కవితామృతోదయాంబుధిఁ
    గవిసజ్జనకనకు వస్తుకావ్యాబ్జరవిం
    గవితారంభంబుల స
    త్కవు లభినందింతు రాదికవి వాల్మీకుఁ."

క. "వేదాంతభారతపురా
    ణాదులు సేయుశ్లోకపేర్మి యనుచుం బొగడం
    గా దెద్ద* నజుండు నోపని

* ఇచ్చట డకారమును రేఫఁబలుకవలయును.

వేదము లేర్పఱిచె నం(డు వేదవ్యాసుఁ."

క. "భాసురమతి వాల్మీకి
వ్యాసాదులు సనినజగతి వరకవితాసిం
హాసన మెక్కి కవీంద్రు)ల
దాసులుగా నేలెఁ గాళిదాసుఁడు వేర్మిఁ."

క. "భారవియును వస్తుకవితను
భారవియుచు బరగి రుదయపర్వతశిఖరా
గా)రోహణేంద్రకీలవ
గారోహణవర్ణనల జనారాధితులై."

క. "క్రమమున నుద్భటుఁడు గవి
త్వము మెఱయఁ గుమారసంభవము సాలంకా
రము గూఢవస్తుమయకా
వ్యముగాఁ బారులీలఁ జెప్పి బారు మెచ్చించెన్."

క. "కరములు దునుముడుఁ బరముని
వరదునిఁగాఁ గొలిచి కవితవలన నె మగుడఁ
గరములు వడసి జగంబులఁ
బరగె మహాకవి యనంగ బాణుఁడు వేర్మిఁ."

క. మును మార్గకవిత దేశం
బున వెలయఁగ దేశికవితఁ బుట్టించి తెనుం
గును నిలిపి రంథ)విషయం
బునఁ జనఁ జాళుక్యరాజు మొదలుగఁ బలువుర్."

(కవిరాజశిఖామణి గావించినకవిస్తుతిపద్యములు కడవఱకుఁ గందములే.)

పై పద్యములలోఁ గడపటిపద్యముతరువాత నాంధ్ర కవులను స్తుతించినపద్య మొకటి పోయియుండు నని భావించి, కీ. శే. వీరేశలింగము పంతులవారు కవిచరిత్రమున నిట్లు వ్రాసిరి :—

“కవి వాల్మీకి, వ్యాసుఁడు, ... మొదలగుసంస్కృత కవులను కొందఱిని ప్రశంసించి, తెలుఁగుకవులను విడిచిపెట్టెను. అయినను సంస్కృతకవులను జేర్కొన్నతరువాత,

క. “మును మార్గకవిత లోకం,బున వెలయఁగ ... ”
(పైపద్యమును జూడుఁడు.)

“అనుపద్యమును, దానితరువాత,

చ. “సురవరులం గ్రమంబున వ
చోమణిసంహతిఁ బూజసేసి మ
ద్గురుచరణారవిందముల
కుం దగ సన్నతిఁజేసి కొల్చి వి
స్తరమతులం బురాణకవి
సంఘము నుత్తమమార్గసత్కవీ
శ్వరులను దేశిసత్కవుల
సంస్తుతిసేసి మనోముదంబునన్.”

“ అనుపద్యము ను పుస్తకములోఁ గానఁబడు చున్నవి. ఈపద్యములలోఁ గవి చెప్పిన దేవతాస్తుతియు, గురువందనము ను, పురాణకవిప్రశంసయు, సంస్కృతసత్కవీశ్వరులస్తోత్రము ను పుస్తకములోఁ గానఁబడుచున్నవి. కాని దేశిసత్కవుల సంస్తుతిమాత్రము కనఁబడకున్నది. దేశిసత్కవుల స్తుతింపనిది స్తుతించితి నని కవి యబద్ధము వ్రాసియుండఁడు. అందుచేత ‘మును మార్గకవిత’ అనుపద్యమునకును ‘సురవరులక’ అను పద్యమునకును నడుమ తెలుఁగుకవులను స్తుతించిన పద్య మొకటి యుండియుండవలెను.........” (అని వ్రాసిరి.)

పైపంతులవారి వ్రాఁతలోని ‘దేశిసత్కవుల సంస్తుతి మాత్రము కనఁబడకున్నది. కవి యబద్ధము వ్రాసియుండఁడు ......’ మొదలగువాక్యములవలన ననేకుల కనేకభావము లుదయించినవి. కొన్నికథలుసయితము పుట్టినవి. ఆభావముల తోఁగాని, అక్కథలతోఁగాని మనకిప్పుడు పనిలేదు. “పైస్తుతి పద్యములలో నొకపద్యము పోయియుండునా ?” అనువిషయ ముమాత్రమే ప్రస్తుతము విచార్యము.

పైనన్నిచోడనిపూర్వకవిస్తోత్రవిధానము సూక్ష్మముగఁ బరికించువారికి, శైవుఁడైనయారాజకవి,

1. సత్కవులు వాల్మీకి నభినందింతురు.
2. వ్యాసుఁడు వేదముల నేర్పఱిచె నందురు.
3. కాళిదాసుఁడు కవులను దాసులుగా నేలెను.

4. పర్వతవర్ణనమున భారవి వినుతి కెక్కెను.
5. ఉద్భటుఁడు కవిత్వముచే హరుని మెప్పించెను.
6. బాణుఁడు కవిత సెప్పి కరములు వడసెను.

అని యమ్మహాకవుల కవిత్వచారిత్రాదులను మాత్రమే యభివర్ణించినట్లు గాననగును గాని యం దొక్కని కేని యాతఁడు నమస్కరించినట్లు గానరాదు. అట్లే, "చాళుక్యరాజాదులు పంబువును దేశికవితను బుట్టించి నిలిపిరి." అని యాంధ్రకవితాసతి జననచారిత్రమునుసయితము కవి చెప్పి యున్నాఁడు. పైచంపకమాలలోని "దేశిసత్కవులసంస్తుతి" అనునది యదియే. అంతియ కాని యాంధ్రకవిస్తుతిపద్యము వే ఱేదియు పోయియుండలేదు.

మొదట స్తుతింపనివారిని స్తుతించినట్లు తరువాత వ్రాసి కొనునాచారము మనలో విరళముగాఁ గలదు. మచ్చున కొకటి:—

తెనాలి రామకృష్ణుఁడు తనపాండురంగమాహాత్మ్యమున, ఇష్టదేవతాస్తుత్యాదికము నెఱపిన తరువాత—"అని నిఖల...దైవతంబులఁ గొనియాడి......వంచకులగుకొం చెపుం గవుల రవళి నదలించి...పరమవైష్ణవరత్నంబులకు వందనం బాచరించి...అని వ్రాసియున్నాఁడు.

ఇందు మొదటిదేవతాస్తుత్యాదికమంతయు గ్రంథముసఁ గానంబడుచున్నది గాని పరమవైష్ణవరత్నాంబుల నుతించిన

పద్యము మాత్రము గానరాకున్నది. ఇంతమాత్రమున ‘ రామకృష్ణకవి యబద్ధము వ్రాసియుండునా ?’ అని మనము సంశయింపఁబని లేదు. ఆవాక్యమే, యాతని వైష్ణవస్తుతి. నన్నిచోడకవిరాజు ననేకస్థలంబుల ననుకరించిన మన రామలింగకవి యీ స్తోత్రవిధానమున సయిత మాతనినే యనుకరించి, చోడని పైస్తుతిక్రమము తనస్తుతియట్టిదే యనియు, నందొక పద్యమును బోలే దనియు మనకుఁ దెల్పుచున్నాఁడు !

ఇది యిట్లుండ, మా (పీఠికాపుర) మహారాజావారు, తంజావూరిప్రతినుండి యొకప్రతిని వ్రాయించి తెప్పించినారు. అది యిప్పుడు శ్రీసూర్యరాయనిఘంటుకార్యస్థానముననున్నది. ముద్రితపుస్తకమున నున్నస్తుతిపద్యములే దానియందును నున్నవి. వేఱొకపద్యము దానియందును లేదు. మఱియు,

“ No. 189,

పద్యకావ్యం.

పద్యకావ్యకుమారసంభవం—తెలుఁగులిపి-ఆకులు 127 పూర్తిగా. ”

అని యా వ్రాఁతప్రతిమీఁద వ్రాయఁబడియున్నది. 189 అనునది గ్రంథసంఖ్య. 127 ఆకులును వరుస దప్పకుండ నున్నవని పై ‘ పూర్తి ’ అనుపదము దెలుపుచున్నది. కావున పైస్తుతిపద్యములలో నొకటిగాని, మఱికొన్నిగల యొకయాకుగాని పోయినవని తలంప నక్కఱలేదు. ‘ముద్ర మార్గకవితో

అనుపద్యమే యాంధ్రకవిస్తుతిపద్యము. తక్కినవానివలెనే యదియుఁ జరిత్రాత్మకము.

ఈపూర్వకవిస్తుతివిమర్శసందర్భమున నింకొకవిషయము చర్చింపఁబడవలసియున్నది:—

శ్రీ బుఱ్ఱా శేషగిరిరావుపంతులుగారు, 'ఉద్భటదేవ చరిత్రము' అను కర్ణాటగ్రంథమును దాము చెన్నపురిప్రాచ్య లిఖితపుస్తకభాండాగారమున (వ్రాఁతప్రతిని) చూచితి మని యు, ఆతఁడు కర్ణాటకకవి యేమో యనియు, నన్నిచోడఁడు స్తుతించిన 'ఉద్భటుఁ' డాతఁడై యుండు నేమో యనియు, కన్నడబాసయం దాతఁడు కుమారసంభవము వ్రాయఁగా, దానిని మనచోడఁడు దెలుఁగునకుఁ దెచ్చెనేమో విచారింప వలసి యున్న దనియు నొకప్పుడు నాతోఁ బ్రస్తావించినారు. అప్పుడు నేను, "ఆయుద్భటదేవచరిత్రమునఁ జెప్పఁబడిన యుద్భటదేవుఁడు, రాజో కవియో యెట్లు నిర్ధరించితి రనియు, ఒకవేళ కవియే యని యూహించినను, వాల్మీకి, వ్యాస, కాళిదాస, భారవి, బాణులనడుమ—అనఁగా సంస్కృత కవులనడుమ—నీకర్ణాటకకవి యెట్లు దూఱియుండు ననియు, దేశభాషాకవుల నెవ్వరిని స్తుతింపని మనకవీంద్రుఁడు, ఆకన్నడ కవి నెవ్వనినో తెచ్చి, కడపట నైన వ్రాయక గీర్వాణకవుల మధ్యమున నెట్లు చేర్చియుండు ననియు, సుప్రసిద్ధుఁడై, కాశ్మీర జయాపీడసంస్థానవిద్యాపీఠపీఠ మలంకరించిన మహాకవి

యుద్భటుఁ డనువాఁడు సంస్కృతభాషను సాలంకార మగు కుమారసంభవమును రచియించినట్లు గీర్వాణాలంకారశాస్త్ర వ్యాఖ్యానగ్రంథములు ఘోషించుచుండ, ఉద్భటదేవుఁ డను పేరు గలవాని నెవ్వనినో—కవియో ప్రభువో నిశ్చయింప రానివానిని ఇప్పట్టునఁ జేర్పఁగ నేల యనియు వారిని ప్రశ్నించితిని. ఆగ్రంథమును జూచినపిమ్మట నాప్రశ్నములకుఁ బ్రత్యుత్తరము నిచ్చెద మని వారు సెలవిచ్చిరి. కాని వారి దైన యీయభిప్రాయమే 'భారతి' పత్త్రిక 7 వ సంచిక యందు 'ఆంధ్రకవిత్వచరిత్రము' అనువ్యాసమున నుదాహ రింపఁబడి సమర్థింపఁబడినది. శ్రీ శేషగిరిరావుపంతులుగారు గాని, 'ఆంధ్రకవిత్వము'ను వ్రాయుచున్న నారాయణమూర్తి పంతులుగారుగాని పైప్రశ్నములకు దృష్టాంతపూర్వకములగు సదుత్తరములనిచ్చు రనుక వారియభిప్రాయములు సమంజసము లనుటకు వలనుపడదు.

## కుకవినింద.

చోడకవికుమారసంభవమునఁ గుకవినింద గావింపఁ బడినది. ఈయాచారము మన తెలుఁగు శాస్త్రములలో నే నాఁడు పుట్టినదో తెలిసికొనునాధారము గానరాదు. పూర్వ కాలమున మతవైషమ్యానులవలనఁ గలిగిన పరస్పరద్వేషాదు లే యిట్టినిందలు పుట్టుటకుఁ గారణములై యుండును. కాలక్రమమున నట్లు నిందించుట గతానుగతిక మగునాచార

మయ్యె నని తోఁచెడిని. సంస్కృతాంగ్లేయాద్యన్య భాషా గ్రంథములయందును నిట్టినిందించుటలు గలవు. కుకవినింద లేని యాంధ్రకావ్యములును గలవు.

కావ్యప్రశంస.

కావ్యనిర్మాణమునుగూర్చి నన్నిచోడకవిరాజు మనోహరముగఁ బ్రశంసించియున్నాఁడు. అందొండురెండు పద్యములు మాత్ర మిచ్చుటఁ జూపఁబడుచున్నవి:—

చ. "సరళము గాఁగ భావములు
జాను తెనుంగున నింపు పెంపుతోఁ
బిరిగొన వర్ణనల్ ఫణితిఁ
బేర్కొన నర్థము లొత్తగిల్ల బం
ధురము గఁ బ్రాణముల్ మధుమ్మృ
దుత్వరసంబునఁ గందళింప న
క్షరములు సూక్ష్మ లాస్యలకుఁ
గర్ణరసాయనలీలఁ గ్రాలఁగన్."

(ఆంధ్రభాషావధూటి జాను తెనుంగుసోయగమునకు నిక్కవిరాజశిఖామణి గ్రంథమే మేలినిధాన మని యాతని గ్రంథమును జదువువారి కెల్లఁ దెల్లము గాఁగలదు.)

ఆదిపర్వములోని,

ఉ. "సారమతిం గవీంద్రులు ప్ర
సన్నకథాకలితార్థయుక్తి లో

నారసి మేలు నా నితరు
　　　　లక్షరరమ్యత నాదరింప నా
నారు విశార్థ సూక్తినిధి
　　　　నన్నియభట్టు దెనుంగున న్మహా
భారతసంహితారచన
　　　　బంధురుఁ డయ్యె జగద్ధితంబుగన్."

అనునన్నియభట్టారకునిపద్యము పైనన్నిచోడనిపద్యము ను జూచుచున్నది. మఱియు,

క. "చతురోక్తుల నుత (పద) బహు
గతుల నలంకారభావకాంతిరసార్థో
న్నతిఁ గృతి నతిరసికులు వర
సతిగతి నెఱిఁగింపవలదె సౌభాగ్యమునన్."

అను మనయాంధ్రకవిచంద్రునిపద్యమును విలోకించి,

క. మృదుపదగతియుం రసభా
వదపేస్సిం పణ్యావనిత పోల్కృతి సౌంద
ర్యద చాతుర్యద కణియెనె
విదగ్ధబుధజనదమనమ నెళెయెలె వేడా ?"

అనుకన్నడకవీంద్రునిపద్యము మోము మఱవాంచుచున్నది.

అష్టాదశవర్ణనాదికము

నన్నిచోడని నాఁటికే మనయాంధ్రభాషావధూటికి మహాకావ్యలక్షణము లన్నియుఁ గుదురుకొని యున్నట్లు

“క * వనజలకేళీరవిశశి......దూత్యవర్ణనాష్టాదశమున్” బరిపూర్ణంబై, దశప్రాణంబుల సప్రాణంబై, నవరసభావభరితంబై, షట్త్రింశదలంకారాలంకృతంబై, రమణీయంబైనదివ్యకథారంభంబు......” అనుకుమారసంభవములోని వ్రాఁతవలనఁ దెలియ నగుచున్నది. చిరకాలము మహోన్నతదశ ననుభవించిన గీర్వాణకవితాసతీమతల్లికతోడి సంతతసాహచర్యముననే యీమె కీవిన్నాణము లన్నియుఁ బన్నువడి యున్న వని యెన్ననగును.

## కవిబిరుదములు

శ్రీరామాములకెనవచ్చుసుశ్లోకధనుఁడైనమననన్నిచోడదేవుని ప్రభుత్వంపుబిరుదములు మనప్రసంగమునకుఁ దగిలి వచ్చునవి గావు. “కవిరాజశిఖామణి”, “వివేకాబ్జజుఁడు...” ఇత్యాదు లీతనికవిత్వంపుబిరుదము లైయున్నవి. వీరేశలింగము పంతులవారు, “ఈకవి, కవిరాజశిఖామణి యన్నబిరుదును తానే పెట్టుకొనెను.” “ఇతఁ డాత్మస్తుతియందుఁ గొంచెమిష్టము గలవాఁడు.” అని కవిచరిత్రమున వ్రాసియున్నారు.

మనదేశమునఁ బండితులకును, కవులకును సత్యపరిపూర్ణము లైనయాత్మశక్తులను గ్రంథస్థములుగా నొనరించుకొనుట, చిరకాలమునుండి పరంపరగ వచ్చుచున్నయాచారమైయున్నది.

---

* ప్రౌఢకవిమల్లనరుక్మాంగదచరిత్రమున “వనజలకేళీశశిరవితనయోదయ...” ఇత్యాదిగ నల్పభేదముతో నిట్టిపద్యమే కలదు.

వాల్మీకిమహర్షి (?) తననోటనే కవిత్వము పొడమిన దనువిషయము నెంతో చమత్కారముగాఁ బొగడికొని యున్నాఁడు. కృష్ణద్వైపాయనుఁడు భారతమునఁ దన్నుఁ దానెన్నోవిధముల స్తుతించుకొన్నాఁడు. ఇట్లే గీర్వాణకవులు పెక్కుండ్రు తమతమశక్తులను దామే వెల్లడించుకొనియున్నారు. మఱియు, విద్వచ్ఛిరోమణియు, వ్యాఖ్యాతృచక్రవర్తియు నగు మల్లినాథసూరి, రఘువంశవ్యాఖ్యానావసరమున, "వాణీంకాణభుజీ" మిత్యాదిశ్లోకములతో షట్ఛాస్త్రముల యందును స్వేచ్ఛావిహారముఁ గావించిన తనపాండిత్యప్రకర్షమును మిక్కిలియుఁ బొగడికొనియున్నాఁడు. ఇఁక మన తెలుఁగు కవులయాత్మస్తుతులను గనుఁగొనుఁడు!

నన్నయ—"విపులశబ్దశాసన, ఉభయభాషాకావ్యరచనాభిశోభిత, సత్ప్రతిభాభియోగ్య, మత్యమరాధిపాచార్య, సుజన—" ఇత్యాదిబిరుదములను విశేషముగాఁ జెప్పికొన్నాఁడు.

తిక్కన—"అమలోదాత్తమనీష నేనుభయకావ్యప్రౌఢిఁ బాటించు శిల్పమునం బారగుఁడన్, సన్మాన్యుఁడన్ కవితావిలాసవిస్తరమహనీయుఁడన్—" అని తన్నుఁ దానే పొగడికొనియున్నాఁడు.

సోమన—"సకలభాషాభూషణ, సాహిత్యరసపోషణ సంవిధానచక్రవర్తి, సంపూర్ణకీర్తి, నవీనగుణసనాథ" అను బిరుదముల వ్రాసికొనినాఁడు.

కేతన— “కవితయందు బ్రహ్మనైన మెచ్చనితిక్కనచే మెచ్చుఁ గాంచినప్రోడ నైననన్ను వేఱ పొగడ నేల?— వివిధకళానిపుణుండన్, అభినవదండిన్ ...” అనుబిరుదములను దానే పెట్టుకొనెను!

(చూపఁ బూనిన నిట్టియుదాహరణములు వేలకొలఁది గలవు)

ఇట్టివ్రాఁతలు వారివారిప్రజ్ఞావిశేషములు శాశ్వతముగ గ్రంథస్థములై యుండుటకు నేర్పఱుపఁబడిన కవిసమయముల లోఁ జేరునుగాని యాత్మస్తుతులలోఁ జేరవని తలంచెదను. నన్నిచోడమహారాజునకుఁ గలచాతుష్షష్టికళానిపుణత్వమునుబట్టి యు, కవిత్వాతిశయమునుబట్టియు నాతనియాస్థాని నలంకరించు విద్వత్కవులు, ‘కవిరాజశిఖామణి’ యని యాతనిఁ బొగడుచువచ్చుచుండిన హేతువుననైన నాతఁడాబిరుదమును వ్రాసికొనియుండును. ఎట్లు వ్రాసికొనిననేమి?

క. “ఓలిన కడసన నఱువది
    నాలుగువిద్యలను నేర్పు నైసర్గిక మై
    వాలినసుకవులకుం గా
    కేల దరమె కృతులు సెప్ప నెవ్వరికైనన్.”

అని వ్రాసికొనిన యమ్మహారాజకవిచంద్రునిసామర్థ్య మెట్టిబిరుదమునకైన నర్హమైనదేకదా! *

---

* కీ. శే. వీరేశలింగముగారు, కవిచరిత్రమున “ఇక్కవి నాచన సోమనాథాదిమహాకవులతోఁ దులఁదూఁగఁదగినవాఁడు గాని సాధారణుఁడు

కృతిసమర్పణవిధానము—కృతిపతి

చోడకవిరాజు తనకుమారసంభవమహాకావ్యము నాత్మవిద్యాగురుఁడగుజంగమమల్లికార్జునునకు నంకితముగ నిచ్చెను. ఇమ్మహారాజునకుఁ గలగురుభక్తి నిరవధికము. ఆశ్వాసాద్యంతపద్యములందును, గ్రంథమధ్యమునను మహేశ్వరునకును, మల్లికార్జునునకును నభేదము సెప్పి యపార గురుభక్తి వెల్లడించియున్నాఁడు. ఇట్లభేదము సేయుట "విరుద్ధముగాను, కొంత యసంగతముగాను ఉన్నదేమో !" అని కవులచరిత్రమున వ్రాయఁబడి యున్నది గాని "గురుర్దేవో మహేశ్వరః" అను నార్యోక్తి నితఁడు సార్థకముఁ జేసె నని తలంపవచ్చును.

జంగమమల్లికార్జునుఁడు పండితమల్లికార్జునుఁడేమో యని కొందఱు దలంచిరిగాని యాతఁ డీతఁడుగాఁడు. పండితమల్లయ్య వీరశైవుఁడు. నన్నెచోడదేవుఁడు వీరశైవుఁడు గాఁడు. కావున మనకవి యారాధ్యులశిష్యుఁ డగుట పొసఁగదు. వీరశైవులు శివేతరదైవములను గొలువరు. చోడకవిబహుదేవతాస్తుతిని గావించియున్నాఁడు. మఱియు, విష్ణుదేవునిమహిమలను విశేషించియున్నాఁడు. (ద్వి భా. 421, 860)

---

గాఁడు " అని వ్రాసి యుండియు, తాము ప్రకటించినయుత్తరహరివంశ, దశకుమారచరిత్రకర్తలు పెట్టుకొన్న బిరుదులను పోషించి యుండియు నిష్షడ్విఘ్న వ్రాయుటయుఁ గారణ మేమో!

మల్లికార్జునయోగియుఁ గవితల్లజుఁ డైనట్లును, ఆతఁడే తనకుఁ గవిత్వమును బ్రసాదించియున్నట్లును మనకవీంద్రుఁడు తనగ్రంథమునఁ జెప్పియున్నాఁడు. మఱియుఁ దనగురువు దనకుఁ బ్రసాదించినకవిత్వము నాతనికే సమర్పించుట నిట్లు మనోహరముగాఁ దెలిపికొనియున్నాఁడు:—

సీ. "శరధినీరులు పయోధరములు గొనివచ్చి
కురిసి వారిధియందు గూర్చునట్లు
చేనఁ బండినవిత్తు చేనికి ఫలకాంక్షఁ
జేర్చిఁ గ్రమ్మఱ వెదవెట్టునట్లు
రోహణాచలపతి కూహించి వరరత్న
సంచయంబున విభూషించునట్లు
తీర్థాళి కర్థిఁ దత్తీర్థోదకంబుల
నెసకంబుగా నర్ఘ్య మిచ్చినట్లు
నింగి ముట్టియున్న జంగమమల్లయ
వరమునందు గనినవస్తుకవితఁ
దగిలి వారియంద నెగడింతు రవికి దీ
పమున నర్చ లిచ్చుపగిదిఁ గాఁగ."

షష్ఠ్యంతములు

ఒకకవీంద్రునిచేఁ గృతి నందుభాగ్యశాలి సామాన్యుఁడై యుండఁడు. సామాన్యునకుఁ గృతి నిచ్చు నేని కవి

నిందాపాత్రుఁ డగును. కావునఁ దనకృతికన్యను సమస్త సద్గుణాలంకారవిశిష్టునకే యిచ్చియుంచుటను లోకమునకుఁ దెలిపికొనువాఁడునుంబోలె, కవిచంద్రుఁడు, తదీయనిరంతరాభ్యుదయమును గోరువాఁడై, అట్లు గోరుట సమయముగా, తనగ్రంథమునను, షష్ఠ్యంతములఁ జేర్చుటచే, తద్గుణోత్కర్షమును వర్ణించుచుండెను. ఇది పురాతనసంప్రదాయసిద్ధమైన కవిసమయముగాఁ గానఁబడియెడి. (కవి తనకోశమును భగవంతునకర్పించినచో యాతనిమహిమలను బొగడును.) నన్నియభారతభాగము, తిక్కనరామాయణము, మొల్లరామాయణము మొదలగునవి షష్ఠ్యంతములు లేని యాంధ్రకావ్యములై యున్నవి.

## కుమారసంభవకథ

కుమారసంభవకథ, శివ, లింగ, స్కంద, వహ్ని పురాణములలోనిది. దీనిని మహాకవులనేకులాయాపురాణముల నుండి తీసి ప్రత్యేకకావ్యములుగా వివిధనామముల రచియించియున్నారు. ఇక్కథ నాంధ్రమునకుఁ దొలుదొల్తఁ దెచ్చినవాఁడు నన్నిచోడకవిరాజనియే తోఁచుచున్నది. ఏతత్కథాసంవిధానమును గూర్చియు, కవిరాజశిఖామణికవిత్వతత్త్వమును గూర్చియుఁ బ్రశంసించుటకు మఱియొకయదను గైకొనియెదను.

## శబ్దపరికర సంపత్తి

### ౧. అన్యదేశ్యములు

చిరకాలమునుండి యాంధ్రదేశమునకును, దక్షిణదేశములకును, నన్యోన్యానుబంధము విశేషముగఁ గలిగియుండుటచే, త్రిలింగభాషాస్త్రీమంతినికిని, దాక్షిణాత్యభాషావధూటులకును గీర్వాణరమణితోఁ పాటు, ఎడతెగనిదియు, కావుననే, అఱమరిక లేనిదియు నగుపరస్పరసాహచర్య మేర్పడియున్నది. దానం జేసి యొకభాషలోనిశబ్దములు వేఱొకభాషలోనికి సంస్కృతశబ్దములవలెనే చేరిపోయి, అవి యేభాషలోనివో యేర్పఱుప శక్యము గానియంతయైక్యమును గాంచినవి. అప్పకవీయము, కావ్యాలంకారచూడామణి మొదలగులక్షణ గ్రంథములలోని 'దేశ్యపదలక్షణము' అను భాగమును జూచువారికి ద్రావిడభాషల కన్నిటికిఁ బూర్వమునుండియుఁ గలచుట్టఱికము, అత్యంతాశ్చర్యమును గొలుపఁగలదు.

ఇక్కాలమున మహమ్మదీయాంగ్లేయాద్యన్యభాషాపదములగు "కవులు, కదపా, జప్తు, జమాబందీ, తహసీల్దారు, దస్తు, శిస్తు, వసూలు, రోజు ..." "టైము, రైల్వే, టిక్కెట్టు, ఇంటను, లాంతరు, చిమ్నీ, సమ్మను, స్టేటుమెంటు, డిక్రీ, వారంటు, రెజిస్ట్రియు, రసీదు,(రిసీట్ అనుదానివికృతి!) బయోగ్రాఫ్, గ్రామోఫోను, ఇస్పేటు (స్పేడ్స్!) హైమాను (!)...", మొదలగునవి యాంధ్రభాషలోనికి దొరలి వచ్చి పడి,

ఇవి యిట్టివని తలంపునైనఁ గలిగింపకుండునంతటిచనవును గాంచి జనులచే వ్యవహరింపఁబడుచున్నవి. కాలప్రవాహమునఁ గొట్టుకొనివచ్చి యీజీవభాషాసముద్రమునఁ జేరుచున్న యిట్టి వానిని జనవ్యవహారమునుండి యెవ్వరు తప్పింపఁగలరు ?

సుసూక్ష్మముగ నాలోచనముసేయుచో గీర్వాణము సయితము మన కన్యభాషయే ! వేలకొలఁది సంవత్సరములు మహోన్నతపదమున నుండి భారతవర్షమునందంతట నిరతిశయవ్యాపనముఁ జెంది దేశభాషల కన్నిటికిని మూలకందమను విఖ్యాతిని గాంచిన దగుటచేతను, వేదశాస్త్రపురాణేతిహాసాదు లనేకములు దానియం దుండుటచేతను పూజనీయయగునయ్యార్యభాషను మనవారు ' దేవభాష, ఆద్యప్రకృతి ' అను గౌరవబిరుదముల నిచ్చి పూర్వమునుండియు నాదరించుచున్నారు గాని తెలుఁగునకు సంస్కృత మెట్టిదో ప్రాకృతము నట్టిదే; ప్రాకృత మెట్టిదో తక్కినద్రావిడభాషలు నట్టివే ! ఆద్యప్రకృతి తల్లి యేని ద్వితీయప్రకృతి పినతల్లి; తక్కినప్రకృతులు సోదరీమణులు. అందఱును బాంధవులే.

నన్నిచోడనిగ్రంథమునఁ గొన్ని యన్యభాషాపదములుండుటం గాంచి శ్రీవీరేశలింగముగారు తమకవిచరిత్రమున,

"నన్నిచోడనికవిత్వ మన్యభాషాపదదూషితము గాని యెడల నుత్తమమైనదే" అని వ్రాసిరి.

శబ్దానుశాసనుఁడు మొదలుగ నేఁటివఱకును గల

కవులలో నన్యభాషాపదమును బ్రయోగింపనికవి నొక్కనినేని వ్రేలుమడంచి చూపఁజాలము. ఇదిగాక,

ఆడు, పాడు, కట్టు, పడు, కై (చేయి), ఆఱు, మూఱు, వేఱు—ఇత్యాదిశబ్దములు తెలుఁగునను, అఱవమునను రూపభేదము లేక యున్నవిగదా! ఇవి యేభాషలోనివో యెవ్వరు నిర్ణయింపఁగలరు? ఇంతేల? ‘తావి,’ ‘మోవి,’ ఇత్యాదు లన్యదేశ్యము లని మనవ్యాకర్తలు వ్రాసినప్పుడు మనభాషయం దన్యభాషాపదదూషితముగానిగ్రంథ మేది? నన్నిచోడని గ్రంథమున మన మన్యభాషాపదము లని తలంచునవి యాతని కాలమున ద్రావిడభాషల కన్నిటికి సామాన్యములై జనవ్యవహారమునను, గ్రంథములందును నుండెడివి గావని యెట్లు చెప్పవచ్చును?

మఱియు, వీరేశలింగముపంతులుగారు, “నన్నిచోడని కర్ణాటకపదప్రయోగము” లని కొన్నిటి నెత్తి చూపుచు, “ఈతఁడు వాడిన కన్నడపదములన్నియు(?) పూర్వకాలమున కర్ణాటకాంధ్రభాషలకు సామాన్యము లని మనవారు చెప్పవత్తురు. అవి పూర్వము రెండుభాషలకును సామాన్యము లని యెట్లు తెలిసికోవచ్చును? ఏపూర్వకవులు వీనిని బ్రయోగించిరి? నన్నయభట్టారకాదులు ప్రయోగింపలేదు.” అని వ్రాసినారు. అతివిస్తర మేల?

అవి రెండుభాషలకును సామాన్యములే యనియు,

మనపూర్వకవులు వానిని బ్రయోగించియే యున్నారనియుఁ బంతులవా రిచ్చినప్రయోగములలోనివానినే రెండిటినిమాత్ర మిచ్చుటఁ జూపుచున్నాను:—

౧. "బెదరుచు నంతరంగమున భీతికిఁ గండవడంబుట్టి పల్కెడు..."

కండవడ మనఁగా కన్నడమున 'తెఅ' గావున నన్యదేశ్య మని పంతులవారియాక్షేపము.

ఇది "కాండపట" శబ్దవికృతి యని శబ్దరత్నాకర నిఘంటుకర్తలు 'గండవడము' అను గకారాదిరూపముతో గ్రహించి, మనయాంధ్రగ్రంథములోనిదేయైన యీక్రింది ప్రయోగము నిచ్చిరి:—

క. "ఉండిరి పతియును గాంతయు
గండవడముమూటునందు..."

షోడశకుమారచరిత్రము.

పంతులవారియాక్షేపమునకు సమాధానముగా, కీ. శే. తేప ప్పెరుమాళ్లయ్యగారు, "కండవడము నితఁడే కాక షోడశరాజచరిత్రకర్తయుఁ బ్రయోగించినాఁడు గావున నిది లాక్షణికము కానోపును." అని (ఆం. సా. పరిషత్పత్త్రిక, 7 సంపు 1 సం. లోన) వ్రాసినారు! ఇతరకవి ప్రయోగింపని పదములు నన్నచోడనివి యలాక్షణికములే యగునా? నన్నయ భారతమునఁ గన్పట్టుచు నితరకవులు ప్రయోగింపనివి కొన్ని

యున్నవే! అవి యలాక్షణికము లైనవా? ఇ దేఁటి న్యాయము?

ఉ. '' ఎలమిన పూరి మేసి, సెల
యేఱుల నీరులు ద్రావి మేలిమెం
చల నెలమావిజొంపముల
చల్లనినీడల నిల్చి పొల్చి...''

'' మెంచ-అనఁగా, కన్నడమున సరస్సు '' కావున నన్యదేశ్యపద మని పంతులవారి యాక్షేపము.

దీనిని సయితము శబ్దరత్నాకరనిఘంటుకారుఁడు దేశ్యపదముగానే గ్రహించి, యాంధ్రగ్రంథోదాహరణము నె యిచ్చినాఁడు. పంతులవారు పైపదములను శబ్దరత్నాకరముఁ జూచియుండ లేదని తోఁచెడిని. చూచియుండిరేని '' ఏపూర్వకవులు వీనిని బ్రయోగించిరి?'' అని ప్రశ్నించియుండరు.

ఈరీతిని గ్రంథముల నింకను బరిశోధించుచో, నన్యభాషా పదము లని మన మిప్పు డనుకొనుచున్నవి, చాలవఱకు దేశ్యములుగానే కానఁబడఁగలవు. అట్టివానిలోఁ గొన్నిటిని మాత్రము మనయాంధ్రమహాకవులగ్రంథములనుండి యెత్తి చూపుచున్నాను:—*నక్షత్రచిహ్నముగలవి చోడకవిగ్రంథమునను గలవు.

*విగుర్వించు, *కెలసము, తావు-నన్నయభట్టారకుఁడు.
*అగుర్వు, *గండరువు, *కెడ్బరసు-తిక్కనసోమయాజి.
దిశాపట్టము, టోపి—నాచనసోమనాథుఁడు.

*ముడి, తావు—మంచన

జాళువా, సరిగె—రంగనాథుఁడు.

*గట్టివాలితి, విభాళించు—ఎఱ్ఱాప్రెగ్గడ.

నిరాణ, బతళి—పండితమల్లికార్జునుఁడు.

జగజంపు, సామాన్లు, ఖుసిమీఁలు, * కెడ్బెరసు—శ్రీనాథుఁడు.

పచ్చనిహురుమంజిపనివాగె పారసిపల్లెంబు—పెద్దన.

బిజయూడు దేవర నిజకృపామహిమఁ జెన్నారు నాయిల్లు బిడారు నీకు—బేకు—ధూర్జటి.

అంచనా, ఖండా, దసిలీ—పింగళిసూరనమంత్రి.

దివాణము, తింగణా—కృష్ణదేవరాయలు.

మొదలారి, పుంజాలదండ—తెనాలి రామకృష్ణుఁడు.

ముసలిమాన్యాదులనేకములు—రామరాజభూషణుఁడు.

హేజీబు, హుజూరు—కాకమాని మూర్తికవి.

పిల్లారి, సాహేబు—సాంబనిఘంటువు—రంగకవి.

హజారము, అసాదు-రామభద్రయ్య రామాభ్యుదయము

హిజార్యాదు లసంఖ్యాకములు—కదిరీపతి—శుకసప్తతి.

ఈవిధమున నన్యదేశ్యముల నుపయోగింపని యాంధ్ర కవి యొక్కఁడును లేఁడు! ఒక్కయాంధ్రముననే కాక యెల్ల భాషలయందును అన్యదేశ్యపదము లనివార్యముగఁ బ్రవేశించి యున్నవి. వివరణ మనావశ్యకము.

మఱియు వీరేశలింగముగారు,

"చెనసిగుణమైనదోసంబు సేయనేర్చుఁ
గుకవి గృతులందు దోసంబు గుణముసేయ
నేరఁ డడియట్లు దొంతులు సేరి నాయి
దోర్పనేర్చుఁగా కది యెట్లు సేర్పనేర్చు ?"

అనుపద్యము నుదాహరించి, "ఇతఁ డనావశ్యకముగా 'కుక్క' యనుటకు మాఱుగా 'నాయి' యనునన్యభాషా పదమును బ్రయోగించియున్నాఁడు." అని వ్రాసినారు.

ఇక్కాలమున కెరోసినాయిల్, టైమ్, లాంతరు, చిమ్నీ మొదలగు వానివలె, అక్కాలమున 'నాయి' మొదలగునవి జనులతలవాకిళులయందు చనవుగా నిరంతరముదిరుగుచుండిన వై యుండును. పూర్వకాలమునందు అన్యభాషాపదములప్రయోగము దూష్యమై యుండదు. ఉండెనేని నన్నిచోడ నన్నియ, తిక్కనాదిమహాకవు లెల్లరును నేల వానిని ప్రయోగించి యుందురు ?

౨. దేశీయపదములు

శబ్దరత్నాకరాదినిఘంటువుల కెక్కియుండని దేశిపదములు కొన్ని కవిరాజశిఖామణి గ్రంథమునఁ గానవచ్చుచున్నవి. ఆనాఁడు నిఘంటుకర్తలకు లభింపని గ్రంథములు కొన్ని యీనాఁడు లభించుచుండుటచే వానియందు చోడకవిశబ్దములు కొన్ని యిప్పు డిప్పుడు చిక్కుచున్నవి. ప్రాచీన కోశ కాల

మింకను బయలుపడు నేని మఱికొన్నిప్రయోగములు దొరకొన వచ్చును.

నన్నిచోడనిపాత్తములోని దేశ్యపదములను కొన్నిటిని గాంచి, యవి నిఘంటువులయందు గానరాకుండుటచేఁ గాఁబోలు, శ్రీయుతులు బుఱ్ఱా శేషగిరిరావు పంతులు ఎం. ఏ. గారు, 'ఇక్కవి పన్నిపట్టి ప్రాఁతమాటలను ప్రయోగించె' నని వ్రాసియున్నారు. కీ. శే. వీరేశలింగము పంతులుగారును 'ఇక్కవి గ్రాంథికభాషలోను, వ్యావహారికభాషలోనుగూడ లేని యప్రతీతపదములను వాడినాఁ' డని శేషగిరిరావుగారి వ్రాఁతను పోషించినారు.

కాలము క్రమించినకొలఁది నెల్లభాషలయందును లోకవ్యవహారకవిప్రయోగాదుల ననుసరించి కొన్నిపదములు ముచ్చుముడుఁగుచుండఁగా, కొన్నిపదములుతలసూపుచుండును. ఇది భాషాస్వభావము. వేదములనాఁటిభాష పురాణముల నాఁటికి కొంతమాఱుపాటు నొందినది. పురాణములనాఁటిది కావ్యనాటకాదులనాఁటికి కొంతవేషాంతరమునుదాల్చినది... ......ఇట్లే నన్నిచోడనినాఁటిభాష నన్నియభట్టునాఁటికిని, నన్నయనాఁటిది తిక్కననాఁటికిని, తిక్కననాఁటిది శ్రీనాథుని నాఁటికిని, శ్రీనాథునినాఁటిది రాయలనాఁటికిని, రాయల నాఁటిది తిమ్మకవినాఁటికిని, తిమ్మకవినాఁటిది నేఁటికిని క్రమముగా నస్తమితశబ్దములతో, ఆవిర్భూతపదములతో,

నభినవప్రయోగములతో నానారూపధారణము నొనర్చు కొనుచు వచ్చినది. చూడుఁడు.

నన్నియనాఁటి 'పరువఱించుట'లు, రంగనాథుని నాఁటి 'దూరడించుట'లు, తిక్కననాఁటి 'లేటమొగమువడుట'లు, సోముని నాఁటి 'బైసికవెట్టుట'లు, మంచననాఁటి 'కీసుత కొట్టుట'లు, ఎఱ్ఱననాఁటి 'విభాళించుట'లు, శ్రీనాథుని నాఁటి 'పాతలించుట'లు, రామలింగని నాఁటి 'కావడించుట'లు, పూర్వులనాఁటి కంపు (సువాసన) నింపుట'లు.........మన మిప్పు డెఱుఁగము. ఇట్లే నన్నిచోడని నాఁటి—

"మొసరుమునుఁగఁగొనుటలు, పేర్బిందులు దండఱించుటలు, సొంపుకర్కుక్కుటలు......" నన్నయాదులకు సుపరిచితము లైనపదము లై యుండకపోవచ్చును. మఱియుఁ జోడకవి చంద్రుని నాఁటి;

౧. 'నడునడ నడంగుట'లు నన్నియనాఁటికిని, ౨. 'లగ్గ బెగ్గడిల్లుట'లు తిక్కననాఁటికిని, 3. 'పేటంబేటంబగుట'లు కేతననాఁటికిని, ౪. 'తాడిడిపండు గొనుట'లు మంచననాఁటికిని, ౫. 'కీడ్పరసగుట'లు శ్రీనాథుని నాఁటికిని, ౬. 'కావడించుట'లు రామలింగని నాఁటికిని.........

అస్తమితపదములు గాకపోయియుండవచ్చును. మఱియు, కవిరాజశిఖామణి గ్రంథమున ప్రాంతమాటలు, అపరిచిత పదములు, అపూర్వపదములుగాఁ గానవచ్చుచున్న వని

మనుకొనుచున్న పదములలోఁ గొన్నిటికి నిప్పు డిప్పుడు ప్రయోగము లితరకవుల గ్రంథములలో లభించుచున్నవి. అందు గొన్నిటి నిచ్చటఁ జూపుచున్నాను.

బడరుఁడు, మేలిల్లు—శివతత్త్వసారము (పండిత మల్లికార్జునుఁడు.)

కంబకట్లు; సమూహి—బసవపురాణము (పాల్కురికి సోమనాథుఁడు.)

దావగొనుట, తొప్ప—నిర్వచనోత్తరరామాయణము

ఆఁకగొలుపుట, ఊఁపటలాడుట—సోమునిహరివంశము

పట్టువఱుచు, తఱుసంటి—సభాపర్వము.

పరముఁడు, పటిచుంచు—ఆరణ్యపర్వము.

అనురాగిల్లు, ఆలించివిను—ఆదిపర్వము.

కనుఁబేటము, ఏటము, కోసనపుచ్చు—దశకుమారచరిత్రము (కేతన.)

బిందము-కావ్యాలంకారచూడామణి-విన్నకోట పెద్దన.

కలుచు—కేయూరబాహుచరిత్రము—మంచన.

పూన్చు (సమర్పించు, పూజించు)—పా॥ సోమన, పండితారాధ్యుఁడు.

బండఁగి—కకుత్స్థవిజయము; మనుచరిత్రము.

వకరించు—దత్తి—ప్రాచీనశాసనములు. మొ॥

నిఘంటువులలోఁ జేరనియంతమాత్రమున నివి యప్రతీత

పదము లైనవా ? పైపదములు మొదలగునవి యన్నియు మనకు నప్రతీతపదములుగాని, కవినాఁటికి వ్యవహారాదుల యందున్నవే !

## ప్రాఁతవడ్డమాటలు

నన్నిచోడదేవుని గ్రంథములోని యపరిచితము లైన (నిఘంటువులలో లేవి) శబ్దములను గొన్నిటిని గాంచి— తిక్కననిర్వచనోత్తర రామాయణములోని "పలుకులపొందు లేక ......" అను కుకవినింద గలపద్యమునందు గానవచ్చు 'ప్రాఁతవడ్డమాటలు' అనుపాఠమును గ్రహించి, మనకసంబ్రమని శబ్దములకును, ఆ 'ప్రాఁతవడ్డమాటలకు'ను సంబంధమును గల్పించి, తిక్కన దిట్టిన కుకవి, నన్నిచోడదేవుఁడే, యైయుండు నని భావించి, శ్రీశేషగిరిరావుపంతులుగారును, (వారినిబట్టి) వీరేశలింగము పంతులవారును మనకవిని నిందాపాత్రుఁ గావించిరి.

నిర్వచనోత్తర రామాయణము వ్రాఁతప్రతులఁ గొన్నిట "భ్రాంతిపడ్డమాటలు" అని యున్నది. తిక్కనమహాకవి వ్రాసిన దిదియే యై యుండును. కాలక్రమమున లేఖకులు కొన్నిప్రతులకు 'ప్రాఁతవడ్డమాటలు' అను పాఠము ప్రసాదించినారు. ఆతప్పుపాఠమే ముద్రణమునకును, నిఘంటువుల కును నెక్కిపోయినది ! అదియే యీవిమర్శకులకు నిట్టిభావ మును పొడమించినది.

తిక్కనార్యుని 'పలుకులపొందు లేక ...' అను పద్యములోని యొకవాక్యమైనను కవిరాజశిఖామణి కనువర్తింపదు. 'ప్రాఁతవడ్డమాటలు' అను పాఠము బొత్తిగా నిలువదు. ఇవ్విషయములెల్ల కుమారసంభవకవి కవిత్వతత్త్వవిమర్శమునఁ జర్చింపఁబడును.

## ఛందోవ్యాకరణవిశేషములు

నన్నిచోడరాజకవికాలమున ఛందోవ్యాకరణాది నిబంధనము లెట్టుండెడివో తెలుపు శాస్త్రగ్రంథము లెవ్వియు నీనాఁడు గానరావు. లక్షణగ్రంథము లనేకహేతువులచే ననేకములగుమార్పుల నొందుచువచ్చిన వనుట యెల్లరకుఁ దెల్లము. కవిరాజశిఖామణిప్రయోగములకును, నన్నయతిక్కనాదుల ప్రయోగములకును పెక్కుచోట్ల సామ్యముగాననగుచునే యున్నది. భిన్నములుగా నగపడుచున్నవానిలోఁ గొన్నిటిని మాత్రము సంగ్రహముగ నిచ్చటఁ బ్రదర్శించుచున్నాను.

### ఛందోవిశేషములు

(అ) గణము—౧,

చ. "అలకలఁ జిన్నిపూ వలికి
నంతనె మోము సెమర్పఁ జన్నుఁగ్రే
వల మృదుపత్త్రిభంగములు
వ్రాయుచుఁ గొ నసియాడు లగ్గ న

మ్మొలుఁతకు మాధవీకుసుమ
మేఖల గట్టుటయున్ వణంకు నూ
రులు నిజ మింత గోమలి మ
దుప్రసవాస్త్రపాతిం జలింపదే ?"

కుమా. 5 ఆ. 612.

మ. "మన మూరంగ నొకక్షణంబయిన నిక్
మర్త్యుండు భావించి......"

10 ఆ. 459.

ఇందు 'మదు—ఒక' అను వికృతపదములు, 'ప్రసన్న, క్షణము' అను ప్రకృతిపదములతో సమసించుచున్నవి. మిశ్రసమాసములయందు ఉత్తరపదాది నున్న సంయుక్తాక్షరము తనకుఁ బూర్వ మున్న యక్షరమును గుర్వక్షరముగాఁ జేయనేరదని మనయిప్పటిలక్షణగ్రంథములు శాసించుచున్నవి. చోడకవికాలమునాఁటికి నిట్టిశాసనము పుట్టియుండలేదనితోఁచెడిని. కర్ణాటగ్రంథములయం దిట్టిప్రయోగము సాధువుగా నే యెన్నఁబడును. మఱియు, తెనాలి రామకృష్ణుని,

"ఎ. గీ. వెలయుమంగయగురువభూవిభునిపెద్ద
సంగభూపాలమణి ప్రాయసప్రవృత్తి..."

పాండు. ప్ర. 20.

అనుదానిలోని 'ప్రాయసప్రవృత్తి' అను ప్రయోగము నిట్టిదే.

(౨) ఎడ్డ—

శా. “ శ్రీరామేశగహేశ్వరాదు లెడ్డ నీ
శ్రీపాదముల్ భక్తితో
నారాధించి సమస్తలోకసముదా
యాధీశులై రన్న సం,
సారుల్ దుఃఖనివారణార్థ మభవున్
సర్వేశు లోకత్రయా
ధారు న్నిన్నదిఁ గొల్వ కున్కి యుఱవే
దారిద్ర్యవిద్రావణా ! ”

కుమా. దశ. 455.

‘ ఎడ్డ ’ అను పదము రెండుఁలఘువులు గలదిగా నన్ని చోడనిగ్రంథమునఁ బెఱుచోట్లఁ బ్రయోగింపఁబడియున్నది. దీనినిగూర్చి వీరేశలింగముపంతులవారు,

“ఈపుస్తకములో నిప్పు డున్నట్లు ‘ ఎడ్డ ’ అని యుంచిన చో గణభంగము గలుగుచున్నది. ఎడఁద, ఎద, ఎడ, ఎడ్డ అని నాలుగురూపము లుండఁగా నిర్బాధకమైన నడిమిరెండు రూపములలో నొకదానిని వేయక సబాధకమైన ‘ ఎడ్డ ’ అను రూపమును వేసి ‘ ఇందు డకారమును దేలఁబలుకవలయును ’ అని టిప్పణ మేల వ్రాయవలెను ? ఇట్టియసాధారణరూపము వేసినంతమాత్రమున నిది యత్యంతపురాతనగ్రంథముగాఁ గల్గు నా ? ” అని వ్రాసినారు.

అచ్చుప్రతులలోని 'ఎడ్డ' అను రూపము సరు. మాఱుగా వ్రాఁతప్రతిలో 'ఎడ్డ' అని కలదు. 'ఎడ్డ' అని యుండవలయు ననియే తోఁచెడి. ఏరూపమున్న నేమి? ఇందు డకారమును దేలఁబలుకవలసినదే! 'అట్లు తేలఁబలుకుట సరి యగునా, కాదా?' అనునదియే యిప్పుడు విచారణీయ మగువిషయము.

ఆంధ్రమహాభారతాది పురాతనగ్రంథముల పూర్వపు వ్రాఁతప్రతులయందు దేలఁబలుకవలసిన యిట్టిరూపము లనేకములు గలవు. అందు గొన్నిటి నిచ్చటఁ జూపెదను:—

(౧) ఎడ్డ—"క. తగు నిది తగదని యెడ్డలొ, వగవక ..."

(ఆదిపర్వ. ప్రథ. 85 వ్రాఁతప్రతి)

"కొనకుం ద్రైలోక్యవిజయుఁ,
బడయుదు నని ఘోరమగుతపం బొనరింపం
దొడఁగె సురరాజు నెడ్డలొ
నిడికొని యేకాగ్రబుద్ధి ............"

(ఆదిప పం. 120. వ్రా. ప్రి.)

పైవానియందున్న 'ఎడ్డ' అనుదానిలోని 'డకారము'ను దేలఁబలుకవలయును. కాలక్రమమున లేఖకులు దీని యుచ్చారణము దెలియక గణభంగము గలుగుచున్న దను భ్రాంతిచే నందుల డకారమును దీసివైచి 'ఎడ' అని కొందఱు 'ఎడ' అని కొందఱు వ్రాయుచు వచ్చినట్లు దోఁచుచున్నది.

కావున 'ఎడ్డ' అను నదియే ప్రాచీనరూపము. అత్యంత పురాతనగ్రంథమును జేయుటకు మఱెవ్వరును వేసినరూపము గాదు. ఎట్లును ప్రాంతపుస్తకము'కొత్తపాత్త్రమును గానేరదు!

(౨) తొడ్గి-చ. పొలుపుగఁ గట్టి, పూసి, తొడ్గి, భూరివిభూతి...

భారత. ఆదిప. (వ్రాఁతప్రతి.)

ఇందు, 'తొడ్గి' అనుదానిలోని 'డకారము' దేలఁ బలుకకున్న గణభంగమగును. ఈరూపమును పై హేతువుచేత 'తొడి' క్రింద మాఱిపోయి 'తొడు' అను ధాతువును బుట్టించినది!

(3) మొగిడ్చి-సీ. గీ. అందు గొంద అధికహాస్యంబు సేసిరి
యడవి నేమిరోసెదనిరి కొంద
అవ్వ నీవు వేల్పవగు దని కొందఱు
మొగిన కేలు మొగుడ్చి మ్రొక్కిరంత.

ఆరణ్య. ద్వి. 102.

ఇందు 'మొగుడ్చి' అనునది 'మొగిచి' అను రూపాంతరమును ధరించెను! (ఇట్లే వ్యవహారమున 'కదల్పు' అనునది 'కదపు' అయినది! ఇట్టి వింకను గలవు.)

(౪) ఎడ్రుచు, అడ్రుచు, పడ్రుచు, విడ్రుచు, చిడ్రుపలు-వీని నేల తేలఁబలుకవలయును? అట్లే 'ఎడ్డ'ను! ఇంతయేల? లేఖకులకుఁ గాని, పరిష్కర్తలకుఁగాని మార్చను—దిద్దను శక్యముగాని యుద్ధమల్లుని బెజవాడ శాసనము శిలాక్షరముల లోని,

“గొరగల్గా, కొరు లిందు, విడిసి, బృందంబు గొనియుండు, వారు...”

అను మధ్యాక్కరపాదమును గనుఁడు! ఇందు ‘గొరగల్గా’ అను మొదటి గణములోని ‘అకారము’ను దేలఁ బలుకవలయును. ఇందు ఒకమాత్ర యెక్కువ యైన దని తత్ప్రకాశకులు వ్రాసియున్నారు గాని పైవానివలెనే దీనిని సయితము దేలఁబలుకుచో మాత్రయు నెక్కువరాదు. మధ్యాక్కరలక్షణమును క్రొత్తగా సృజియింప నక్కఱయు నుండదు. *

కన్నడభాషయందు నిట్టియుచ్చారణము గలదు:—

మ. ముగిలం ముట్టిద పెంపు పెంపనొళకొం
డుద్యోగ ముద్యోగదొళ్
నెగళ్దాజ్ఞాబల మాజ్ఞెయొళ్పొడర్దగు
ర్వాందొం దగుర్విం దగు
ర్వాగ్గొ ళత్తి ర్పరిమండలం.........

పంపభార. ౧ ఆ.

---

* తక్కినపద్యములవలె మధ్యాక్కరలనడక సరిగాఁ బట్టువడమిఁ బూర్వలేఖకులు పెక్కుమార్పులు గావించినారు. వానిం గని యిప్పుడు గొందఱు మధ్యాక్కరల లక్షణములను క్రొత్తగా సృజియింపఁ జూచు చున్నారు!

క. జగదొళగిదొందుమిగిలెనె,
నెగళ్దిర్దుదు వేంగివిషయమా విషయదొళాళ్ ..."

ఛందోంబుధి.

(క) యతి:—ఈతనిగ్రంథమున నన్నియాదులయతులకు భిన్నములుగా నున్నవి గానరావు. కాని, నన్నియకును, చోడకవికిని నొకశబ్దమునమాత్రము యతిభేదము గానగుచున్నది:—

"చ. అనిశము గ్రమ్ముపుష్పమధు
వ్రశుజలంబుగఁ గొమ్మ లెక్కి జో
రనఁ జెలరేఁగుపక్షిరవ
మార్తరవంబుగ ..........."

కుమారసం. పం. 562 ప.

ఇందు "జోరు+అనఁ" అని ఛేదముగ నన్నిచోడకవిరాజు, స్వరమునకు యతిఁ గూర్చినాఁడు. ఆతనిగ్రంథమున మూఁడుచోట్ల నీశబ్దము స్వరమునకే యతి గూర్పఁబడియున్నది. (325, 955-ప్రథమభాగము.)

నన్నయభట్టారకుఁడు,

"క. మనుజేశ్వరు లెల్లను జో
రన దమయంతీస్వయంవరము గను వేడ్కన్

జను దెంచిరి సైన్యస్యం
దనఘుట్టన నవనితలము దల్లడపడఁగన్."
ఆరణ్యా. ద్వి. 29.

అని వ్యంజనమునకు యతి నిల్పినాఁడు.

ఈరీతి మూఁడుచోట్లను నన్నియ దనగ్రంథమున బో; రనశబ్దము వ్యంజనమునకే విశ్రమము ఘటించినాఁడు. తిక్కన 'బో, రన' ను యతిస్థానమున నిల్పినప్రయోగము గానరాలేదు. కేతనకవి తనదశకుమారచరిత్రమున,

చ. "కనుకనిఁ దూలఁదోలి బల
గర్వమునం దలపడ్డవారలం
దునియలు సేసి యొండొరుల
దోర్బలసంపదఁ జెప్పికొంచు బో
రనఁ గటకంబు వెల్వడి నృ
పాత్మజువేలముఁ జొచ్చి మంత్రినం
దనుఁ డగుమానపాలు నుచి
తంబుగఁ గాంచి యనాకుల స్థితిన్."
(దశకు. 4ఆ. 22.)

అని యచ్చునకే విరతి గల్పించినాఁడు.

(౫) ప్రాసము—

చోడకవిరాజుపొత్తమునఁ బ్రాసభేదములు (ఇప్పటి లక్షణమునకు నందనివి) కొన్ని గలవు:—

ఉ. ౧. వీంగునపారసత్త్వగుణ
విస్ఫురణం బరమేశ్వరోరువా
మాంగమునందు మున్నదయ
మై నియమస్థితిఁ గొల్చితద్దయుఁ
లోంగొని పేర్మితో నిఖిల
లోకములం దగఁ గాచుచున్నవే
దాంగు ననంతు విష్ణుఁ గమ
లాధిపు సంస్తుతిఁ దేల్చి సన్మతిఁ.

కుమా. ప్ర. 4 పం.

ఇత్యాదిపూర్ణాపూర్ణబిందుప్రాససంఘటన మీపాల్కురికి కవి గ్రంథమునఁ జూపట్టుచున్నది. నాయెఱింగినంతవఱకు పాల్కురికి సోమనాథుని గ్రంథములయందు మాత్ర మిట్టి ప్రాసముగలదు. శివతత్త్వసారమున నిట్టిప్రాసముగానరాలేదు. ఇది పురాతనలక్షణమునకుఁ జెందినప్రయోగ మనియు, నన్నియాదులు దీనిం ద్రోచివైచి రనియు, పాల్కురికి సోమన మాత్రము శైవుఁ డగుచోడకవి ప్రయోగమును గౌరవించె ననియుఁ దోఁచెడిని.

౨. న. ణప్రాసము:—

ఈప్రాసము పూర్వకాలమున నాంధ్రకవు లందఱు చేతను బ్రయోగింపఁబడియున్నట్లును, లక్షణగ్రంథకర్తలు దాని కఁ గొన్నినియమము లేర్పఱిచి, యానియమములను లోంగని

వానిని సవరించి వైచుచు వచ్చినట్లును గన్పట్టుచున్నది. దీనిం గూర్చి యప్పకవ్యాదులుపడినపాట్లు శోచనీయములై యున్నవి. వానివివరణమున కిందు చోటులేదు. ఆయాలక్షణగ్రంథములను గనుఁగొన్నచో న ణ ప్రాసము సాధువే యని తోఁపఁ గలదు.

"క. వేణుజమౌక్తికములు దొగ్గి *
వీచుల కింపెసఁగ నెఱుకు వెలఁదులు..."

నన్నెచో. కుమా. ప. 705.

"సీ. భూరితరోగ్రగంభీరాబ్ధు లణఁగించు
సౌర్వాగ్ని కెంత నీహారకణము?
ఘోరకాంతారసంహారకారణ మగు
వనవహ్ని కెచ్చటఁ దృణకణంబు."

దశ. 537.

ఇత్యాదులు కుమారసంభవమున వ్రాఁతప్రతియందు గలవు. (ముద్రితగ్రంథమున వీనికి వేఱుపాఠములు గలవు.)

నన్నయాదులును న ణ ప్రాసమును గూర్చియేయున్నారు.

ఎ. గీ. దుర్నయమున శకుని * కర్ణదుశ్శాసనుల్..."

ఆదిప. 3 ఆ 12 ప.

తే. గీ. దుర్నిమిత్తముల్ పుట్టిన * నిర్ణయించి..."

ఆరణ్య 1 ఆ 49 ప.

---

* ఇక్కడ డకారమును దేలఁబలుకవలయును.

క. కణ్గంచు లేఁచిపెట్టిన, దుర్నయపరులైన ...''

ఉద్యో. ద్వి. 248 ప.

ఇత్యాదిప్రయోగములు గోచరించుచున్నవి. ఇంకను బలువురచే సవరింపఁబడిన వెన్నియో యుండియుండును.

3. త్రి, త్న ప్రాసము:—

ఎ. గీ. " చిత్రవర్ణాతిశయనూత్నరత్నచిత్రి, తాంగరంగవల్లి సురంగాంగణములు ...'' కుమా. స. 987.

ఇదియు ప్రాచీనప్రయోగములలోఁ జేరుచున్నట్లే తోఁచుచున్నది. నన్నయభట్టు,

" శల్యుఁ డట్లు నేలఁ ద్రెళ్లి చెచ్చెర లేచి. ''*

అని వ్రాసియుండఁగా లక్షణగ్రంథకర్తలు సెల్లుఁ' డనువికృతిని బుట్టించిరనితోఁచెడి. శైవగ్రంథ మగుటచేఁ గాఁబోలు, పాల్కురికి సోమనాథునిబసవపురాణము పలువుర చేతులఁ బడక దానిలోని,

" అక్షణంబునఁ బంచభక్ష్యము లుడిచి ' ఇత్యాది ప్రయోగములు సవరింపఁబడియుండలేదు.

ఇట్టిప్రయోగము లింకను గలవు. గ్రంథవిస్తర మగు నని ప్రస్తుతము నిల్పితిని. నన్నయతిక్కనాదులమూలగ్రంథ

* అనేకములగు వ్రాఁతప్రతులందును, పూర్వతరముద్రణములందును శల్య' అనియే యున్నది.

ము లిప్పుడు చిక్కుమింజేసి వారి వివిధ ప్రయోగ ము లెట్లుండెడివో తెలియఁజాలము.

"ప్రాస స్సర్వేషు చ, ఏక ఏవ స్యాత్" అను నిబంధనము యుక్తియుక్తమైనదే. కాని యది పూర్వకవులను శాసింపనేరదు. పూర్వకవులే యేవిధముల వేనిని బ్రయోగించుచు వచ్చిరో తరువాతిలక్షణగ్రంథకర్తలు వాని నెట్లెట్లు శాసించుచు వచ్చిరో, ప్రాచీనప్రయోగము లెట్టిమార్పులను జెందుచు వచ్చినవో యెఱుఁగ నభిలషించు భాషాచరిత్రకారులకుఁ దెలియరాకుండ మనవారు వానిని దాఁచుమాఱ్పొనరించుచు వచ్చుటమాత్రి మెట్టివారికిని విషాదముఁ గలిగింపకమానదు. లక్ష్యలక్షణాదు లన్యోన్యము క్రమాభివృద్ధి నందుచు వచ్చెనటుట సమంజసము గాని, కవిత్వ మొక్కమాటే (కమ్మచ్చునఁ దీసిన బంగారుతీవవలె) నిర్దుష్టతతో నావిర్భవించిన దనుట న్యాయ్యమా ?

ద్వితీయభాగము 356 పద్యమున నున్న వ్వ, వ ప్రాసమును బైవానియట్టిదే.

"క్రొవ్విరి, ఎవ్వరి, యావన, తివ్వఁడు" (కుమా. నవ. 356)

ప్రాచీనకవులయిట్టిలక్ష్యములను గాంచియే,

"నవ్వుచు, యావన, ఉవ్విళ్ళులు, ఇవ్విధము." (భోజరాజీయము. సప్త. 108)

అని యనంతామాత్యుఁడు (ఛందోదర్పణలక్షణ గ్రంథకర్త)

"ఎవ్వారి, యావన, ఇవ్వన, నెవ్వగ" (ఉత్తర హరిశ్చం. ద్వి. 49)

అని తక్కెళ్ళపాటి లింగనామాత్యుఁడు, మొదలగు కవీంద్రు లిట్టిప్రాసములను గూర్చియున్నారు.

(౮) శ స ప్రాసము (?)

క. "ఏసియు......, వేసరక...విడువక కేసా, కేసి......ను, హాసురముగ......... కుమా." ద్వా. 949.

వ్రాఁతప్రతియందు 'కేసాకేసి' యని యున్నది; అచ్చుప్రతియందు 'కేశాకేశి' అని యున్నది. అచ్చులోని పాఠమును జూచి వీరేశలింగముపంతులనారు, నన్నిచోడఁడు శ స ప్రాససాంకర్యముఁ జేసినాఁడని వ్రాసినారు గాని, యక్షి శాల—జన్నసాల మొదలగువానివలె, 'కేసాకేసి' అనునది వికృతపదమై యుండు నని తోఁచుచున్నది. ఇక్కావిగ్రంథమున నిది దప్ప నిట్టిప్రాసము వేఱొకటి లేదు. మఱియు, నీ శ సల యుచ్చారణము పూర్వకాలమున మన భరతఖండమున నెట్లుండెనో కాని యిప్పుడు కొన్ని దేశములయందు శ—స—, ష—స—ల యుచ్చారణము భిన్నముగా వినఁబడుచున్నది. వేషము, వేశము, వేసము, కోసల, కోశల, కోషల; శాసనము, శాశసము, సాసనము—ఇత్యాదులు. ఇది యిట్లుండ

యీక్రిందిమహాకవి ప్రయోగములు శసల ప్రాసమైత్రిగలవి కొన్ని తాళపత్త్రగ్రంథములయందు గానంబడుచున్నవి.

క. “ ఆసభ నమ్మోయి..., డై శంక లేక...” భార. స్త్రీపం
క. “ రాసాబగున నుస్మత్తుం, డై శంకింపక...” నిర్వ. వ. 11
క. “ కంసునిబాధలకు..., వంశము......” ఎఱ్ఱనహరివం.
పూ. భా.
శా. “సంహారభ్రమ..., వంశంబు...” శ్రీనా. హరివి. ద్వి.

పై శస ప్రాససాంకర్యము లేఖకులే చేసిరో, కవుల నాఁటి కది నిర్దుష్టమై యుండెనో నిర్ణయింపరాదు. కాని విరళముగ నున్న పైప్రయోగాదులనుబట్టి శసప్రాసమును నిర్ణయించుటకంటె, తిక్కనప్రయోగములలో (కొందఱు ముద్రింపించినట్లు) మొదటిదానిని ‘సంకు—సుంకు’ అనియు, రెండవదానిని ‘సెంకింపక’ అనియు—ఎఱ్ఱనశ్రీనాథుల ‘వంశము’ అనుదానికి ‘వంసెము’ అను వికృతి యుండెడి దేమో యనియు గ్రహించుట యుక్తమని తోఁచుచున్నది.

౫ రేఫద్వయమైత్రి—ఇది నన్నిచోడనిగ్రంథమున నెచ్చటను గానరాదు.

నన్నిచోడనన్నయభట్టారకాది ప్రాచీనకవులగ్రంథముల యందు రేఫద్వయమునకుఁ గలయిక గానరాదు. అక్కాలముల వాని లేఖనోచ్చారణములు భిన్నముగా నుండునట్లును, తిక్కనాదులకాలమున కవి సడలినట్లును చూపట్టుచున్నవి

ఈ రేఫద్వయమైత్రినిగూర్చి మనలక్షణగ్రంథకర్తలు పొందిన భిన్నాభిప్రాయములును, తాళపత్త్రగ్రంథజాలమునఁ గలవ్రాఁత లను నమ్మి వారు పొందిన పొరఁబాట్లును విస్మయవిషాదము లను గలిగించుచున్నవి. వానిని దెలుపుట కిచ్చట నిమ్ము చాలమి విరమించితిని. (కొన్నిశబ్దములలోని రేఫములకు ద్వైరూప్యములు గలవని చెప్పువారికిఁ దిక్కనాదులప్రయోగ ములే పెట్టుఁగొమ్ము లయినట్లు కన్పట్టెడిని.)

## వ్యాకరణవిశేషములు

బాలవ్యాకరణసూత్రములను గొన్నిటిని సవరించుచు, ప్రౌఢవ్యాకరణసూత్రములను గొన్నిటిని బోషించుచు సంపూ ర్ణాంధ్రవ్యాకరణ మావశ్యకమే యని ఘోషించుచుఁ గొన్ని ప్రయోగము లిమ్మహాకవిగ్రంథమున గోచరించుచున్నవి. వానిలోఁ గొన్నిటినిమాత్ర మిచ్చట సంగ్రహముగఁ జూపు చున్నాను:—

౧. "లుక్సంశ్లేషౌ నాచి ద్రుతస్య—ద్రుతమున కచ్చుపరం బగునపుడు లోపసంశ్లేషంబులు లేవు" వ్యా. సూ.

(మొదట—'ద్రుతము'—అను దానిస్వరూపమే పెద్దవివాదములోనిది. దానివిచారణమునుమాని మనయాంధ్ర వ్యాకరణకర్తల యర్థమునకు గుఱియైనదానినే యిచ్చట వ్యవహరించుచున్నాను.)

సీ. "మనకులదైవ మన్ మన్న లే దేని
త్రిభువనారాధ్యుఁ డన్ తెంక లేక
పరమయోగాత్ముఁ డన్ భక్తి లే దేనియు
సర్వేశ్వరుం డను శంక లేక
యజశిరోదళనుఁ డన్నదరు లేదేనియు
గాలారి యను నోటకొండ లేక
విషమాంబకుండను వెఱపు లేదేనియుఁ
బ్రళయాగ్నినేత్రుఁ డన్ భయము లేక
(కుమా. చ, 41౧)

ఉ. పొన్నలు పూచెఁ బొన్న లోఁగిఁ
బూవకముందఱ పూచె గోఁగు లా
పొన్నలుఁ గొండగోఁగులును
బూవకముందఱ పూచె బూరువుల్
పొన్నలుఁ గొండగోఁగులును
బూరువులు న్నొగిఁ బూవకుండఁగా
మున్న వనంబునం గలయ
మోదుగు లొప్పఁగఁ బూచె నామనిన్.
(కుమా. చ. 447.)

(బూరువులున్ + ఒగి = బూరువులున్నొగి)—'ఇల్లేమి త్రావి
కొను న్నెలమావి' (కుమా. చ. 453.)

ఇట్టిప్రయోగములు నన్నియాదులగ్రంథములయందును గలవు.

సీ. పా. “తత్కూపమున విలసత్కూలఘనవల్లి
యనిష్టసఖ నూఁది యున్నదాని”
ఆదిప. తృతీ. 140.

మ. “అనిలం బప్పరి ... ... ... ... ... ... నం
దిని యన్నేటితరంగలం బెనఁగుచున్ ... ... ... ...”
ఆది. అష్ట. 79 ప.

సీ.పా. “కరణంబు గర్మంబు గర్త యన్నేతద్వి
రాజితకారకత్రియము చేత”
అశ్వమే. ద్వి. 51.

ఇట్లే మహాకవులందఱు నీసంధి నంగీకరించినారు. చూ. ప్రౌ. వ్యా. సం 3, 9. గీర్వాణభాషయందు నిట్టిసంధి గలదు. ఉదా:—“శీతేనావ్యథయ న్నివ” (శ్రుతిః)—“తస్మిన్నద్రౌ” (మేఘసం)—ఇత్యాదులు.

(౨) సంస్కృతవిభక్తిప్రయోగము:—

ఎ. గీ. పంచె నట్టియుగ్రపై నున్న... ...లగ్గ
వచ్చునే “ప్రధానవైరేణ మరణంబు
ధ్రువ” మనంగ వినఁడె దివిజవిభుఁడు.

ఇందు సంస్కృతవిభక్తితోఁ దెలుఁగుపదముల కన్వయము.

(3) అనుకరణవైచిత్రి :—

క. "గిరిసుత దొలుపలుకుల సు
స్వర మొదవఁగ "నోం నమశ్శివాయ సదాస్మ
ద్వరదాయ నమః; శంకర
శరణు, మహాదేవ నీవ శర" యనఁ జొచ్చెన్."

కుమా. తృతీ. 217

ఇందు సంస్కృతాంధ్రములకు రెంటికి నొకేయనుకరణము!

"మనుజాశనులఁట! బలులఁట!
మునులఁట! యజ్ఞంబులఁట! నమోవిశ్వసృజే
విన మెన్నఁడు మున్నిట్టివి
కనికని కొత్తవ్వఁ డింటికంబము సేసెన్."

సోమునిహారివం. -పరీక్ష.

"అంటితి నమశ్శివాయ పాపాత్మురాలి......"

జైమినిభా.

"ఆరగింపుఁడు లెండు మీ కమృతమస్తు" శ్రీనాథుఁడు.

"బ్యా,హా పాటచ్చర! రామదాస! తవదా
సోఽహమ్మరున్నందనా!"

మరున్నందనశతకము.

ఇత్యాద్యనుకరణవిరహితంబులు ప్రయోగంబు లందందు చూపట్టుచున్నవి గాని పై ప్రయోగవైచిత్ర్యము మాత్రము మృగ్యమై యున్నది.

(ర) 'నఃకౌ'—"కువర్ణకంబు పరం బగునపు డుకారఋ ఋకారంబులకు నగాగమం బగు" అని వ్యా. సూ.

చ. "నడు మన దింతి......త
నన్నున ముందఱు గానరాదు మా
కడు గిడుచోటఁ గా లెనులి
నంతన కౌనుకు బింద మయ్యెడుఁ."

కుమా. అష్ట 16.

కవిత్రయముహారును నిట్టిప్రయోగమును జేసియుండరు గాని యవి పిమ్మటివారిచే సవరింపఁబడి యుండును. కావున నే సీతారామాచార్యులవారు,

"కువర్ణకంబు పరంబగునపుడు కవిత్రయంబువారి ప్రయోగంబులం దక్క దక్షిణమహాకవిప్రయోగంబులందు నుం గొన్నియెడల నగాగమంబు నూపట్టదు."

(ప్రౌఢవ్యా. శబ్దప. 19 సూ.)

అని యనేకప్రయోగముల నిచ్చియున్నారు. కావునఁ బై చోడకవిప్రయోగము సాధువే.

(శ) పదమధ్యస్వరలోపము:—

తెర్చు, పొర్లు, ఎర్చు, దృల్లు...ఇత్యాదిశబ్దప్రయోగములు కుమారసంభవమునఁ గలవు. ఇట్టిప్రయోగములు నన్నియ భట్టారకాదుల గ్రంథములందును గానవచ్చుచున్నవి :—

తెర్చు—"పర్వతవివరముఁ దెర్చి విగుర్వెల్పుము"

ఆదిప. సప్త. 275.

పొడ్మ—“ఘోరరవ విస్ఫులింగములు వొడ్మగ—”

అరణ్య. వ. 178.

ఎగ్గ—“కావ్యముల నెగ్గవలయు సంస్కారములను”

అప్పక. ప్ర. 120.

దృష్టి—“తన్నుఁ గని యనిమిషులైరో......నాఁగ ననిమిష దృష్టను..........”

కుమారసం. చతు. 39వ.

„—‘అమ్మునితేఁ జూచి యన్నయుఁ, దమ్ముఁడు నొక్కట మనోజతాడితులై రాగమ్మున నన్యోన్యస్నేహమ్ములు నెడి *దృష్టి నిలిపి రయ్యువతిపయిన్.”

ఆదిప. అష్ట. 106 వ.

„—“లింగవంతులు గానిలెంగులదృష్టి—”

పాల్కురికి సోమన బసవపు.

౬. కేవలసంస్కృతశబ్దముతోడ నాంధ్రశబ్దము సమసింప దని వ్యాకరణసూత్రము.

అరదాశ్వ=అరద+అశ్వ—అరదానీక=అరద+అనీక—మఱుప్రసవ, ఒకక్షణాను—ఇత్యాదులు.

---

* ఆనందముద్రాలయాధిపతులు ప్రకటించినభారతమున ‘దృష్టి’ అనియే యున్నది. కాని కొందఱు ‘దృష్టి’ యని ముద్రించిరి. నేను చూచిన వ్రాతప్రతు లన్నిటఁ ‘దృష్టి’ అనియే కానఁబడెను.

ఇట్లే 'కర్ణాటకశబ్ద' మగు 'విగుర్వాణము' అనునదియు 'పటుదోర్బలగర్వవిగుర్వాణంబులన్' ఇత్యాదిగ సంస్కృత సమాసమునఁ జేర్పఁబడినది. తెనాలి రామకృష్ణుఁడును 'వ్రాయసప్రవృత్తి' అను ప్రయోగమును గావించినాఁడు.

౭. పుడమిపుఁడు (గ్రామ్యమా?)

చ. "పుడమిపుఁడున్ ధనాఢ్యుఁడును

భూరిబలుండును..." కుమా. 11 ఆ. 616 ప.

ఇందు 'పుడమిప' శబ్దము గ్రామ్య మని వీరేశలింగము పంతులుగారు వ్రాసినారు.

పుడమీశాదిశబ్దములు ప్రామాణికకవులగ్రంథములలోఁ గలవు. 'పుడమీశుఁడు' అనుదానిని అనింద్యగ్రామ్యము గానే శబ్దరత్నాకరమున సీతారామాచార్యులుగారు గ్రహించినారు. 'పుడమీశ' అనున దెట్టిదో 'పుడమిప' అనునదియు నట్టిదే. 'కలకంఠా'దులవలె నవ్వియు వికృతులే. ఈ ప్రయోగములను జూడుఁడు:—

క. పుడమీశ! సత్యవాక్యము

నడపుము...... సకలకథా. 2 ఆ. (చూ. శ. ర.)

ద్వి. పా. "పుడమీశ! మీధనంబునకుఁ జేసాప..."

పాల్కురికి సోమనబసవపు.

ఇత్యాదులు. ఇట్టిసమాసపదము లనేకములు మన భాషయం దనింద్యములుగాఁ బ్రయుక్తములై మహాకవుల

గ్రంథములఁ గానంబడుచున్నవి. అందు గొన్ని యిచ్చటఁ జూపఁబడుచున్నవి.

కాంచనపిండు, కటకకంతుఁడు—నన్నియభట్టు.
ప్రాణగొడ్డము—తిక్కనసోమయాజి.
తానపతి—యుద్ధమల్లుని బెజవాడ శాసనము.
అర్ఘ్యపళ్ళెము—మంచన కేయూర బాహుచరిత్రము.
ముల్లోకవంద్యుఁడు—పాల్కురికి సోమన.
దినవెచ్చము—శ్రీనాథుఁడు, తెనాలిరామ.
జీవగఱ్ఱ—చేమకూర వేంకటపతి (విజయవి.)
పిండకూడు—పండితమల్లికార్జునుఁడు (శివత)
యోగపట్టె—పెద్దనామాత్యుఁడు (మనుచ.)
బడితపాతము—గౌరనమంత్రి (హరిశ్చం)

ఇట్లే కరవాలు, మరకతపట్టు, మలయజసిరి, వీరమద్దియలు, సర్వాంగకచ్ఛడము, సురగజ్జెలు, వనలచ్చి, రాగదీవియలు మొదలగుసమాసవికృతు లనేకము లనేకాంధ్రమహాకావ్యములయందు నిరంకుశముగాఁ బ్రయోగింపఁబడి వెలయుచున్నవి.

'పుడమివ' శబ్దము 'బృథ్వీప' శబ్దభవము, కటకకంతాదులవంటిది. కావున ననింద్యమే యగును.

ఛా. భాస్వార్థక 'ట' కారమునకు 'డ' కారాదేశము

కాంచుట+అరు దయ్యెన్=కాంచు డరు దయ్యెన్;
ఇట్లే—ఒదవు డిదేమి; చేయు డొక పేర్మి.

ఇట్టిప్రయోగములు కవినన్నిచోడనిగ్రంథమునం దెల్ల లెక్కుడు మిక్కిలి గానంబడుచున్నవి. వీనింగూర్చి వీరేశలింగము పంతులవా రిట్లు వ్రాసినారు:—

“ఒదవు టిదేమి యనుటకు, ఒదవు డిదేమి యను రూపము వాడఁబడినది. తంజావూరిలోని యచ్చువాండ్రకు టడభేదము చక్కఁగాఁ దెలియకపోవుటచేత వ్రాఁతలో నిట్టి రూపములు పడియుండవచ్చును. అవి పూర్వకాలపురూపము లని భ్రాంతి చెంది ముద్రాపకులు వాని నట్లై యుంచి యుందురు. అపూర్వరూపములు వేసినంతమాత్రమున క్రొత్తకవి ప్రాఁతకవి గానేరఁడు. ఈకవి భావార్థక టకారము వాడె ననుట కొకయుదాహరణమును జూపెదను:—

క. “దానఁ గోలఁ గోలవేగం
బున నరిగొల్పుటయుఁ దిరుపుఁ బొరిపొరి విడుపుం
జనుటయు దనుజులఁ గొనుటయు
ననిమిషులకు నైనఁ గాంచుడరుదయ్యె ననిన్.

కుమా. ద్వి. భా. ౪౩౪.

“అరిగొల్పుట, చనుట, కొనుట—అని మొదట మూఁడుచోట్ల టకారము వేసినవారు కడపటఁగూడ ‘కాంచుట’ అని టకారము వేయక కాంచు డని డకార మేల

వేయవలెనో దురూహ్యముగా నున్నది. 'కాంచుటరుదయ్యె' నన్నచో యతిభంగము వచ్చునా? ప్రాసభంగము వచ్చునా? ఏదియును రాదు." (అని వ్రాసిరి.)

తంజావూరిలో టడభేదము తెలియని యజ్ఞనవార్యులు పై పద్యమున మూడుచోట్ల టకారము నెట్లు తెలిసినారో, నాలవచోటమాత్ర మేల తెలిసినారు గారో, పంతులవారు వ్రాయకపోవుటయు దురూహముగానే యున్నది!

మా మహారాజావారు వ్రాయించి తెప్పించిన వ్రాంత ప్రతియందు నిట్టిరూపములు పెక్కుచోటుల దకారయుక్తము లయియే యున్నవి. భావార్థకటకారమునకు అచ్చుతో సంధికార్యము జరిగించినప్పుడెల్ల దకార మాదేశముగు నన్నది. పంతులవారు వ్రాసిన ట్లితరస్థలముల, టకారము వేసినను దకారము వేసినను భంగ మేదియు రాదు గాని, ఈక్రింది ప్రయోగములవంటివానియందు టకారము వేసినచోఁ బ్రాస భంగము తప్పక పాటిల్లును:—

(౧) చ. "వడిఁ ద్రిదశాలినోర్చు డాకొవావిఁబీకముగాఁగ రజ్జునె
*ప్పు డదియు నీవు సేసిన తపోవిభవంబున......"

కుమా. ద్వి భా. 516

---

*(౧) కుమారసంభవము వ్రాఁతప్రతియందును, అచ్చుపుస్తకమునందును 'చెప్పుడు నది' అని యున్నది. సముచ్చయము మెల్లను దప్పునో గావునను, 'చెప్పుడు నది' అనుచోట నున్నసముచ్చయముకంటె, 'చెప్పుడదియు' అనుచోటిసముచ్చయ మధికరసవంతమును, అర్థవంతమును నై

(౨) క. "షడరణ్నిధనుర్ధరుఁ డే
ర్పడ నజితుఁడు గాన వాని హీనుంగాఁ జే
యుడ నాకుఁ జతుర్వర్గము
వడయుటయని పృషతసుతుఁడు ప్రార్థించె మునిన్."

ఆది. సప్త. 16

భావార్థకటుకార మచ్చుచోఁ గూడినప్పుడు డత్వమును బొందినరూపములే పూర్వరూపములు. అంతియకాని క్రొత్త కవిప్రాంతవానిని జేయుటకు మఱియొకరు వేసిన యపూర్వరూపములు గావు. ఓరియంటల్ లైబ్రరీ, తెలుఁగు మాన్యుస్క్రిప్ట్స్ క్యాటలాగ్ 1915 సం.రము వాల్యూం I. 189 పుట యందు తిక్కనవిరాటపర్వప్రథమాశ్వాసము 6 వపద్యమున సిద్ధప్రయోగము వ్రాయఁబడినది. చూడుఁడు.

---

ప్రాచీనప్రయోగపద్ధతిని దెల్పుచున్నది గావునను, భావార్థకటుకార మచ్చుపరమైనపు డెల్ల డత్వమును జెందుచుండుట గ్రంథమునందంతటను గానవచ్చుచున్నది గావునను కవిప్రయోగము 'చెప్పడదియు' అని యుండు ననియే తోఁచుచున్నది.

(౨) ఈభారతపాఠమున 'చేయుడ' (చేయుట + అ = చేయుటయే) అనుపురాతనరూపమును పరిష్కర్తలు 'చేయుడున్' అనునానంతర్యార్థక రూపముగా గ్రహించి ముద్రింపించినారు. ఆనంతర్యార్థముకంటె నిచ్చట భావార్థమే యర్థానుగుణముగను, అర్థవంతముగనునుండునని యించుకంత పర్యాలోచనము నోర్చువారికి విశదము గాఁగలదు. కావున 'చేయుడ' అనునదియే సన్నియప్రయోగము.

మ. "హృదయాహ్లాది చతుర్థ ముద్రితకథో
పేతంబు నానారసో
భ్యుదయోల్లాసి విరాటపర్వ మట యు
ద్యోగాదులుం గూడఁగాఁ
బదునేనింటఁ దెలుంగు బాస జనసం
ప్రార్థ్యంబులై పెంపునం
దుదిముట్టంగ 'రచించు డొప్ప' బుధసం
తోషంబు నిండారఁగన్."

మఱియు,

ఆంధ్రమహాభారతవ్యాఖ్యానము వ్రాసిన భారతము లక్ష్మీపతి సోమయాజులుగారికాలమునసయిత మిట్టిరూపము లున్నట్లు కొన్నిదృష్టాంతములు చూపట్టుచున్నవి. అందొక దానినిమాత్రము చూపెదను:—

క. "సమచిత్తవృత్తు లగుబు
ద్ధిమంతులకు నిప్పుడు ద్రౌపదీప్రశ్నవిచా
రము సేయవలయు నవిచా
రమునఁ బ్రవర్తిల్లు డది నరకహేతు వగున్."

సభాప. ద్వి. 226.

అనునన్నయభట్టారకునిపద్యమునం దున్న 'ప్రవర్తిల్లుట' అనుదానిని 'ప్రవర్తిల్లుడు' అనుశబ్దముగానే గ్రహించి, లక్ష్మీపతిసోమయాజిగారు దానికి,

ప్రవర్తిల్లుడు=ప్రవర్తిల్లుట—అని వ్యాఖ్యాన మొనర్చి నారు. దానినిబట్టి పూర్వపు వ్రాఁతప్రతు లన్నిట (భావార్థక టకారము నచ్చు సంధించినప్పు డది) డత్వము చెందినరూపము లే యుండెడివనుట విస్పష్ట మగుచున్నది. ఈభారతవ్యాఖ్యా నమున నిట్టి వింకను గలవు.

మఱియు వీరేశలింగము పంతులవారు, "ఇచ్చట యన్నచే పూర్వకాలపురూపము గాని యిచ్చు డున్నది గాదు. 'మాపట్టణములో నంతకంతకు ద్రాగుడు హెచ్చుచున్నది.' అనువిధమున నిప్పుడిప్పుడు ద్రాగుట యనుటకు త్రాగు డని వాడుకలోనికి వచ్చినది." అని వ్రాసినారు.

'త్రాగుడు' అనునది పూర్వకాలపురూపమే కాని యిప్పటిది గాదు! శబ్దరత్నాకరమున నిశబ్దము వ్రాయఁబడి 'చిట్టకంపుఁద్రాగుడు' అనునాముక్తమాల్యదలోని ప్రయోగ మియ్యఁబడినది!

౯. తత్సమేకారాంతమహతీవాచకములకు యడాగమ ము:—

కం. పా. "తరుణియె యొక్కర్తు వికటశాపసిపోలెన్."

కుమా. ద్వి. భా. 68.

ఇట్లే వనేచరియలు (ప్ర.భా.701), విటియలు (ద్వి.భా. 190) మొదలగునవి. (వ్రాఁతప్రతియం దున్న "వనేచరియలు

రేఁప" అనుదానిని ప్రకాశకులు "వనేచరు లొగి రాఁప" అని సవరించిరి.)

నన్నయభారతమునను,

"తరుణియు లొప్ప నాడిరి ము
దంబునఁ దమ్ము జనాలి మెచ్చఁగన్."

ఆది. అష్ట. 175.

అను ప్రయోగము గానంబడియెడి. ఆనందముద్రణాలయాంధ్రమహాభారతమున (1907) 'తరుణియలు' అనియే యున్నది. కాని, కొందఱు పరిష్కర్తలు "తరుణులు నెప్ప నాడిరి......" అని సవరించి "నిరర్థక" మగు సముచ్చయమును దెచ్చిపెట్టి ముద్రింపించిరి.

శ్రీనాథమహాకవిశివరాత్రిమాహాత్మ్యమున 'సెట్టియాకారము, సెట్టియభీముఁడు' ఇత్యాది తత్సమేతరమహావ్యాచకంబులకును యడాగమము గన్పట్టెడిని. పై ప్రయోగములను గూర్చి యింకను వ్రాయవలసినవిషయములు గలవు గాని విస్తరభీతిని ప్రస్తుతము నిల్పితిని.

(౧౦) ఉపమానోపమేయవిపర్యయ, భిన్నలింగ భిన్నవచనాదులుగల ప్రయోగము లనేకములు చోడకవిగ్రంథమునఁ గలవు. వానిం గూర్చి కాలనిర్ణయవిమర్శమున సూచించియుంటిని. ఈ తెలుఁగు ప్రయోగములకుఁ బురాతనదివసము లందు శాసనములు పుట్టియుండలేదని తోఁచుచున్నది.

## —♦ శబ్దవిశేషములు ♦—

కుమారసంభవమున నపూర్వము లగుశబ్దములు కొన్ని గానవచ్చుచున్నవి. వానిలోఁ గొన్ని నిఘంటువుల కెక్కవలసి యున్నవి; కొన్ని లేఖకప్రమాదజనితములో కవిప్రయుక్తములో విచారింపవలసియున్నవి:—

(౧) నేని—ఇది వాలాయిగను గన్పట్టుచున్నది.

ఉ. “నీపరిరంభణంబు ధర
ణీపరిరంభణ మయ్యె సమ్మదా
రోపితశుష్కరోదనము
రోదన మయ్యె రతిక్రియారసా
లాపము లాత్మవేషితవి
లాపము లయ్యె మనోజ నేనియుం
జూపవు నిన్నుఁ; గన్నొరసి
చూచుడొ నాదెసఁ దప్పఁ జూచుడో”

పం. 566.

సీ. “తలిరాకుకంటెను మెలుపారునడుగులు
ధరమీఁద మోపుచుఁ దెరలిపోవు
గ్రొవ్విరితావకంటెఁ గోమలం బగుమోము
రేయెండ ముట్టిన నోయుఁ దద్ద
దవనంపుఁబూఱెకంటె సవకంపుమెయితీవ
వడగాలి సోఁకుడు వాడు లగ్గ

నాదిగర్భేశ్వరి వంటినఁ గండెకు
నెలక న్నిఱుంగవు సేని ముందు
అన్న యునికిని వెలువడ నుత్సహింపఁ
దలఁచి తేనియు నిది దుడిదాఁక నెట్లు
నెయిద నేరదు గానసీవింద యుండి
కోర్కె సేకుఱ సర్వేశుఁగొలువు మబల."

పఞ్చా. 670.

నన్నియతిక్కనలును 'సేని' ని బ్రయోగించినారు:—

ఉ. "వాఁడిమయూఖముల్ ...కచుండు సేనియున్." "

ఆది. తృ. 111 వ.

ఉ. "నీవును జూచి తట్టిసభ సేని వినంబడ బేయుగంబులన్."

సభా. ద్వి. 95.

ఉ. "కావలివారిఁదోలి...యూతల కొద్దియుటలేదు సేనియున్."

విరా. చతు. 192.

౨. రేయెండ—(చూ. పైని వ్రాసిన సీసపద్యము.)

సీ. పా. "క్రొవ్విరితావకంటఁ గోమలంబగుమోము
రేయెండముట్టిననోయిఁదద్ద "

నన్నిచోడఁడు మొదలగుప్రాచీనకవులు 'రేయెండ' శబ్దమును బాలాతపపరముగా నుపయోగించియున్నారు. శబ్దరత్నాకరమున 'రేయెండ' యన 'వెన్నెల' యని యర్థము వ్రాయఁబడినది. కాని యిది విచార్యము. లక్షణచే 'వెన్నెల' గావచ్చు నని కొందఱు. ఎట్లయినను పూర్వపు

యోగములుమాత్రము ' ఈరెండ ' అనునర్థమునే యిచ్చు
చున్నవి:—

సీ. పా. "వెలుఁగొందు రేయెండ వీఁకపట్టెడి యని
రాజితంబుగఁ బద్మరాగరుచులు"

నన్నిచో.

సీ. పా. "సమరవికాసంబు చెయుట నొప్పఁ బకుండ
హేతిదీధితులు రేయెండనొసఁచు"

తిక్కన.

సీ. పా. "ఒకదీవినిండుచంద్రికలు మిన్నులు వ్రాఁకు
నొకదీవి రేయెండ యుబ్బికాయు"

శ్రీనాథుఁడు.

సీ. పా. "రేకులన్నియు విచ్చి రేయెండ జిగినిండి
కరమొప్పు తెల్లతామరలకంటె"

భాస్కర.

౩. ఆలించి విను—

సీ. పా. " అలిరుతి సెవిపెట్టి యాలించివిని సోఁకి
పరవశులై యుండుభద్రికరులు"

కుమా. వ్ర. 81.

వ. " ...అద్దెస యాలించి విని..." కుమా. వం. 566.
నన్నియ—"చిత్తగించి వినుము..." ఆది. చతు. 36 వ.
మల్లన—" అంచలార! యాలకించి వినుఁడు " చంద్రభా.

పినవీరన—"లిఖితుఁడిట్లనుశంఖుఁడాలించివినఁగ." జైమినీభా.

ఇట్లే కటాక్షించి చూచు—మొ.

౮. సమూహి—సురసమూహి (ద్వి. 225), గణికా సమూహి (తృ. 351) నీరదసమూహి (దశ. 285) వసుసమూహి అష్ట. 191...) ఇట్టివే భస్మాంగి (శివుఁడు), దాసి (దాసుఁడు) మొ.

౯. నిఋతి—ఇక్కడి నిర్ ఋతి (నిర్‌ఋతి) యనుటకు నిఋతి యని (ద్వా. 822) నాలుగులఘువులు గలదానిఁగాఁ బ్రయోగించియున్నాఁడు రంగనాథుఁడును,

ద్వి. "గణుతింప నిఋతి గాఁడు నీకోడ, రణవిశారదుఁ డగు రాముండు గాని" (యుద్ధకాం.) అని ప్రయోగించినాఁడు. పాల్కురికి సోమనయు నిట్లే ప్రయోగించినాఁడు.

ఇది కాళిదాసుని 'త్రియమ్బకం'వలె వేదోచ్చారణము ననుసరించి వ్రాయఁబడిన దని యింతకుమున్ను కాలనిర్ణయ విమర్శమున వ్రాసియున్నాను. ఇట్లే,

"చ. అలరులమందహాసమున
కన్నినషట్పదమంజుగీతి రా
చిలుకలముద్దుమాటలను
జెందలిరాకులరాగలీలఁ గో
కిలనినదంబులన్ బరుహి
కేశభరంబున ముక్తపర్ణమే

ఖల నభిరామ మయ్యో సహా
కారలతాంగి మధుప్రసంగతిన్.
కుమా. చతు. 4౬౩.

సీ. పా. ‘‘జలజాత కైరవోత్పలకలుహారాది
గంధంబు లోలి సద్గంధములుగ’’
నవ. 271.

అనునీపద్యములయందు ‘బరుహి, కలుహార’ అనునవి సంహిత లేకుండ (బర్హి, కల్హార,) పై ‘నిర్ బుతి’ వలెనే ప్రయోగింపఁబడినవిగాఁ దోఁచెడిని. వీనినిసయిత మితరకవులిట్లే వాడియున్నప్రయోగము లున్నవేమో తాళపత్త్రగ్రంథములయందు వెదకవలసియున్నది. కలుహారశబ్దముమాత్రము మఱికి సింగనపద్మపురాణము 11 ఆశ్వా. 43 పద్యము నఁ గలదు:—

మ. ‘‘మధుమాసంబున రేపు శుద్ధమతితో
మర్త్యుండు సుస్నాతుఁడై
మధువైరిం గలుహారపంచకమునన్
.........పూజించి...’’

మఱియు,

సీ. ‘‘మెలుపారు నెలమావితలిరుల నొకకొన్ని
రమణీయమగుచంపకములు వోదిని
లాలితాశోకపల్లవముల నొకకొన్ని
కమనీయ మగు కుర్వకములు వెట్టి...’’
5 ఆ. 502.

ఇందు ‘ కురవకము ’ అనుదానిని ‘ కుర్వకము ’ అని ప్రయోగించినాఁడు. ‘ ఆరగ్వధము, ఆర్గ్వధము ’ వలెఁ బూర్వము దీనికి ‘ కురవకము, కుర్వకము ’ అని రూపద్వయ ముండెడిదో, కురువకము (లేక గురువకము) అను వికృతిపద ముండెడిదో విచారింపవలసియున్నది.

(౭) స్నేహము:—

“ ఆహారి విడిచి ససర్గ
స్నేహంబునఁ బాయుడెంచె.......... ”

కుమా. దశ. 442.

అని వ్రాఁతప్రతియందు ‘ స్నేహ ’ మను రూప మపురూపముగఁ గానవచ్చుచున్నది.

“శ, ష, స” అనునివి యాయాయనునాసికములతోఁ గూడినప్పు డాయాయనునాసికముల వర్గప్రథమాక్షరము లాగమములుగా వచ్చిచేరును. (ఇది వేదవిధి) వీనికిఁ గ్రమముగ నుదాహరణములు:—

పద్భ్యముడ రేణ శిశ్నాచ్చ, విష్ణో రనుష్టుక్, న వి వ సన స్నాయాత్, ఇత్యాది. కావుననే విద్వత్కవిశిరోమణి యగు శ్రీనాథమహాకవి,

ఉ. “ ధీనిధి సెట్టినంబి తన
దేహమునిండ విభూతిమంగళ

స్నానము సేసి ధౌతపరి
ధానముఁ గట్టి......" పారవి. ద్వి. 36.

అని 'స్నాన' శబ్దములోని తకారమునకు యతిని గూర్చి, తనవేదవిధిజ్ఞతను నెఱపినాఁడు. ఇప్పటికిని గొందఱు పెద్దలు 'స్నాతకము' మొదలగువానిని తకారయుక్తములు గానే పలుకుదురు. ఇదిగాక అస్నానార్థక మగు 'తానము' అనువికృతికి 'స్నానమే' ప్రకృతియై యుండినట్లు చూపట్టుచున్నది. కాకున్న, తకారమున కాకరము గానరాదు.

(౮) ధారుణి—

ధరణి, ధారణి, ధారిణి—అను రూపములే కాని, 'ధారుణి' యనురూపము లేదని కొందఱందురు. చిరకాలము నుండియు తెలుఁగుపాత్రముల వ్రాఁతప్రతులయందును, అచ్చుప్రతులయందును 'ధారుణి' యనురూపమే కాని 'ధారణి, ధారిణి' అని భూమ్యర్థమున రూపములు గానరాలేదు.

మ. "మణికోదండము లింద్రచాపములుగా
............ధా
రుణియుం గప్పుచుఁ ద్రోచి రోలిఁ దాలుకా
రుంభోరె......"
కుమా. ఏకాద. 705.

అని నన్నిచోడకవిరాజును,

చ. "గుణముల నొప్పి బ్రాహ్మణుల
కుం గడు భక్తుఁడవై సమస్తధా

ధుణిప్రజఁ బ్రోచుచున్ విగత

దోషుఁడవై......"

ఆదిప. సప్త. 128.

అని వాగనుశాసనుఁడును యతిస్థానములయందే 'ధ్రుణి' శబ్దమును ప్రయోగించియుండుటచే మనయాంధ్రకవులు దీని నీరూపముతోనే సాధువుగా గ్రహించిరని తెలియ నగుచున్నది. అనేకవిషయముల సంస్కృతవ్యాకరణనియమములను పాటింపని మనయాంధ్రకవుల నిరంకుశప్రయోగములలో నిది యొకటిగా నెన్నఁదగియున్నది.

(౮) అచ్చరువు—అచ్చెరువు.

కవిరాజశిఖామణి యీరెండుశబ్దముల నుపయోగించి యున్నాఁడు. ఇందు 'అచ్చరువు' అనుపదమును గాంచి వీరేశలింగముపంతులవారు,

" అచ్చెరువు అనుటకు 'అచ్చరువు' అని యపశబ్దము వేయఁబడినది." అని వ్రాసినారు.

చ. " అరుణజలంబు లాడి, తుర
గాజినవస్త్రము లర్థిఁ గట్టి, భీ
కరకరిదానకర్దమము
గస్తురి గాఁగ నలంది...చాల న
చ్చరువుఁ బిశాచకాంతలు పి
శాచములం దవిలించి రొప్పలన్."

కుమా. ద్వి. భా. 768.

ఇట్లే 468 పద్యమున 'అచ్చరువడి' అని ప్రయోగింపఁ బడినది. మఱియు,

"అరుదుగఁ జంద్రకాంతసిల
యంబులలో విహరింతు రర్థిఁ దా
రరయఁగ నెల్లవారికి బ
యల్పడి తోఁపఁగ నంద కొంద ఱ
చ్చెరువుగ నింద్రనీలరుచి
చీకటి................."

కుమా. ప్ర. భా. 258.

ఇట్లే ప్ర. భా. 406, ద్వి. భా. 838, 941—పద్యము లయందు 'అచ్చెరువు'లోని 'చ్చె' పాదప్రథమాక్షరముగాఁ బ్రయోగింపఁబడినది. కావున మనకవి, 'అచ్చరువు, అచ్చెరువు' అని రెండురూపములను వాడినాఁ డనుట స్పష్టము.

ఇందు మొదటిది 'అచ్చరువు' ఆశ్చర్యశబ్దభవము. 'నిశ్చయమ్—నిచ్చయము. నిశ్చలమ్—నిచ్చలము; శ్యామా—చామ; పశ్చాత్—పజ్జ—వంటిది.' ఇది కేవలసంస్కృతశబ్దము నుండి పుట్టిన ప్రాచీనరూపము. రెండవది 'అచ్ఛేరం' అను ప్రాకృతమునుండి పుట్టిన తద్భవాతిరూపము. నన్నయభట్టార కాదికవులు పూర్వరూపమును విడనాడినారో, ప్రయోగించి నారో తాళపత్త్రగ్రంథములఁ బరిశీలింపవలసియున్నది.

మఱియు, "చెలరేఁగు"నను, 'చలరేఁగు' అని యిక్కవి

ప్రయోగించినాఁ" డని కీ. శే. తం. తేవప్పెరుమాళ్ళయ్యగారు వ్రాసిరి. (ద్వి. భా. 690 పద్యమును జూడుఁడు) 'చలరేఁగు' అనునది 'చళప్పు' మొదలగువానివంటిది. కావున దుష్టము గాదు.

కుమారసంభవములోని 'త్రొడగాడి, పొలసాడి' ఇత్యాదిశబ్దములనుగూర్చి వీరేశలింగముపంతులవారు, 'ఇక్కవి క్త్వార్థకేకారసంధిని గూర్చినాఁ' డని వ్రాసినారు! కాని, ఇవి పెనఁగాడు, దిట్టాడు, మట్టాడు, ఊఁగాడు, తేలాడు, నిలుచుండు, అడిచ్చు మొదలగువానివలె శబ్దపల్లవములు.

[illegible] ని సంస్కృతశబ్దప్రయోగములయందును గొన్నివిశేషములు గలవు. వానింగూర్చినచర్చను గ్రంథవిస్తరభీతిని ప్రస్తుతము నిల్పితిని.

## పాఠభేదములు.

కవిరాజశిఖామణికుమారసంభవము వ్రాఁతప్రతికిని, ముద్రితగ్రంథమునకును గొని పాఠభేదములు గలవు. అందు చాలవఱకు 'ముఖ్యపాఠభేదములు' అనుశీర్షిక గలయనుబంధపత్త్రిమును రెండవభాగముకడపటను గ్రంథసంపాదకులు చేర్చియే యున్నారు. ఇఁక నచ్చటచ్చట నున్నవియెల్ల స్వల్పములగునక్షరభేదములు మాత్రమే.

ఈగ్రంథము ప్రాచీనమైనదని తోఁపించుటకై గ్రంథసంపాదకు లగు రామకృష్ణకవిగారు దానియందు పెక్కులు

మాన్యులు గావించినా రను గొప్పప్రవాద మొకటి లోకమున మిక్కిలియుఁ బ్రాఁకియున్నది. వ్రాఁతప్రతికిని ముద్రితగ్రంథము నకును గలభేదములలో ముఖ్యమైనది యిది:—

క. "మునుమార్గకవిత లోకం
బున వెలయఁగ దేశికవితఁ బుట్టించి తెనుం
గును నిలిపి రంధ్రవిషయం
బునఁ జనఁ జాళుక్యరాజు మొదలుగఁ బలువుర్."

వ్రాఁతప్రతి.

క. "మునుమార్గకవిత ......... తెనుం
గు నిలిపి రంధ్రవిషయమునఁ
జన సత్యాశ్రయునిఁదొట్టి చాళుక్యనృపుల్."

అచ్చుప్రతి.

ఇందు మొదటిపాఠముసయితము పిమ్మట రెండవభాగము ననుబంధమున వెలువరింపఁబడియే యున్నది. రెండవపాఠము రామకృష్ణకవిగారియొద్ద నున్న వేఱొకప్రతిలో నున్నదేమో తెలియఁజాలను.

తక్కినభేదములలో—నేను చూచినవ్రాఁతప్రతికిని ముద్రిత పుస్తకమునకును గలపాఠభేదములలో—కొన్ని, యిప్పటిఛందో వ్యాకరణనిబంధనములకు లొంగనిప్రయోగములు కొన్ని, దుష్టము లనునభిప్రాయమున నాధునికలక్షణములకు సరిపడు నట్లు సవరింపఁబడినవిగాఁ గానవచ్చుకొలఁదిమార్పులే యై యున్నవి; మఱికొన్ని లేఖకప్రమాదజనితములై యున్నవి.

ఇవ్విషయములఁ దెలుప నెంచుచుం డుదాహరణములను మాత్రము చూపెదను:—

అ—(౧) ప్రాసము—

ఎ.గీ. “చిత్రవర్ణాతిశయనూత్న + రత్నచిత్రి
తాంగరంగవల్లీసురంగాంగణములు

వ్రాఁతప్రతి.

“ ,, చిత్రవర్ణాతిశయరత్న + చిత్రితాంగ
*రంగవల్లీ బహుసురంగాంగణములు.

(సప్త. 987) ముద్రిత.

క. “వేణుజమౌక్తికములు ......
వీనుల కింపెసఁగ నెఱుకు + వెలఁదులు

వ్రాఁతప్రతి. (మ. 705.)

క. “వేణుజ ......”
గానాల కింపెసఁగ నెఱుకుఁ + గన్నెలు-ముద్రితపుస్తకము

సీ. పా. “ఘోరకాంతారసంహారకారణ మగు
వనవహ్ని కెచ్చుటఁ దృణకణంబు

వ్రా. ప్ర. (దశ. 587.)

“ ,, ,, మగు,
కార్చిచ్చునకు నెంత గడ్డిపఱక-ముద్రితపాఠము.

ఇందు నణప్రాసము సవరింపఁబడినట్లు గన్పట్టెడిని.

---

*ఇందు గణము తప్పినది. (ఈ గీతమున, త్ర, త్న ప్రాసము సవరింపఁబడినదిగాఁ దోఁచుచున్నది.)

(౨) యతి—

"చ. సకలకళాధరుండు జల

జప్రభవుండు విడించి యుండఁ, బా

యక సిరిఁ దక్కనేలిన ము

రాంతకుఁ డుండ, సమస్తదేవతా

ప్రకరముగొల్వ నున్నసుర

పాలకుఁ డుండఁగ నిట్టి మూర్ఖ భి

క్షుకు నపరాద్ధు నేమిగతిఁ

గల్చితి శంకరుఁ బంకజాననా."

వా॥ ప్ర॥ సప్త 856.

"భిక్షుకు నపరాద్ధు నేమిగతిఁగోరితి శంకరుఁ బంకజాననా?"

ముద్రితపుస్తకము.

ఇందు 'భిక్షుక' శబ్దము దుష్టమనుభావమున 'భిక్షుక' అని దిద్దఁబడి, దానికి యతిని సరిపుచ్చుటకై 'కల్చితి' అనునది 'కోరితి' గాఁ జేయఁబడిన దని తోఁచెడి.

(3) వ్యాకరణము:-వనేచరియలు, దృష్ట్లు, ఎగ్గ-ఇత్యాదులు కొన్ని సవరింపఁబడినవి. మఱియు,

"ఈశానదత్తి త్రిశూలాయుధం బెత్తి......'

ద్వాద. 797 వా॥ ప్ర॥

ముద్రితపుస్తకమునందు నిట్లేయున్నది గాని శుద్ధపత్రికయందు 'దత్త' అను సవరణ చూపఁబడినది. 'దత్తి' అను

నది ప్రాచీనశాసనములయందు బహుళముగఁ జూపట్టుచునే యున్నది గాన సాధువే—

(క) అక్షరభేదములు:—

క. "ఏం జేమిసేయుఁ బంచిన
వాం డుండఁగ నిక్కమునను వధ్యుఁడు గా నా
ఖండించుఁడు గాక ?; యేసిన
వాం డుండఁగ నేమిసేయు వరశర మనిలోన్ ?"

వ్రాఁతప్రతి (దశమా. 520)

ఇందు 'ఏసిన' అనుటకు 'ఏలిన' అనియు వరశరము అనుటకు 'పరికరము' అనియు ముద్రింపఁబడినది. ఈ లేఖక ప్రమాదమువలన రసభావములు పోయినవి. మఱియుఁ బ్రాచీన కవిసమ్మతము గాని 'పవ'ల యతియు సిద్ధించినది. పైని వ్రాసిన భేదములవంటివి దక్క, నన్నెచోడకవిని ప్రాచీనునిఁ జేయుటకై కావించిన మార్పు లెవ్వియును లేవు.

## ప్రక్షిప్తములు.

వ్రాఁతప్రతిలోఁ గానవచ్చుచు, ముద్రితగ్రంథమునఁ గానరాక జాఱిపోయినపద్యములు కొన్ని గలవు:—

(౧) ప్రథమభాగము 943 (పరువడి... అను) పద్యము తరువాత,

క. “ కులగిరులు బలసి కొలువఁగఁ
బొలుపగు హేమాద్రిపోలెఁ బురవరహర్మ్యా
వలినడుమఁ గనకమయమై
యలఘుతరోన్నతిగ రాజహర్మ్యము వెలుఁగున్.”
అను పద్యమును,
(౨) ద్వితీయభాగము 520 (క. వీండేమిసేయు...
అను) పద్యముతరువాత,
“ వ. అదియునుంగాక,
“ క. గురులను మునులను సుకవుల
నరిదూతలఁ బూతులను బరాంగనల మహీ
సురులను మిత్రుల బాలుర
నిరతము సంపఁ దగ దెంత నేరకయున్నన్.
అనువచనపద్యములును,
(3) ద్వి. భా. 684 (అంత నొండొంటి...అను) వచనము
తరువాత—
“ తే గీ ఉభయబలభటకోపోజ్జ్వలోగ్రవహ్నిఁ
బొగలు మునుముట్టి మఱి మంట లెగయునట్లు
పాదఘట్టనమునఁ దూలి పర్వి పొదల
నస్త్రఘట్టన మఱి లోహితాగ్ను లెగసె.
“ వ ఇట్లతిభయంకరం బైనసంకులయుద్ధంబున,
అనుపద్యవచనములును ముద్రితపుస్తకమున లేవు.”

(క) వ్రాఁతప్రతియందును, అచ్చుపొత్తమునను గాన రాక యీక్రిందిపద్యము 'ప్రబంధమణిభూషణము' అను సంకలితగ్రంథమున నన్నిచోడని కుమారసంభవములోని దని యుదాహరింపఁబడినట్లు లఘుటీకగలయనుబంధమున సంపాదకులు వ్రాసియేయున్నారు.

ఉ. "భూచరు లంబరంబుననె
పోవుట మే లన నంబరేచరుల్
భూచరవృత్తి మే లనఁగ
భూచరఖేచరు లాజలప్రకే
ళీచరణంబు మే లన జ
లేచరు లంబరమధ్యయాన ధా
త్రీచరణంబు మే లనఁగఁ
దీవ్రనిదాఘము వర్వె నుర్వరన్."

బ్రీ. శ్రీ. రామకృష్ణకవిగారు, గ్రంథపీఠికయందు తమకు కుమారసంభవముప్రతులు మూఁడు లభించియున్న వని వ్రాసినారు. తంజావూరివ్రాఁతప్రతిలో లుప్తమై యున్నభాగములే ముద్రితపుస్తకమునందును గానరాక, ఆయాస్థలములఁ జుక్కలు పొడువఁబడియున్నవి. భిన్నదేశములందు పుట్టినప్రతులు మూఁటియందును ఒక్కచోటనే పాఠములు పోయియుండుట యెల్లవారికి నాశ్చర్యముఁ గొలుపకమానదు.

కవిగారు లోకమునకుఁ గల యీసందేహాశ్చర్యములను దీర్పవలసియున్నారు.

రామకృష్ణకవిగారియొద్ద నున్నప్రతులు మూఁడును వీరమాతృకకే ప్రతిలేమో యని యనుకొనుటకు—వా రచ్చటచ్చటఁ జూపిన 'పాఠభేదములును', వారిచ్చిన 'ముఖ్యపాఠభేదములు' అనుశీర్షిక గలయనుబంధపత్త్రమును, ఒండు రెండుచోట్లఁ గల లుప్తభాగ పూరణములును—వలనుపడనీయకున్నవి:—

౧. పాఠాంతరము లనునవి:—ప్రథమభాగము 417 పద్యములోని ఎత్తుగీతిపాదములకు—పుటయడుగున సూచిక చూ. ౫౮ పుట.

ద్వితీయభాగము 356 పద్యములోని మూఁడవపాదము లఘుటీక చూడుఁడు. 26. పు.

౨. ముఖ్యపాఠభేదములు—ఈశీర్షిక గలపత్త్రము ద్వితీయభాగము కడపటఁ జేర్పఁబడియే యున్నది.

3. లుప్తభాగపూరణములు-పంచమాశ్వాసము 549 పద్యము (సీసము) లోని 3, 4 పాదములును, ఎత్తుగీతిలోని 1, 2 పాదములును, 580 ప. సీ. మొదటిపా. 2 దళమును, సప్తమాశ్వాసము మూఁడవపద్యము సీసము నెత్తుగీతి రెండవపాదమును వ్రాఁతప్రతియందు లేవు. ఇట్టి వింకను అందందు కొన్ని గలవు. వీనిఁగూర్చి యనేకు లనేక

విధములుగఁ జెప్పుదురు. ఎవ రేమి చెప్పిన నేమి? ఎవ రేమన్న నేమి? ఏది యెట్లున్న నేమి?

అనాంధ్రదేశమునఁ జూచునట్టిదిక్కు లేక పడియుండిన యుత్తమోత్తమమైన యిమ్మహాకావ్యము పురుపులపాలయి నశింపకుండ, శ్రమముమై సంపాదించి, యాంధ్రలోకమునకు సులభసాధ్య మగు నట్లొచ్చొత్తించి, మాసిపో నున్న మన కవిరాజశిఖామణికీర్తిని నిలువంబెట్టి యాంధ్రులకు నామోద మొదఁగూర్చిన బ్ర॥ శ్రీ॥ మ॥ రా॥ రా॥ శ్రీ॥ మానవల్లి రామకృష్ణకవిగారు దెలుఁగువారి కందఱకు నభివందనీయులే యగుచున్నారు. మఱియు వేయిసంవత్సరములకుఁ బూర్వమే యాంధ్రకవితాసతీమతల్లి, యుత్తమకావ్యరత్నభూషణవిభూషిత యై త్రిలింగవాఙ్మయరంగమున మహోన్నతదశను విహరించు చుండినసంగతి నాంధ్రలోకమునకు వెల్లడించుచున్న యశశ్శరీరుఁడు మహారాజకవిరాజశిఖామణి నన్నిచోడదేవుఁడును నాంధ్రమహాజనులకు సంతతస్మరణీయుఁ డగుచున్నాఁడు.

